# పండు యవ్వనం

## సుఖ సంసారానికి సులువైన మార్గాలు

**డా॥ జి. వి. పూర్ణచందు** B.A.M.S.,

ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు, సాహితీవేత్త, శతాధిక గ్రంథకర్త,
తెలుగువారి ఆహార చరిత్ర, ఆహార సంస్కృతుల పైన విశేష పరిశోధన చేశారు.
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, తెలుగు విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘం,
ఇంకా అనేక జాతీయ, అంతర్జాతీయ సంస్థల పురస్కారాలు పొందారు



**శ్రీ షణ్ముఖేశ్వరి ప్రచురణలు**

28-3-51, అరండల్‌పేట, విజయవాడ - 2.

ఫోన్ : 2434320, సెల్ : 94401 72936

# NINDUYAVVANAM

(Sukha samsaraniki suluvaina margalu)

by : **Dr. G.V.Purnachand,** B.A.M.S.,
**Susruta Ayurvedic Speciality Hospital,**
1st Floor, Satnam Towers,
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-2.
Mobile : 94401 72642.



First Edition :
**July 2017**

**Price : 90/-**

Published to mark the event of
61st Birth Day of Dr. G.V. Purnachand

Cover Design :
**Artist Ramu**

Type Setting :
**Madhulatha Graphics**, Vijayawada.

Printer :
**Sri Chaitanya Offset Printers**
Vijayawada - 2.

**Publisher :**
**Sree Shanmukheswari Prachuranalu**
28-3-51, Sanjeevaiah Colony,
Arundalpet, Vijayawada - 520 002
Ph : 2434320 (O). Cell : 94401 72936



పుస్తకమే కలిపింది

మా ఇద్దరినీ!

ఒకటా .. రెండా...

నా నలభై పుస్తకాల ప్రచురణ కర్త

**శ్రీ వి.యల్. నరసారెడ్డి**

తిరిగి ఏమివ్వగలను?

అందుకే, ఈ పుస్తకం

ఆత్మీయంగా అంకితం!!

**- జి.వి. పూర్ణచందు**

# ఇది సంసార వేదం....

- డా॥ జి.వి. పూర్ణచందు

ప్రేమ స్వాతంత్ర్య సంఘం (ఫ్రీ లవ్ సొసైటీ) అనే సంస్థ ఒకటి స్వాతంత్ర్యోద్యమం తొలినాళ్లలో బాగా విస్తృతంగా పనిచేసేదని చెప్తారు.

పెళ్ళిళ్ళు, కడుపులు, వ్యభిచారాల్లాంటి జంజాటాలకు అతీతమైన ప్రేమని ఈ సంస్థ ప్రబోధించేది. అదొక ప్రేమ ప్రపంచం. వ్యక్తిగతమైన స్త్రీ పురుష బంధాల్ని కట్టుబాట్ల చట్రంలో బిగించటాన్ని ఈ ఉద్యమం వ్యతిరేకించేది. పరిణతి పొందిన స్త్రీ పురుషుల మధ్య భావోద్వేగాల పరమైన సంబంధాల్ని, లైంగిక పరమైన సంబంధాల్ని గౌరవనీయమైనవిగానే ఈ సంస్థ పరిగణిస్తుంది. చర్చి ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఇంగ్లండు కార్యస్థానంగా ప్రారంభమైన ప్రేమస్వామ్య ఉద్యమం ఇది. ప్రపంచ వ్యాప్తంగా ఇతర మత దేశాలకూ ఇది విస్తరించింది.

ప్రేమించవలసిందిగా వేధించే యాసిడ్ ప్రేమికుడికి, సెక్సు కోసం భార్యని వేధించే భర్తకీ మధ్య మనస్తత్వ పరంగా ఎలాంటి తేడా లేదనీ, వివాహ వ్యవస్థ అనేది రేప్ చేసే హక్కులిచ్చేది కాదని 'ఫ్రీ లవ్ ఉద్యమం' వాదిస్తుంది. ప్రేమలేని పెళ్ళిళ్ళు రేప్ చేయటం కన్నా ప్రమాదకరమైనవే!

స్త్రీలకు 'ప్రేమస్వాతంత్ర్యం' ఉండాలనే లక్ష్యంతో పందొమ్మిదో శతాబ్దిలో 'ఫ్రీ లవ్' ఉద్యమం బాగా ఊపులోకొచ్చింది. 'ఈ భూమ్మీద సమస్త సుఖోపభోగాలూ అనుభవించటానికి పెళ్ళి ఒక ప్రధాన ఉపకరణం అనీ, ఈ అస్థిర ప్రపంచంలో సుస్థిరమైంది వివాహబంధం ఒక్కటేననీ' భావించటం వలన వివాహ వ్యవస్థలో స్త్రీబానిసత్వం పెరిగిపోతోందనే భావన అందరిలోనూ కలిగింది. ఆ సమయానికి తెలుగు నేలమీద రాజారామ్మోహనరాయి, రఘుపతి వేంకటరత్నం నాయుడు, కందుకూరు వీరేశలింగం ప్రభృతుల ప్రభావం ఎక్కువగా ఉంది. విధవా పునర్వివాహం, దేవదాసీ వృత్తి నిర్మూలన, స్త్రీ స్వేచ్ఛ లాంటి ఉద్యమాలు నడుస్తున్నాయి. భావ ప్రకటనా స్వేచ్ఛ కోసం మహిళలు, పురుష సంస్కర్తలూ పోరాటం సాగించారు. స్వాతంత్రోద్యమం కూడా తోడు కావటంతో మహిళలు స్వేచ్ఛగా బయటకొచ్చి ఉద్యమ బాట పట్టటం కూడా స్త్రీ ఉద్యమానికి తోడయ్యింది. ఆ విధంగా ప్రేమ స్వాతంత్ర్యోద్యమాన్ని తెలుగు వారు త్వరగానే అందుకోగలిగారు.

18వ శతాబ్దిలో మహిళా ఉద్యమం (ఫెమినిజం), 19వ శతాబ్దిలో 'ప్రేమ స్వాతంత్ర్యోద్యమం' మొదలయ్యాయి. పెళ్ళి అనేది మహిళా నిర్మూలనా (annihilation of woman) కార్యక్రమంగా మారిపోతోందని ఈ ఉద్యమం హెచ్చరించింది. తన కిష్టమైన వ్యక్తిని పెళ్ళాడే హక్కు, తన ఇష్టంతోనే భర్తైనా సరే సెక్సుని పొందే హక్కు, తనకు పిల్లలు కావాలో వద్దో నిర్ణయించుకునే హక్కు ఇలాంటివి ఉన్నప్పుడే

పెళ్ళి అనేది సౌఖ్యదాయకం అవుతుంది. కాళ్ళు కడిగి కన్యాదానం చేయటం, పురుషుడు ఆమెని దానం స్వీకరించటం, స్త్రీని పురుషుడికి చట్టబద్ధంగా అప్పగించటాల వలన మాత్రమే వివాహ వ్యవస్థ పవిత్రమైందనటం సరికాదు. స్త్రీ పురుషులిద్దరికీ స్వాతంత్ర్యం కావాలి. ఇష్టం అయిన వ్యక్తిని ప్రేమించటం, తను ప్రేమించే, తనను ప్రేమించే వ్యక్తితో కలిసి జీవించటం ప్రాథమిక హక్కు కావాలని ఈ ప్రేమ స్వాతంత్ర్యోద్యమం కోరింది.

కానీ, కాలక్రమంలో ప్రపంచ వ్యాప్తంగా ఈ ఉద్యమం స్త్రీల చేతుల్లోంచి పురుషుల చేతుల్లోకి మారిపోయింది. చివరికి అది "గే – సెక్స్ (స్వలింగ సంపర్కం)" మరియు Gay rights కోసం పోరాడే ఉద్యమంగా మారిపోయింది.

కాలవైపరీత్యమే అనండి, లేక తప్పనిసరి పరిణామమే అనండి... వివాహ వ్యవస్థ విడాకుల వ్యవస్థగా మారింది. నచ్చిన వాడితో కలిసి జీవించటానికి సహజీవనం అనే ముద్దు పేరు స్థిరపడింది. దీన్ని domestic partnership అంటున్నారిప్పుడు. ఇంట్లో జరిగితే శృంగారం, బయట జరిగితే వ్యభిచారం అనే ధోరణి ప్రబలింది. వ్యభిచారం చేస్తూ పట్టుబడిన ప్రతి జంటా తమది సహజీవనం అంటే చట్టం కూడా నోరెళ్ళ బెట్టే రోజులు ముందున్నాయి. మన చుట్టూ ఉన్న ప్రపంచంలో ప్రేమ ఒక నిషిద్ధ పదార్థంగా మారిపోయేంతగా ఇలా వెర్రిపోకడలు పోతోంది. ఆ దుష్ట ఫలాలు మనకూ బాగానే పండుతున్నాయి.

'భావోద్వేగ పరమైన అవసరాలు (emotional needs)' ప్రేమ ముసుగులో ఆవహించినప్పుడు అది ప్రేమ పరిధి దాటిపోయి, కేవలం అవసరం గడుపుకోవటంగా మారిపోతుంది. అవసరం లేదనిపించి న రోజు ప్రేమకు తాత్కాలికంగా తెరపడ్తుందన్నమాట! పైన చెప్పుకున్న Emotional needs అనేవి ప్రేమకు ప్రాతిపదికలైనప్పుడు మగాడు తన అవసరం తీర్చవలసిన బాధ్యత తనను ప్రేమించే స్త్రీదేననే భావిస్తాడు. "నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నట్టైతే నన్ను ఆపకు... నేను చెప్పినట్టు చెయ్యి... నా చెప్పుకింద తేలులా పడి ఉండు..." అనే మాటలు మొదలౌతాయి. చివరికి 'ప్రేమ స్వాతంత్ర్యం' అనేది ప్రేమ బానిసత్వం అవుతుంది.

మానసిక శాస్త్రవేత్తలు దీన్ని, ఆధునిక సమాజపు పోకడలలో ఒక రుగ్మతగా భావిస్తారు. ఇందుకు తెలుగు నేల మినహాయింపు కాకపోవటమే ఆందోళన చెందాల్సిన విషయం. భావోద్వేగాల సమతుల్యత (emotional equilibrium) ఉన్నప్పుడే ప్రేమ బలంగా, స్థిరంగా ఉంటుంది. 'ఇది కావాలి' అనే కోరిక బలంగా ఉన్నప్పుడు 'ఇది ఇవ్వాలనే' కోరిక కూడా అంతే బలంగా అవతలి వ్యక్తిలో కూడా ఉన్నప్పుడే సమతుల్యత నిలబడుతుంది. లేకపోతే ఏకపక్షంగా మారిపోయి చివరికి పురుషుడి ప్రేమ నియంతృత్వానికి స్త్రీలు లొంగిపోవాల్సి వస్తుంది. మళ్ళీ బానిసత్వానికే బలి కావాల్సి రావటంతో విడాకులకు సిద్ధపడటం తప్పనిసరి అవుతుంది. నా అవసరం ఒక్కటి

కూడా తీరలేదు' అనే అసంతృప్తి ఇద్దరిలో ఎవరికి వున్నా అందులో దాంపత్య శోభ కనిపించదు. ప్రేమికులం అని ఘనంగా చెప్పుకునేవారు ఇద్దరి ప్రేమలలో సమతుల్యత గురించి పెళ్ళికి ముందే ఆలోచించకపోతే దాంపత్యాలు మురిగిపోతాయి.

"ప్రేమ – ఋజుమార్గాన (positively motivated) ఉన్నప్పుడు love అనేది మిమ్మల్ని lovable చేస్తుంది" అంటుంది మానసశాస్త్రం. అనేక నెలలుగా ప్రేమించుకుని, పెద్దల్ని ఎదిరించి పోరాడి పెళ్ళి చేసుకుని మూడో నెలకే విడాకులో, పెటాకులో తప్పని పరిస్థితి ఎక్కువమందిలో వస్తున్నదంటే నిజమైన ప్రేమ విలువ తెలిసే స్థాయిలో వాళ్ల ప్రేమ సాగలేదనే అర్థం. ప్రజాస్వామ్యంలాగానే ప్రేమ స్వాతంత్ర్యం కూడా వక్రమార్గాన పడితే అది ప్రేమ నియంతృత్వానికి దారి తీస్తుంది.

సాధారణంగా తల్లిదండ్రులు తమ పిల్లల ప్రేమ నిజమైన ప్రేమ కాదనే భావిస్తారు. ప్రేమించే తత్వం ఉన్నవారు పిపీలకాది పర్యంతం సమస్తాన్ని ప్రేమించే గుణం కలిగి ఉండాలి. కేవలం ఫలానా అమ్మాయినో లేక ఫలానా అబ్బాయినో మాత్రమే ప్రేమించేట్టుగా ఉండరు. ప్రేమించే గుణం ఎంత ఉందనేది ప్రేమించటానికి అర్హతని నిర్ణయించే ఒక కొలబద్ద. ఎవరికి వారే ఆ కొలబద్దతో తమను తాము విశ్లేషణ చేసుకోవటం మొదట జరగాలి. అదే జరిగితే విడాకుల దాకా వెళ్ళిన వాళ్ళు కూడా కలిసి పడగ్గదికి వెళ్ళగలుగుతారు. నిండుయవ్వనం ఒక సెక్సు పుస్తకం కాదు. ఇది సంసార వేదం. సుఖపడటానికి సెక్స్ కావాలా? అనేమాటని అమ్మనాన్నలు, తాతముత్తతలూ అనుకుని వుంటే ఈ లోకంలో మన ఉనికి ఎక్కడుండేది!

మనం మనిషిలా ఆలోచించి సమూహస్థాయిలో సమాజాన్ని, వ్యక్తిగత స్థాయిలో కుటుంబాన్ని మనం సమాదరించాలి. కలిసి బ్రతకడంలోని సౌఖ్యాన్ని ఈ పుస్తకం, ఆస్వాధనా భాగ్యం కలిగిస్తుంది. నవయవ్వనం నుండి నిండునూరేళ్ళప్రాయం వరకూ మనిషికి కుటుంబసౌఖ్యాన్ని కలిగించే అనేక ఆలోచనలను ఈ పుస్తకం కలిగిస్తుంది. నిండు యవ్వనాన్ని నిలుపుకోవాలనే ఆలోచన ప్రతిఒక్కరికి వుండాలన్నదే ఈ పుస్తకం ఇస్తున్న సందేశం!!

20 ఏళ్ళ కాలంలో శ్రీ మధులత పబ్లికేషన్స్, శ్రీ షణ్ముఖేశ్వరి ప్రచురణలు సంస్థల అధినేత శ్రీ వి.యల్. నరసారెడ్డి దాదాపుగా 40 పుస్తకాలు నేను వ్రాసినవి ప్రచురించి తెలుగు పాఠకులకు ఆహార, ఆరోగ్య వైద్య ప్రయోజనాలను అందించటానికి తోడ్పడ్డారు.

వారికి కృతజ్ఞతాభివాదాలు చెప్పుకొంటూ నా షష్టిపూర్తి సందర్భంగా ఈ పుస్తకాన్ని వారికి అభినందన పూర్వకంగా అంకితం ఇస్తున్నాను.



# విషయసూచిక








| వివరం | పేజీ నెం. |
| --- | --- |

# 1. ప్రేమ

## ప్రేమ స్వేచ్ఛ

- స్వేచ్ఛ (హైదరాబాద్)

ప్ర : ప్రేమదేనికి? సంసారంలోకి లాగి, ఆడదాన్ని అధఃపాతాళానికి తొక్కడానికేనా?

స్వేచ్ఛా ప్రేమ, స్వచ్ఛప్రేమ, రచ్చప్రేమ... ఇలా ప్రేమల్ని రకరకాలుగా పొందవచ్చు. ఈ మూడింటికీ దేని ప్రయోజనాలు దానికున్నాయి. దేని వికారాలు దానికున్నాయి. ప్రేమలోని నిజమైన ఆచరణీయత అర్థం అయితే ప్రేమ సార్థకం అవుతుంది.

### స్వేచ్ఛ ప్రేమ

స్వేచ్ఛ ప్రేమ సంఘం (ఫ్రీ లవ్ సొసైటీ) అనేది ఒక అంతర్జాతీయ సంస్థ. చలంగారు బెజవాడలో ఉన్న రోజుల్లో అది ఇక్కడా కూడా ఉండేదని పెద్దలు చెప్తారు. పెళ్ళిళ్ళు, కడుపులు, వ్యభిచారాల్లాంటి జంజాటాలకు అతీతమైన ప్రేమని ఈ సంస్థ ప్రబోధించేది. అన్ని మతాలు స్వేచ్ఛప్రేమని వ్యతిరేకిస్తాయి. కాబట్టి మతఛాందస వ్యతిరేకోద్యమంగా ఇది మొదలైంది. స్త్రీ పురుష బంధాల్ని కట్టుబాట్ల చట్రంలో బిగించటాన్ని ఈ ఉద్యమం వ్యతిరేకించేది. దీని దృష్టిలో పరిణతి పొందిన స్త్రీ పురుషుల మధ్య భావోద్వేగ పరమైన సంబంధాలూ, వివాహేతర సంబంధాలూ గౌరవనీయమైనవే! ప్రేమించవలసిందిగా వేధించే యాసిడ్ ప్రేమికుడికి, సెక్సు కోసం భార్యని వేధించే భర్తకీ మధ్య మనస్తత్వ పరంగా ఎలాంటి తేడా లేదనీ, వివాహవ్యవస్థ అనేది రేప్ చేసే హక్కులిచ్చేది కాదని 'ఫ్రీ లవ్ ఉద్యమం' వాదిస్తుంది. స్త్రీలకు 'ప్రేమ స్వాతంత్ర్యం' ఉండాలనే లక్ష్యంతో ఈ ఉద్యమం సాగింది.

### స్వచ్ఛప్రేమ

స్వాతంత్ర్యోద్యమం తొలినాళ్లలో తెలుగు నేలపైన భావకవితోద్యమం నడిచింది. రాయప్రోలు సుబ్బారావుగారు 'అమలిన శృంగారం' సిద్ధాంతాన్ని వెలుగులోకి తెచ్చారు. సరస సాంగత్య సుఖ వికాసములకన్నా దుస్సహ వియోగమే ఎక్కువ సుఖవంతమైందనే భావాన్ని ప్రచారం చేశారు. అంతకు పూర్వం ప్రబంధ సాహిత్యంలోని శృంగారనాయిక

స్థానంలో ప్రేయసి ప్రధాన పాత్ర వహించింది. స్వేచ్ఛాప్రేమకు వ్యతిరేకంగా స్వచ్ఛప్రేమ వచ్చింది. ప్రేమికుల మధ్య ఆరాధనాభావన తప్ప స్వచ్ఛప్రేమలో సెక్సు ఉండదు.

**రచ్చప్రేమ**

ఇంక మూడోది రచ్చప్రేమ. ఇప్పుడు నడుస్తున్న సినిమా ప్రేమ ఇది. సెక్సు కోసమే ప్రేమ అనే భావన బలంగా వ్యాపించి ఉంది. ప్రేమపేరుతో రచ్చరచ్చ దీని లక్ష్యం. చదువుకున్నాం కాబట్టి, ప్రేమించాలి కాబట్టి, ప్రేమించటం హక్కు కాబట్టి, ప్రేమించే వారి సంఖ్యే ఎక్కువగా కనిపిస్తోంది. నచ్చిన వాడితో కలిసి జీవించటానికి సహజీవనం అనే ముద్దు పేరు స్థిరపడింది. దీన్ని domestic partnership అంటున్నారిప్పుడు. ఇంట్లో జరిగితే శృంగారం. బయట వ్యభిచారం అనే ధోరణి ప్రబలింది. వ్యభిచారం చేస్తూ పట్టుబడిన ప్రతి జంటా తమది సహజీవనం అనే రోజులు రానున్నాయి.

'ఈ భూమ్మీద సమస్త సుఖోపభోగాలూ అనుభవించటానికి పెళ్ళి ప్రధాన ఉపకరణం అనీ, ఈ అస్థిర ప్రపంచంలో సుస్థిరమైంది వివాహబంధం ఒక్కటేననీ' భావించే మన వివాహ వ్యవస్థ వలన స్త్రీ బానిసత్వం పెరిగిపోయిందన్నది వాస్తవం. పెళ్ళి వలన సాధారణ స్త్రీ నష్టపోయిన మాట కూడా వాస్తవం. 8వ శతాబ్దిలో మహిళా ఉద్యమం (ఫెమినిజం), 19వ శతాబ్దిలో 'ప్రేమ స్వాతంత్ర్యోదమం' పెళ్ళిని "మహిళా నిర్మూలనా (annihilation of woman) కార్యక్రమం"గానే భావించాయి.

భర్తైనా సరే తన ఇష్టంతోనే సెక్సుని పొందే హక్కు, తనకు పిల్లలు కావాలో వద్దో నిర్ణయించుకునే హక్కు, ఇంట్లో సమాన స్థాయిలో జీవించే హక్కు ఇలాంటివి ఉన్నప్పుడే పెళ్ళి అనేది సౌఖ్యదాయకం అవుతుంది. కాళ్ళు కడిగి కన్యాదానం చేయటం, పురుషుడు ఆమెని దానం స్వీకరించటం, స్త్రీని పురుషుడి చేతులకు అందించటాల వలన మాత్రమే, వివాహ వ్యవస్థ పవిత్రమైందనటం సరికాదు. స్త్రీ పురుషులిద్దరికీ స్వాతంత్ర్యం కావాలి. చట్టప్రకారం, ఇష్టం అయిన వ్యక్తిని ప్రేమించటం, తను ప్రేమించే, తనను ప్రేమించే వ్యక్తితో కలిసి జీవితాన్ని పంచుకోవటం స్త్రీ పురుషులకు ప్రాథమిక హక్కులుగానే ఉన్నాయి. కానీ అవి బలంగా నిలబడటం గురించే మనం ఇప్పుడు తర్కించుకోవాల్సి ఉంది. సంసారవేదంలో ప్రేమను నిలబెట్టే బంధాలు ముఖ్యాంశాలు.

# సెక్సు కోసమే ప్రేమ

**ప్ర : సంసార వేదంలో మీరు చాలా విషయాలు ప్రస్తావిస్తున్నారు. మేధావుల పరిధి దాటి జన సామాన్యం కోసం మీ ఆలోచనలు సాగుతున్నాయి. నాదొక వాదన... మీ అభిప్రాయం చెప్పండి... అది సమాజం కోసం కావచ్చు, పెళ్ళి కోసం కావచ్చు, లేక**

**మనుగడకు ఒక పురుషుడి ఆసరా కోసమూ కావచ్చు, ఏదైనా సెక్సు కోసమే ప్రేమ అవుతోంది కదా! దీన్ని ఎందుకు ప్రచారం చేయకూడదూ...?**

**- టియస్ఆర్ఆర్, కరీంనగర్**

**జ :** సెక్సు కోసం ప్రేమ అనే సిద్ధాంతం కూడా అపకారం చేసేదే! 'భావోద్వేగపరమైన అవసరాలు (emotional needs)' ప్రేమ ముసుగులో ఆవహించినప్పుడు అది ప్రేమ పరిధి దాటిపోయి, కేవలం అవసరం గుడపుకోవటంగా మారిపోతుంది. ఈ రోజు సెక్సు అవసరం లేదనిపించినప్పుడు ఆ రోజు ప్రేమకు తాత్కాలికంగా తెరపడకూడదు గదా! Emotional needs అనేవి ప్రేమకు ప్రాతిపదికలైనప్పుడు మగాడు తన అవసరం తీర్చవలసిన బాధ్యత తనను ప్రేమించే వ్యక్తిదేననే భావిస్తాడు. "నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నట్టైతే నన్ను ఆపకు...నేను చెప్పినట్టు చెయ్యి... నా చెప్పుకింద తేలులా పడి ఉండు..." అనే మాటలు మొదలౌతాయి. చివరికి 'ప్రేమ స్వాతంత్ర్యం' అనేది ప్రేమ బానిసత్వం అవుతుంది. అందుకే సంసారవేదంలో భావోద్వేగాల సమ తుల్యత (emotional equilibrium) గురించి ప్రత్యేకించవలసి వస్తోంది. 'ఇది కావాలి' అనే కోరిక బలంగా ఉన్నప్పుడు 'ఇది ఇవ్వాలనే' కోరిక కూడా అంతే బలంగా ఇద్దరిలో ఉన్నప్పుడే సమతుల్యత నిలబడుతుంది. లేకపోతే ఏకపక్షంగా మారిపోయి చివరికి పురుషుడి 'ప్రేమ నియంతృత్వా'నికి స్త్రీలు లొంగిపోవాల్సి వస్తుంది.

# ప్రేమించే మనసు

**ప్ర : ప్రేమ బలంగా ఉన్న వ్యక్తి అని ఎవరినైనా నిర్ధారించటం సాధ్యమా చెప్పండి డాక్టరుగారూ!**

**- కెవిఆర్, ఏలూరు**

**జ :** "మీ ప్రేమ - ఋజుమార్గాన (positively motivated) ఉన్నప్పుడు, love అనేది మిమ్మల్ని lovable చేస్తుంది" అంటుంది మానస శాస్త్రం. అనేక నెలలుగా ప్రేమించుకుని, పెద్దల్ని ఎదిరించి పోరాడి పెళ్ళి చేసుకుని మూడో నెలకే విడాకులో, పెటాకులో తప్పని పరిస్థితి ఎక్కువమందిలో వస్తున్నదంటే నిజమైన ప్రేమ విలువ తెలిసే స్థాయిలో వాళ్ల ప్రేమ సాగలేదనే అర్థం. ప్రజాస్వామ్యం లాగానే ప్రేమస్వామ్యం కూడా వక్రమార్గాన పడితే అది ప్రేమ నియంతృత్వానికి దారి తీస్తుంది. ప్రేమిస్తున్న వ్యక్తిలో ప్రేమించే మనసు ఎంత అనేది పసిగట్టటానికి పెద్ద పరిశోధనలేవీ అక్కరలేదు. ప్రేమించే తత్వం ఉన్నవారు పిపీలకాది పర్యంతం సమస్తాన్ని ప్రేమించే గుణం కలిగి ఉంటారు. కేవలం ఫలానా అమ్మాయినో లేక ఫలానా అబ్బాయినో మాత్రమే ప్రేమించేట్టుగా ఉండరు. ప్రేమించే గుణం ఎంత ఉందనేది ప్రేమించటానికి అర్హతని

నిర్ణయించే ఒక కొలబద్ధ. వ్యక్తిలో 'ప్రేమ స్పెసిఫిక్ గ్రావిటి' తగినంత వుండవు. ఎవరికి వారే అది తమలో ఎంతవుందో విశ్లేషణ చేసుకోవటం మొదట జరగాలి. తదనుగుణంగా తమలో మార్పులు చేసుకుంటే, విడాకుల దాకా వెళ్ళిన వాళ్ళు కూడా కలిసి పడగ్గదికి వెళ్ళగలుగుతారు.

కానీ, తనను బడిలోకి తీసుకోవాల్సిన తన జీవిత భాగస్వామి ఇంట్లో కూడా ల్యాప్ 'టాప్'ని వొడిలోకి తీసుకునే సందర్భాలు చాలామంది ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ఉద్యోగుల ఇళ్ళలో కనిపిస్తుంటాయి. ఇలాంటివి దంపతుల మధ్య మానసిక వత్తిడికి, అసహనం సహజంగానే దారి తీస్తాయి. తన సంగతి పట్టించుకోకుండా టీవీకి అంటుకుపోవటం, ఎక్కడెక్కడో తిరిగి అర్ధరాత్రికి కొంపకొచ్చి హడావిడిగా నాలుగు మెతుకులు గతికి అటుతిరిగి గుర్రుపెట్టటం ఇవన్నీ
సెక్సుని తప్పించుకోవటానికి చేసే ఎలిబీలే అవుతాయి.

# ప్రణయ స్నేహాలు

**- కె. కామినేని (బళ్ళారి)**

**ప్ర : స్త్రీ పురుషుల మధ్య స్నేహాల్లో సెక్సు లేకుండా వుంటుందా? ఉన్నా దాన్ని దాటి నిజమైన స్నేహానికి ప్రాధాన్యత నివ్వటం సాధ్యమేనా?**

కాలేజీలో చదువుకోవటం అంటే ప్రేమించటమే అనేది వాడుకలో ఉన్న అర్థం! ప్రేమించే తీరాలి! కనీసం చదువు పూర్తయ్యే వరకూ అయినా ప్రేమిస్తూ ఉండాలి. ఆ తరువాత రెండో అడుగు మొదలౌతుంది. దానిపేరు లేచిపోవటం. లేచి పోకుండా ఇంట్లో పడి ఉండే బతుకు వ్యర్థం అని 'సినిమాకోడి' కూస్తోంది. ఎవరు అవునన్నా కాదన్నా ఇది నిజం... 'లేచిపోవటం కూడా చేతకాని వాళ్ళు స్వతంత్రంగా జీవించటం తెలియని దద్దమ్మలు" అనే అభిప్రాయాన్ని యువతలో బలంగానే ఎక్కిస్తున్నాయి.

ఎవరికి వాళ్ళు పునర్మూల్యాంకనం చేసుకుంటే ఇది కామమో, మోహమో, ప్రేమో తేల్తుంది. అది 'ప్రేమే' నంటుంది ప్రేమిక హృదయం. "ప్రేమించటం తెలియని వాడివి పిల్లల్ని ఎందుకు కన్నావయ్యా" అని కన్న బిడ్డ తండ్రిని నిలదీసి అడిగితే నోరు మూసుకోవటానికి ఆ తండ్రికి రెండు చేతులూ చాలవు.

ఐదు జ్ఞానేంద్రియాలూ, ఆత్మతో కూడి ఉన్న మనసూ కలిసి, వ్యక్తపరిచేది ప్రేమ. ఐదు కర్మేంద్రియాలతో భావప్రాప్తి పొందాలని కోరుకునేది కామం అని వాత్స్యాయనం నిర్వచించింది. వీటిలో కామప్రవృత్తి సర్వప్రాణికీ సామాన్యమైన విషయం. ప్రేమ ప్రవృత్తి కొందరికి మాత్రమే విశేషంగా ఉండేది. కాబట్టి దీన్ని 'విశేషకామం'గా చెప్పటం జరిగింది. కాముకులంతా ప్రేమికులు కాలేరు! ప్రేమని

కామంలో రంగరించాక అది కామమే అవుతుంది గానీ ప్రేమ ఎంతమాత్రమూ కాదు. కామంతో ముడిపడేది ప్రేమ అంటే, అది అనుకునేవాళ్ళ దౌర్బల్యమే తప్పనిజం కాదు.

కామంలో ఉత్తమ మధ్యమ అధమ స్థాయిలున్నాయి.

1. ఉత్తమ కామం : సత్సంతానం కోసం మాత్రమే జరిపేది ఉత్తమ కామం. స్త్రీకి నెలలో ఒక రోజున మాత్రమే స్త్రీ బీజం విడుదల అవుతుంది. విడుదలై కొద్ది గంటల్లో నశించిపోతుంది. ఆ కొద్ది సేపట్లో పురుష బీజకణాలు ఆమె గర్భాశయానికి చేరి, స్త్రీ బీజాన్ని కలియ గలిగితేనే సత్సంతాన ప్రాప్తి కలుగుతుంది. ఆ ఒక్క రోజున చట్టబద్ధమైన సంతానం కావాలని కోరుకుంటూ, దంపతుల మధ్య జరిగే రతిని ప్రేమ, కామాల చట్రంలో బిగించకూడదు. అది జాతి మనుగడనీ, సమాజ శ్రేయస్సునీ కోరి జరిపేది కాబట్టి, ఉత్తమ కామం.
2. మధ్యమ కామం : సంతాన కోరికతో నిమిత్తం లేకుండా చట్టబద్ధమైన దంపతుల మధ్య, వారు ప్రేమికులు అయినా కాకపోయినా ఇష్టపూర్తిగా జరిగే లైంగిక వ్యవహారాన్ని మధ్యమ కామం అంటారు.
3. అధమ కామం : ఇది రెండు రకాలుగా ఉంటుంది.

(అ) కేవలం కుతి తీర్చుకునేందుకు జరిపే చట్టవ్యతిరేక క్రీడ.

(ఆ) ప్రేమ ముసుగులో జరుపుకునే చట్ట వ్యతిరేక క్రీడ.

ఈ రెండో అంశమే ఇప్పుడు చర్చనీయాంశం. పరమ అసభ్యకరమైన భంగిమల్లో యువతీ యువకుల్ని చూపిస్తూ ఇదే ప్రేమంటే అని మనల్ని నమ్మమంటాయి తెలుగు సినిమాలు. యువతీ యువకులు నమ్మకపోతేనే కదా ఆశ్చర్యం.

"శాస్త్రాణాం విషయస్తావత్ యావన్మందరసా నరః, రతిచక్రేప్రవృత్తేతునైవ శాస్త్రం నచక్రమః శాస్త్రప్రకారం హేతుబద్ధంగా శీలవంతంగా జీవించాలని అనుకుంటారు గానీ, వాత్స్యాయనుడు చెప్తాడు - ఒక సారి రతిచక్రం తిరగటం మొదలెడితే శాస్త్రాలూ, క్రమాలూ ఏవీ ఉండవని!

"వైద్యుడు కుక్క మాంసం రసగుణవీర్య విపాకాలన్నీ శాస్త్రంలో చెప్తాడు. శాస్త్రంలో ఉంది కదా అని దాన్ని తినాలని కాదు. అలాగే సెక్సు విషయంలో పరమ అసహ్యమైన, ఏహ్యమైన, ఛండాలమైన వాటిని కూడా కామశాస్త్రంలో నేను చెప్పాను. చెప్పినంత మాత్రాన అవన్నీ చెయ్యాలని కాదు..." అని తేలికగా తప్పించుకున్నాడు వాత్స్యాయనుడు. దాన్ని అర్థం చేసుకోకపోతే ఆ తప్పు మనదే!

కేవలం కామంతో మాత్రమే మనసు పారేసుకుని ప్రేమించానని భ్రమించి, మోసపోయి అష్టకష్టాలు పడ్డ శకుంతల కథ, ఇంద్రుడు మోసగించి అనుభవించిన

అహల్య కథలు ఈనాటి యాసిడ్ కథలకూ అభయ కథలకూ భిన్నమైనవేమీ కాదు. కామానికీ ప్రేమకూ మధ్య హద్దుగా ఉన్న సన్నని గీతని చెరిపేస్తే వ్యథలే కథలౌతున్నాయి.

పారిశ్రామికీకరణం లోంచి ప్రపంచీకరణంలోకి వ్యవస్థ మారుతున్న కాలంలో ఫేసుబుక్ ప్రేమలు సహజం అవుతాయి. ముక్కూ ముఖం తెలీనివాణ్ణి ఎలా ప్రేమించావే.. అనడుగుతారు ఫేసుబుక్ ప్రేమికురాల్ని, ముక్కూ ముఖం తెలిసి ప్రేమించిన వాళ్లంతా సరైన నిర్ణయాలే తీసుకున్నారన గలమా...? అలాగని తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధాలన్నీ నిలకడగా ఉన్నాయా? విఫల దాంపత్యాలు ప్రేమ పెళ్ళిళ్లలో ఎన్ని ఉన్నాయో, పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్లలోనూ అన్నీ ఉన్నాయి. కాబట్టి, కుటుంబాలు కూలటానికి, ప్రేమ వివాహాలకీ లంకె లేదు. రెండూ వేర్వేరు విషయాలు రెండింటికీ దేని కారణాలు దానివి.

ప్రేమ ముసుగులో సాగుతున్న వ్యభిచారం గురించి మాత్రమే మనం ఆలోచించాలి. ఇది సమాజానికి ఏ విధంగా హాని చేస్తుందో గమనించాలి. "భద్రం ప్రేమ సుమానుషస్య కథ మప్యేకం హితత్సృప్యతే!" అంటుంది శాస్త్రం. ప్రణయస్నేహం అనేది మాత్రమే మంచి మనుషుల్ని సృష్టిస్తుంది. తమది కామం కాదు, ప్రేమే అని వాదించే వాళ్ళు జీవితాన్ని సుఖమంతం చేసుకోవాలనే కదా ప్రేమిస్తున్నారు...! అందుకు మరింత ప్రణాళికా బద్ధంగా, హేతుబద్ధంగా, సర్వజనామోదంగా, బాధ్యతాయుతంగా ఆలోచించాలి. తల్లిదండ్రుల బాధ్యతని కాదని తమ ప్రేమదారిన తాము పోతున్నప్పుడు బాధ్యత తామే తీసుకోవాలి కదా!

# ఆకర్షించటం ఎలా ?

**- శ్రీదేవి (నెల్లూరు)**

**ప్ర : అందరి దృష్టినీ ఆకర్షించేలా వ్యండాలనుకోవటం తప్పా?**

ఇతరుల చేత తాను ఆకర్షించబడాలనే కోరిక మనుషులందరికీ ఉంటుంది. ఆకర్షించగలిగిన వాణ్ణి జెంటిల్'మ్యాన్ అంటారు. How to be charming and liked by everyone అనేది ఒక మంచి చర్చనీయాంశం.

లైక్ అనే పదానికి ఒకప్పుడు ఎంత విస్తృతమైన అర్థం ఉండేదో గానీ, ఇప్పటి రోజుల్లో లైక్ చేయటం అనేది చాలా స్వల్ప విషయం. ఐ లైక్ యూ, ఐ లవ్ యూ అనే పదాలకు ఇప్పుడు కొంపలంటుకుపోయే అర్థాలేమీ లేవు. ఫేస్'బుక్' లో ఒక ఐటం పెట్టగానే ఎక్కువమంది లైకులు కొట్టాలని కోరుకోవటం లాంటిదే ఇది. మనం పోష్టు చేసిన లేదా మనం షేర్ చేసిన అంశానికి ఎక్కువ లైకులొస్తే గొప్పగా భావించుకుంటారు 'ముఖేషులు' అంటే అనగా ఫేసుబుక్ లవర్లు.

ఐ లైక్యూ, ఐ లవ్ యూ అనే మాటలకు ఈ రోజుల్లో పెద్ద అర్థాలు వెదికి అనవసరమైన గాభరా పడాల్సిన పనిలేదు. లైక్ అన్నా, లౌ అన్నా బావుందని చెప్పటమే ఇక్కడ ప్రధానాంశం. ఐ లవ్ యూ అనకపోతే యాసిడ్ పోస్తాననే వాడికి ఆ మాటలో వాడనుకున్న అర్థం ఇప్పుడు లేదు. పక్కింట్లో కుక్కపిల్లను చూసి ఓ అమ్మాయి "ఓహ్! బాబీ... ఐ లవ్ యూ ..." అంది. అంచేత ఆకర్షణ అనే దానికి నిర్వచనాన్ని కుదించి చెప్పటం కష్టమే!

పెళ్ళి చూపుల్లో పెళ్ళికొడుకు బావున్నాడని చెప్పటం ఫేసుబుక్'లో లైక్ కొట్టటం కన్నా గొప్పదేం కాదు. ఎందుకంటే పెళ్ళి కూతురు కూడా లైక్ కొట్టాలి కదా! అది ఈ రోజుల్లో అబ్బాయిలకు అంత తేలిగ్గా దొరకటం లేదు.

లైక్ అంటే దేనికైనా లైకేనా? దేనికైనా ఇష్టపడాలనే మనుషులు ఆకర్షణీయంగా తయారౌతారా? ఆకర్షణీయత అనటంలో లైంగిక సాధకత, సెక్సు ప్రయోజనం, కుతి తీరటం అనే అంశాలు ఇమిడి ఉన్నాయా? అసలు ఆకర్షణీయత అంటే ఏమిటి...? ఆకర్షించబడటం దేనికీ? ఆడయినా మగయినా, ఆకర్షించబడే గుణం అనండి. లక్షణం అనండి. తీరు అనండీ, అది సహజ సిద్ధంగా ఉంటుంది. ఉన్నదాన్ని పెంపొందింప చేసుకోవటానికే మనిషి పడే ఈ పాట్లన్నీ!

కొందరి ముఖ కవళికలు, కొందరి నడక, కొందరి నడత, కొందరి మాట, కొందరి మంచి ఈ ఆకర్షణలకు కారణం అవుతాయి. కొందరిని చూస్తే పెట్టబుద్ధి, కొందరిని చూస్తే మొట్టబుద్ధీ అవుతాయనే తెలుగు సామెత ఇక్కడ చక్కగా వర్తిస్తుంది. ముఖ సౌందర్యం, తల పైన కప్పుకు మేకప్పు, రంగురంగుల వస్త్రధారణలే ఆకర్షణకు హేతువు అనే నమ్మకంతో వాటికి ప్రాధాన్యత ఇస్తుంటారు ఎక్కువమంది.

ఆకర్షణీయంగా ఉన్న స్త్రీలంతా పురుష సౌఖ్యం పొందుతున్నారా...? ఆకర్షణీయ పురుషులంతా స్త్రీ సుఖాన్ని ఆస్వాదించగలుగుతున్నారా...? ఆకర్షణకూ సెక్సు సుఖానికీ సంబంధం ఉన్నదా...? ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు వెదకటం కూడా అవసరమే!

అత్యాధునిక సమాజంలో పెళ్ళిళ్ళనేవి కోట్ల రూపాయల ఖర్చుతో జరుగుతున్నవే ఎక్కువ. కానీ, పెళ్ళయిన ఏడాది తిరక్కుండానే విడాకులకుపోతున్న వారి సంఖ్య వాటిలో సగానికి పైగా ఉంటోన్నదంటే ఆకర్షణ సిద్ధాంతం ఎక్కడో దెబ్బతిందనే అర్థం.

ఆకర్షణ అశాశ్వతం అయిపోతోంది. ఆకర్షణీయమైన విషయాల సంఖ్య తగ్గిపోవటం వలనే ఆకర్షణ కొనసాగలేకపోతోంది. స్త్రీ పురుషులు ఆకర్షణీయతని కలకాలం తమ మధ్య నిలుపుకునే లాగా కొనసాగింపచేసుకోవాల్సిన ఒక నిరంతర ప్రక్రియ. కంప్యూటర్లో ఒక యాప్'ని అప్డేట్ చేసుకున్నట్టే ఆకర్షణని ప్రతిమనిషీ నిలుపుకుంటూ, నిలబెట్టుకుంటూ సాగిపోగలగాలి.

రింగులు ఒదులుతూ సిగరెట్టు త్రాగటం, మద్యం సీసా జేబులో పెట్టుకుని

కనిపించటం, నడుము దగ్గర్నించీ పిర్రలదాకా కనిపించేలా టక్ చేసుకుని తిరగటం, గుండీలు తీసిన బంటులాగా కనిపించటం ఇలాంటి వాటిని అమ్మాయిలు ఎక్కువ ఇష్టపడతారని కొంతమంది కుర్రాళ్ళలో బలమైన నమ్మకం ఉంది. హీరోల చేత ఇలాంటి పనులు చేయించి ఆ సందేశాన్ని ఆడపిల్లల్లో ఎక్కించటానికి కొందరు సినిమాల వాళ్ళు చాలా ప్రయత్నాలు చేస్తున్నారు. కుర్రాళ్ళు మాత్రం వాటిని నమ్ముతున్నారు. ఈ కాలం ఆడపిల్లలు వాటిని నమ్మేంత అమాయకులు కాదు.

నిజానికి ఆకర్షించబడటం "Attracting attention" అనేది కుర్రాళ్లకే కాదు, నడివయసు వాళ్ళకీ, ఆమాట కొస్తే వృద్ధులక్కూడా అవసరమే! ఆకర్షణీయతని సెక్సు పరిధి నుండి ఇవతలకు తీసుకొస్తే, అది వ్యక్తిత్వ వికాస పరిధిలోకి వస్తుంది. సెక్సులో విజయం కూడా వ్యక్తిత్వ వికాసంలో ముఖ్యమే కదా! ఆకర్షణీయతను కోల్పోకుండా కాపాడుకోగలగాలనేదే చెప్పవలసింది.

స్వంత డబ్బా కొట్టుకునేవాళ్ళు త్వరగా ఆకర్షణను కోల్పోతారు. ఇతరులు ఇష్టపడే విషయాలను గమనించుకోకుండా ఏకధాటిగా మాట్లాడుతూ పోయేవాడు కూడా త్వరగా ఆకర్షణను కోల్పోతాడు. ఎదుటివారికి ఇష్టమైన విషయాలే మాట్లాగటం ఆకర్షణను నిలుపుకునే ఒక మంచి ఉపాయం. మన ఆలోచనలు పాజిటివ్‌గా ఉన్నంతకాలం మన ముఖంలో కళలన్నీ పాజిటివ్‌గా ఉంటాయి. చిరునవ్వు చిందే ముఖానికి ఆకర్షణ ఎక్కువ నిలుస్తుంది. ముఖంలో సంతోషం మనసులో సంతోషాన్ని వ్యక్తపరుస్తుంది.

Incessant flirt అంటే, అదేపనిగా సరసాలాడటం వలన లోకువ అవటమే తప్ప ఫలితం ఉండదంటాడు ఒక ఆంగ్ల రచయిత. సరసానికి లోను కాకుండా సరసాలాడే టెక్నిక్కులు తెలుసుకోవాలని ఆడవాళ్లకు ఉద్బోధిస్తాడు. How to flirt with a guy without really flirting అనే పుస్తకంలో ఈ విషయాలు లోతుగా చర్చించాడు. వల వెయ్యటం, వలపించటం, వదిలించుకోవటం అనే మూడు విద్యల్లోనూ ఆరితేరిన వాళ్ళకు ఆకర్షణీయత సహజ శోభనిస్తుంటూదాయన.

పురుషుడు ఆకర్షణీయంగా ఉన్నాడని స్త్రీలు చూడంగానే అమాంతం పడిపోతారనీ, ఫ్లాట్ అయిపోతారనీ చాలా మంది మగాళ్లకు ఒక దురాశ ఉంటుంది. వెర్రిమొర్రి విచిత్ర క్రాఫింగుల్నీ, చెవి రింగుల్నీ, ముక్కు పుడకల్నీ చూసి సినిమాల్లో హీరోయిన్లు ఫ్లాట్ అవుతారేమో గానీ, నిజజీవితంలో అలా ఉండదు.

ఒక పెద్ద గుంపులో ప్రత్యేకంగా అనిపించిన, ప్రత్యేకంగా కనిపించిన, ప్రత్యేకంగా వినిపించిన వ్యక్తి స్త్రీల దృష్టిలో ఆకర్షణీయుడు. ఒక్కోసారి ఆడవాళ్ళ అంచనా తప్పు వచ్చు. అందుకనే, ఆకర్షించబడిన వ్యక్తి సహృదయుడౌతే, అది అతనికి ఒక అవకాశం. హృదయం లేనివాడైతే అది అతని అదృష్టం అవకాశాన్ని దక్కించుకోవాలో, అదృష్టాన్ని చేజిక్కించుకోవాలో ఆ మగాడే నిర్ణయించుకోవాలి! ఇతరులకన్నా తమని తాము

తక్కువ చేసుకుని ఆలోచించే గుణం ఆడవాళ్ళలో అరుదు. అందుకని ఆకర్షణీయత విషయంలో ఆడవాళ్ల అంచనాలు ఇతరులకు అందనంతగా ఉంటాయి. అది తెలియక మగాళ్లు ఆకర్షించబడ్డామనుకుని బోల్తాపడుతుంటారు.

ఒక పురుషుడు స్త్రీని పరిచయం చేసుకున్నప్పుడు గానీ, ఒక స్త్రీ ఒక పురుషుడితో పరిచయం అయినప్పుడు గానీ పొందే ఒక విధమైన ఆదుర్దా (ఏంగ్జైటీ) మానసిక శాస్త్ర రీత్యా చాలా ముఖ్యమైన అంశం. స్త్రీని చూసినప్పుడు ఆదుర్దా కలిగే పురుషుడు గానీ, పురుషుణ్ణి చూసినప్పుడు ఆదుర్దా కలిగే స్త్రీగానీ మానసికమైన నిగ్రహాన్ని పాటించటానికి ప్రయత్నించినట్టే లెక్క.

కేవలం ఆకర్షించబడటానికి మాత్రమే కాకుండా ఆకర్షణీయమైన సహజ సౌందర్యాన్ని పెంపొందింప చేసుకోగలగాలి.

# ప్రేమకు గుర్తులు

**- వై.యస్.ఆర్.ఆర్ (జగిత్యాల)**

**ప్ర : ఒక జంట ప్రేమలో పడ్డారని తెలుసుకోవటం ఎలాగో చెప్తారా?...**

**జ :** స్త్రీ పురుషులు సన్నిహితులుగా ఉన్నప్పుడు పొందే ఒక విధమైన ఆదుర్దా (ఏంగ్జైటీ) మానసిక శాస్త్ర రీత్యా చాలా ముఖ్యమైన అంశం. స్త్రీని చూసినప్పుడు ఆదుర్దా కలిగే పురుషుడు గానీ, పురుషుణ్ణి చూసినప్పుడు ఆదుర్దా కలిగే స్త్రీ గానీ తన మనసులో కలిగిన లైంగికోత్తేజాన్ని అణచుకుని, నిగ్రహాన్ని పాటించటానికి ప్రయత్నించినట్టే లెక్క. మనసు పడ్డప్పుడు పైకి కనిపించే లక్షణం అది. అంతేగానీ, సినిమాల్లో చూపించినట్టు కౌగిలించుకుని ముద్దు పెట్టుకోవటం ప్రేమ కుదిరిందనటానికి గుర్తు కాదు. అది ఆకర్షణ ఏర్పడిందనటానికి కూడా గుర్తు కాదు. అదొక కుతి తీర్చుకునే ప్రయత్నం. అంతే! మీ ఉత్తరంలో వ్రాసిన సంఘటన ఆధారంగా ఆ ఇద్దరిదీ, అది ప్రేమేనని, బలంగా ఉన్నదనీ చెప్పటానికి వీల్లేదు.

# ఆకర్షణని అప్డేట్ చేసుకోండి

**- పిజెఎల్ఎస్ (విజయనగరం)**

**ప్ర : ఆకర్షణ దేనివలన కలుగుతుంది? స్త్రీ పురుషుల్లో ఆకర్షణని కలిగించే అంశాలేవో వివరంగా చెప్పండి డాక్టరుగానూ...?**

**జ :** అదేపనిగా సరసాలాడటం (incessant flirt) ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ (sense of humor) సరదాగా జీవించటం వేర్వేరు అంశాలు. సరసాలరాయుళ్ళు లోకువ అవటమే తప్ప వాళ్ళకి దక్కే ఫలితం ఉండదు. How to flirt with a guy

without really flirting అనే పుస్తకంలో ఈ విషయాలమీద లోతైన చర్చ జరిగింది. వల వెయ్యటం, వలపించటం, వదిలించుకోవటం అనే మూడు విద్యల్లో ఆరితేరిన సరసరాయుళ్ళు ప్రమాదకర వ్యక్తులే!

తనను చూడగానే ఆడవాళ్ళు అమాంతం ఫ్లాట్ అయిపోతారని కొందరు మగాళ్లకు ఒక దురాశ ఉంటుంది. వెర్రిమొర్రి విచిత్ర క్రాఫింగుల్నీ, చెవి రింగుల్నీ, ముక్కు పుడకల్నీ, జిప్పు తీసే ఉన్నట్టు కుట్టిన జీన్సుప్యాంట్లని తొడుక్కుంటే సినిమాలో హీరోయిన్లు ఫ్లాట్ కావచ్చునేమోగానీ, నిజ జీవితం అలా ఉండదు. 'ఏ ఫేస్ ఇన్ ద క్రౌడ్' అంటామే అలా ప్రత్యేకంగా అనిపించిన, ప్రత్యేకంగా కనిపించిన, ప్రత్యేకంగా వినిపించిన వ్యక్తి మాత్రమే స్త్రీల దృష్టిలో ఆకర్షణీయుడు. ఆడవాళ్లలో తమమీద తమకు అపనమ్మకాలు, తమని తాము తక్కువ చేసుకుని ఆలోచించటాలు తక్కువ. ఆకర్షణీయత విషయంలో ఆడవాళ్ల అంచనాలు ఇతరులకు అందనంతగా ఉంటాయి. అది తెలీక మగాళ్లు తాము ఆకర్షించబడటం కోసం చేసే వెర్రిచేష్టల్లో ఈ అతి సరసం ఒకటి!

రెండర్థాల సంభాషణా చాతుర్య ప్రదర్శన, ప్యాంటుని పిర్రలు కనిపించేంతగా జార్చి కట్టటం, గుండీలు తీసుకుని ఛాతీ విరిచి చూపిస్తూ నడవటం... ఈ ఫోజులన్నీ ఆకర్షించబడటానికి మగాళ్ళు పడే పాట్లు. వాటిని వెర్రి ఫోజులుగా గుర్తించే చాకచక్యం ఆడవాళ్లకి సహజంగానే ఉంటుంది. ఆ సంగతి ఫోజులిచ్చే వాళ్ళకు తెలీదు. 'సెన్సు ఆఫ్ హ్యూమర్' కలిగిన వ్యక్తుల హాస్య చతురత ఎదుటిమనిషిని సంతోషపెట్టాలనే తపనతో కూడి ఉంటుంది. కానీ, అతి సరస సంభాషణ ఎదుటి వ్యక్తిని లొంగదీసుకోవాలనే కుట్రతో కూడుకుని ఉంటుంది. మీరు చెప్పిన సెక్సు సమర్థత వగైరాలు ఈ రెండు తరహా వ్యక్తులకు ఉండే అవకాశమే లేదు. అయినా, మాటల్ని బట్టి, చేతల్ని బట్టి సెక్సు సమర్థత నిర్ధారించగలిగేది కాదు!

# 'ఐ లవ్ యూ' లు పెరగాలంటే ?

- కె.కె.ఆర్ (సిద్దిపేట)

**ప్ర : కనీసం ఒక్క ఆడపిల్ల చేతైనా 'ఐ లవ్ యూ' అనిపించుకోని జన్మ వృథా అంటున్నాడు మా ఫ్రెండ్. అలా అనిపించుకోవాలంటే ఏం చెయ్యాలో చెప్పగలరు. నాకు చాలా ఆందోళనగా ఉంది.**

జ : మతిపోయేంత అందమైన కలల సుందరే వచ్చి, మీ రూము తలుపు తట్టి 'ఐ లవ్ యూ' అని చెప్పిందే అనుకుందాం... ఆ తరువాత మీరేం చేస్తారు...? ఈ ప్రశ్నకి జవాబు ముందుగా మీకు మీరు చెప్పుకో గలిగితే 'ఐ లవ్ యూ'లు రావటం పెద్ద విశేషం ఏమీ కాదు. చికుబుకు రైలే అనే సినిమా పాటలో 'అది ఓకే అంటే

గుబులే...' అంటాడే అలా ఉండకూడదు కదా పరిస్థితి? ఇతరుల చేత తాను ఆకర్షించబడాలనే కోరిక మనుషులందరికీ ఉంటుంది. How to be charming and liked by everyone అనేది ఒక మంచి చర్చ. మనలో ఏం చూసి ఎదుటివారు మన పట్ల ఆకర్షితులౌతారు... ఇది తెలియాలి కదా! ఆ లక్షణాలు మనకుండాలి కదా! ఇవ్వాళ్టి వాడుక భాషలో ఐ లవ్ యూ అనే పదానికి మీరు ఊహించినంత పెద్ద అర్థం ఏమీ లేదు. ఫేస్'బుక్'లో లైక్ కొడుతుంటారు. దానికి "లే" గుర్తేగా పెడ్తున్నారు. అలాంటి ఉత్తుత్తి 'ఐ లవ్ యూ'లకు అంతకు మించి ప్రాధాన్యత ఉంద నుకుంటే మీరు పాతరోజుల్లో ఉన్నట్టు లెక్క! మీ సమర్థతనీ, మీ ఉన్నత లక్షణాలనీ గమనించి, నిన్ను నిన్నుగా ప్రేమిస్తున్నా ననే వ్యక్తి తారసపడినప్పుడు ప్రేమ ఫలిస్తుంది. అంతే గానీ ఎవరైనా వచ్చి మిమ్మల్ని ప్రేమించాలని ఎదురు చూస్తే సమకూరేది కాదు. ఇంటర్, డిగ్రీల చదువు పూర్తి చేయాలి కదా! అందాకా ఐ లవ్ యూ అనిపిం చుకునేందుకు కావలసిన ఘనతని, టాలెంట్'నీ, మెరిట్'నీ పెంచుకునే పనిలో ఉండండి.

# ప్రేమభాష

- శర్వాణి, వైజయంతి (విశాఖపట్టణం)

**ప్ర : ప్రేమించేశానని అంత తేలికగా అనేస్తారుకదా! మనుషులంతా ప్రేమవ్యవహారాల్లో ఎందుకు పండలేకపోతున్నారు?**

"తెమ్ము బంగారు కుండ జలమ్ము లనుచుదెమ్ము లతకూన మంచి సుమమ్ము లనుచు

దెమ్ము బాగైన కొమ్మ ఫలముల్లనుచు మించుబోడిని నేరుపు మించ బలుకు" అని చేమకూర వేంకట కవి విజయవిలాసంలో రెండర్థాల పద్యం ఒకటి వ్రాశాడు. "బంగారు కుండలో నీళ్ళు పట్టుకురా! లేతతీగ కున్న మంచి పువ్వులు పట్టుకురా! బాగైన కొమ్మకు కాచిన పళ్ళు పట్టుకురా!" అని, కపట సన్యాసి రూపంలో ఉన్న అర్జునుడు సుభద్రని ప్రేమలోకి దింపేందుకు వాడిన రెండర్థాల భాష ఈ పద్యంలో కనిపిస్తుంది. "బంగారు కుండా! నీళ్ళు పట్టుకురా! లేత తీగలా నాజుకుగా ఉన్నదానా! మంచి పూలు పట్రా! బాగైన కొమ్మా (అందమైన అమ్మాయీ)! పళ్ళు పట్టుకురా!" అనేది ఇంకో అర్థంబంగారు కుండల్ని కుదురైన స్తనాలతోనూ, పూలను మేను మార్దవంతోనూ, పళ్లను ప్రేమలోని తియ్యదనంతోనూ పోలుస్తున్నాడు అర్జునుడు.

కవులు ఇలా రాస్తారు, సినిమా వాళ్ళు కూడా ఇలానే తీస్తారు గానీ, ఇంతమాత్రానికే ఆడపిల్లలు ఫ్లాట్ అయిపోతారని ఈ మగాళ్లు ఊహించటం అన్యాయం. స్త్రీల ప్రేమ నీటి బుడగలాంటిదనీ అది 'పై పై మెరుగులు' చూసే గానీ, అందులో చెప్పుకోదగిన లోతేమీ ఉండదనే భావన ఎక్కువ మందిలో ఉన్నట్టు కనిపిస్తోంది.

16వ శతాబ్ది నాటి చేమకూర వెంకట కవి గారి కాలానికీ నేటి, సినిమాల కాలానికీ ఈవిధమైన మగభావనలో పెద్ద తేడా ఏమీ లేదు.

కానీ ఒక వాస్తవాన్ని మనం మరిచిపోకూడదు. ప్రేమ పెళ్ళిళ్ళు కానీండి, పెద్దలు చేసిన పెళ్ళిళ్లు కానీండి. మూణ్ణాళ్ళ ముచ్చటగా ముగిసిపోతున్న సందర్భాలు నానాటికీ పెరగటానికి దంపతుల మధ్య ఉత్త ఆకర్షణ తప్ప గాఢమైన ప్రేమ కుదరక పోవటం ఒక ముఖ్య కారణంగా కనిపిస్తోంది. ప్రేమ బలంగా ఉన్నప్పుడు చెడు కూడా మంచిగానే కనిపిస్తుంది అది లేనప్పుడు రామా అంటే ఏదోలా వినిపించినట్టే అవుతుంది. 'ప్రేమలో గాఢత' తగ్గినప్పుడు అది దేవదాసు ప్రేమలా అస్థిరంగానూ, బలహీనంగానూ, పిరికిగానూ ఉంటుంది.

రతి కార్యానికి ముందు బలమైన ఉత్తేజం కలగటానికి 'ఉపరతి' ఎలా ఉపయోగపడుతుందో, బలమైన ప్రేమను పొందటానికి 'ఉపప్రేమ' వాచకాలు అలా ఉపయోగపడతాయి. రెండర్థాల సంభాషణ అలాంటి ఒక 'ఉప' యోగం. ప్రేమ బలంగా ఉండాలంటే 'ఉపప్రేమ' అవసరం. సినిమాల్లో చూపించినట్టు 'సిటీ బస్సు ప్రేమ' (బస్సులో చూడంగానే ప్రేమించేయటం, స్విజ్జర్లాండు మంచుకొండల్లో డ్యూయెట్టు పాడుకోవటం) లాంటి ప్రేమలు పెళ్ళి దాకా వెళ్ళేవి తక్కువ. వెళ్ళినా ప్రథమ వైవాహిక వార్షికోత్సవం జరుపుకున్నవి కూడా తక్కువే! బలమైన ప్రేమను పొంది, శాశ్వతమైన దాంపత్య బంధాన్ని పెంచుకోగలగాలి! పెద్దలు చేసిన పెళ్ళిళ్లక్కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది.

సుభద్రలో తనపైన ప్రేమని రెచ్చగొట్టి, దాన్ని భద్రం చేసుకోవటానికి అర్జునుడు ఎన్ని కష్టాలు పడ్డాడో ఈ కావ్యం చదివితే తెలుస్తుంది. ప్రతిదీ సులభమ్ముగా సాధ్యపడదులెమ్ము - నరుడు నరుడౌట దుష్కరమ్ము సుమ్ము" అని గాలిబ్ గీతాన్ని దాశరథి గారు అనువదించి వ్రాసింది ప్రేమకు కూడా వర్తిస్తుంది. ప్రేమలో పడేయటానికి, ప్రేమలో పడటానిక్కూడా ప్రేమభాష తెలిసి ఉండాలి. నమ్మకాన్ని పెంచటం, నమ్మకాన్ని నిలబెట్టటం, నమ్మగలగటం అనేవి ఈ భాషలో ముఖ్యాంశాలు. అవి సుస్థిరంగా ఉండాలి. విడాకుల బారిన పడకుండా ఉండాలంటే ప్రేమికులు నేర్చాల్సింది ప్రేమ భాషనే!

## బూతు సందేశాల ఇచ్చిపుచ్చులాట- సెక్స్'టిజం

ఒక స్వల్పవర్గం మేధావులు ఆధునిక సాంకేతిక ప్రయోగాలతో ఎక్కడలేని అద్భుతాలనూ ఆవిష్కరిస్తూ ఉంటే, మేధా సంపత్తి శూన్యం అయిన అధునిక అత్యధికులు ఆ సాంకేతికతను దుర్వినియోగ పరచుకోవటాన్నే నాగరికతగా భావిస్తున్నారు. టివీల దగ్గరనుండీ సెల్'ఫోన్లవరకూ సాంకేతికతని మేధావులు జనసామాన్యానికి చేరువ చేస్తుంటే వాటి వినియోగం ఏ స్థాయిలో దుర్వినియోగం అవుతోందో మనందరికీ తెల్సు.

సెక్స్‘టింగ్ (Sexting) సెల్‘ఫోన్లలో ఇప్పుడొక కొత్త ఆట. ఫోనుద్వారా సెక్సు సందేశాలు పంపటం 21వ శతాబ్దినాటి ఈ ఆటలో ముఖ్యాంశం. Sex మరియు Texting -- అంటే లైంగిక మరియు సందేశాలు పంపటం. ఈ రెండు పదాలూ కలిపి ‘సెక్స్టింగ్’ అంటున్నారు. ఇదొక ఆట! సెక్సిష్టులు ఆడే ‘సెక్స్ట (sext)’ ఆట. సెల్‘ఫోన్ ద్వారా నగ్న, అర్ధనగ్న బొమ్మలు, లోదుస్తుల్లో తమ ఫొటోలు, నాన్‘వెజ్ జోకులు, ఆ ఇద్దరూ సెక్సులో పాల్గొంటే ఎలా ఉంటుందో ఊహించుకుంటూ వర్ణనలూ రాసి మెసేజిలు పంపుకోవటం ఈ ఆటలో ప్రధానం.

ఆగష్టు 2012, మెరియం వెబ్‘స్టర్ నిఘంటువులో సెక్స్ట, సెక్స్టింగ్, సెక్స్టిష్ట్ పదాలు చేరాయని వికిపీడియా చెప్తోంది. ఈ ఆట లండన్‘లో మొదలై, ఆస్ట్రేలియా, అమెరికా రాష్ట్రాలు, కెనడాలకు విస్తరించింది. ఆ రెండు దేశాలకూ చేరిందంటే, ఇండియాకు ఆగమేగాల మీద చేరుతుంది.

పూర్వం హంస రాయబారాలు, కాకి రాయబారాలు, పావురం రాయబారాలు ఉండేవని మన సాహిత్య అధారాల ద్వారా తెలుస్తుంది. అల్లూరి సీతారామరాజు మిరపకాయ టపాలు పంపేవాడట. తీవ్రవాదులు ఇప్పుడు ‘ఇ-మెయిల్ సందేశాలను ఎక్కువగా వాడుతున్నారు. అమ్మాయిలూ అబ్బాయిలూ మాత్రం సెల్ సందేశాలకు ఎక్కువ మక్కువ చూపుతున్నారు. బాగా ఉచిత మెస్సేజీ లిచ్చే ప్యాకేజీలకు యువతీ యువకులు ఎగబడటాన్ని మనం గమనించవచ్చు. ఆ వయసులో వాళ్ళు వందల్లో పంపే సందేశాలు ఏవుంటాయని అడక్కండి. ఛాటింగ్ అనేది ఒక సాంకేతిక విప్లవం. లోకం మునిగి పోతున్నా పట్టని ఒక గొప్ప ఔదార్యాన్ని ఇది చాటర్లకు కలిగిస్తుంది.

మిథిలా నగరం మొత్తం మునిగి పోయినా నేను బాధపడను,ఇందులో నాదంటూ పోయేదేమీ లేదన్నాడట జనక మహారాజు. ఆయన్ని గొప్పగా పొగిడి. రోము తగలబడుతుంటే వయొలిన్ వాయించాడని నీరో చక్రవర్తిని తిట్టడం అన్యాయం. ఈ ఇద్దరినీ మించిన నిర్లిప్తత, పట్టని తనం, ఎవడేమైపోతే మనకెందుకనే గొప్ప గుణాలను మనుషుల్లో ఈ ఛాటింగ్ పెంపు చేస్తుంది. సెక్సు కుతి తీరటానికి తప్ప ఇంతకు మించి వీటిలో వాళ్ళకు ఉపయోగపడేదేదీ ఉండదు.

సెక్స్‘టిజం సెల్లు సందేశాల్ని పెద్దవాళ్ళు చూసి ఇదేవిటని అడిగారనుకోండి, పిల్లలు ధైర్యంగా ఇలా అంటున్నారు: “ఏవుందండీ ఇందులో... ఇది కేవలం సందేశాలు ఇచ్చి పుచ్చుకోవటమే! ఇంతలోనే శీలం పోతుందా? కడుపొచ్చేస్తుందా...?” అని! ఇలా యువతీ యువకులు తామేదో ఎదిరించి మాట్లాడుతున్నామని కూడా అనుకోవటం లేదు. ‘ఇచ్చిపుచ్చులాట (Sexting)’ అనేది చాలా కామన్ విషయం అనీ, మోడర్న్ ఏజిలో ఇలాంటివి సహజం అనీ, తల్లిదండ్రులు వీటిని చూసీ చూడనట్టు పోవాలనీ వాళ్ళలో చాలామంది అనుకుంటున్నారు. కాదు, అంటున్నారు.

ఒకప్పుడు ఆడపిల్లలు వాళ్ళీడు మగ పిల్లలవైపు చూస్తేనే పెద్ద తప్పు చేసేసినట్టు భావించేవాళ్ళు. చేతి వేళ్ళు తగిలితే చాలు కొంపలంటుకున్నట్టే అనుకునేవాళ్ళు. ఇప్పుడు ఏకంగా కావులించుకుని ముద్దు పెట్టుకున్నా తప్పు లేదంటున్నారు. ఒకప్పుడు సామాన్య ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకమైన ఆలోచనలను చేయటాన్ని అభివృద్ధి నిరోధకత అనే వాళ్ళు. ఇప్పుడు ఇలాంటి దృశ్యాలు కళ్ళలో పడితే వ్యతిరేకించటాన్ని అభివృద్ధి నిరోధకత, ఛాందసవాదం, సాంప్రదాయవాదం, తిరోగమనం అంటున్నారు. ఒకప్పుడు భావకవిత్వం అంతా ఇలాంటి సందేశాలతోనే నిండి ఉండేది. ఇప్పుడు సెక్స్'టిష్టులు తమ సందేశాల్లో అద్భుతమైన కవిత్వాలు రాస్తున్నారు. కృష్ణశాస్త్రి, వేదుల వీళ్ళముందు పనికి రారన్నంత గొప్ప కవిత్వం ఈ ఇచ్చిపుచ్చులాట సందేశాల్లో జాలువారుతుంటుంది. కాలం తీరు ఇది. భావ కవుల్ని పొగిడి వీళ్ళని తెగడటం కూడా సబబు కాదేమో!

న్యూ హాంప్'షైర్ విశ్వవిద్యాలయంలో జరిగిన ఒక పరిశోధనలో 1,560 మంది చిన్న పిల్లల సెల్ఫోన్లు తెరిచి చూస్తే, వాటిలో కూడా 9.6% సెక్స్'టింగ్ సందేశాలు, బూతు బొమ్మలు (pornography), నగ్న- అర్థ నగ్న దృశ్యాలు (రిస్కీ ఫొటోలు), ఉన్నట్టు తేలింది. 18-20 ఏళ్ళ మధ్య అమెరికన్ యువతీ యువకుల్లో 20% మంది సెక్స్'టిష్టులున్నారని తాజా అంచనాలు చెప్తున్నాయి. సెక్స్'టిష్టుల్లో 61% మగవాళ్ళుండగా, 48% ఆడవాళ్ళు ఈ ప్రణయసందేశాలకు అలవాటు పడి ఉన్నారంటే పరిస్థితిని అంచనా వేసుకోవచ్చు.

లోకం పోకడ ఎలా ఉందో, ఎలా ఉండబోతోందో, భారతదేశం లాంటి ఎదిగీ ఎదగని పరిణతి కలిగిన దేశం మీద వీటి ప్రభావం ఎలా ఉండబోతోందో గ్రహించటం అవసరమే! ప్రతీ పెరుగుదలకూ ఒక విరుగుదలని కూడా వెదుక్కోవాలి. మానసిక శాస్త్రవేత్తలు ఈ అంశంమీద దృష్టి సారించి పరిశీలన చేస్తున్నారు. ఫేస్ బుక్ లాంటి వాటిల్లో కూడా ఎవడో ఒకడు ఒక దృశ్యాన్ని పెడతాడు. యువత దాన్ని షేర్ చేస్తుంటారు. ఇందులో సెక్సు కుతి కొంతమేర ఉన్నప్పటికీ, ఎక్కువ లైకులు కొట్టించుకుని, ఆ లైకుల సంఖ్యని ఒక గొప్పగా మిత్ర బృందంతో చెప్పుకోవాలనే తాపత్రయాన్ని చాలామంది కుర్రాళ్ళలో తరచూ చూస్తూనే ఉంటాం. ఇది ఒక విధమైన ఎగ్జిబిషనిజం. ప్రదర్శనా తత్త్వం. గుంభనంగా జరుపుకునే అతి రహస్య విషయాలను ఇలా రికార్డేడ్ గా పంపటాన్ని తప్పకుండా మనో వికారంగానే భావించవలసి ఉంటుంది. మనో వికారాలు యువతీ యువకుల్లో లైంగికతని(%రీలినితిబిజిరిశిగి%) వక్రమార్గాన పట్టిస్తాయి. అది వారి నిండు లైంగిక జీవితానికి తప్పకుండాదెబ్బ కలిగిస్తాయి. భవిష్యత్తులో లైంగిక వేధింపులక్కూడా ఇది దారి తీయవచ్చు. తల్లిదండ్రులు ఉపాధ్యాయులూ ఒక కంట కనిపెట్టకపోతే భావి భారత పౌరుల ధ్యాస పక్కకు మళ్ళి పోతుంది.

# 2. శృంగారం

## మనసు అలంకారం

- డి యస్ డి - రుద్రవరం

ప్ర : సుఖప్రాప్తి బాగుండాలంటే మంచి అలంకారం చెప్పగలరా డాక్టరుగారూ...?

జ : శరీరాన్ని నిలువెత్తు బంగారంతో అలంకరించుకున్నంత మాత్రాన అది ఎవరికివారికి లైంగికోద్దీపనాన్ని కలిగిస్తుందనుకోవటం
పూర్తి వాస్తవంకాదు. మొదట, మనసుని చక్కగా అలంకరించుకోవాలి. అందులో స్ట్రెస్సు లాంటి అడ్డుభావన లేవీ లేకుండా చూసుకోవాలి. తరువాత శరీరాన్ని అలంకరించుకోవాలి. అందులో ఎలాంటి వికారాలూ కలగకుండా జాగ్రత్తపడాలి. ఉదాహరణకు మీ జీవిత భాగస్వామికి వెల్లుల్లి సరిపడదనుకోండి, మీ శరీరంలోంచి వెల్లుల్లి గవులు కంపు కొడుతుంటే అవతలి వ్యక్తి పూర్తిగా సెక్సు విముఖతకు లోనయ్యే ప్రమాదం ఉంటుంది! తాగి ఇంటికి వచ్చి సారాకంపుకొట్టే మొగుడితో భార్య పొందేది లైంగిక సుఖం కాబోదు కదా! యాంత్రికంగా ఆ తాగుబోతుకు ఒళ్ళప్పగించి అయిందన్నాక అటు తిరిగి పడుకునే భార్యలే ఎక్కువ మంది ఉన్నారని ఒక సర్వే చెప్తోంది. ఇద్దరికీ లైంగికోత్తేజకరంగా ఉండేలా పడక గది అలంకారం ఉండాలి. అందులో మంచం కింద ఆరబోసిన ఉల్లిపాయలూ, మంచం పక్కన మురికి గుడ్డలూ, చుట్టూ వ్యాపించిన బూజు, ఎక్కడో ఎలిక చచ్చిన వాసన... ఇలాంటి పడక గదుల్లో జరిగేది కక్కుర్తి వ్యవహారమే గానీ, అది నిజమైన దాంపత్య సుఖ ప్రేరకం ఎంతమాత్రమూ కాదు. మనసును అలకరించుకుంటే గదుల్ని అలంకరించుకోవటం తేలిక అవుతుంది.

## సెక్సు - నిజాయితీ

- జికెహెచ్, అనంతపురం

ప్ర : సెక్సు వలన ప్రయోజనం సుఖం పొందటమేనా? ఇంకా ఏదైనా ఉన్నదా? దాన్ని సాధించటం ఎలాగో చెప్తారా?

జ : సెక్సు వలన మనసులోంచి వత్తిడి (స్ట్రెస్సు) అనే దయ్యం పారిపోతుంది. ప్రియమైన వ్యక్తి ఆలింగనంలో ఒక్క క్షణం సేదతీరితే ఎంత వత్తిడి నుంచైనా బయట పడగలుగుతారు మనుషులు. ఏవి ఎలా ఉన్నా మనసు అనేది సెక్సు విజయాన్ని ప్రసాదించే గొప్ప ఔషధం. అది నిర్మలంగా ఉండాలి. సెక్సు సమర్థతకు నిజాయితీ

అనేది అస్సలైన గుర్తు. నిజాయితీ లేని వ్యక్తి సెక్సుకు తలపడినప్పుడు గిల్టీ కాన్షస్ అంటామే – అపరాధ భావన – అది ఆ సమయంలో ప్రభావం చూపిస్తే ఆ వ్యక్తి సెక్సు పరమైన అపజయాన్ని చవి చూడవలసి వస్తుంది. ఇవన్నీ స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా వర్తించే విషయాలే! మానసిక వత్తిడి (స్ట్రెస్సు)ని తెచ్చే వాటిలో అపరాధ భావన కూడా ముఖ్యమైందే! సెక్సువలన మనిషికి కలిగే అదనపు ప్రయోజనం భార్యాభర్తలు పరస్పరం ఒకరిపట్ల ఒకరు నిజాయితీగా ఉండగలగటం అంటాను. దాన్ని సాధించటం ఎట్లాగో చెప్పాలని అడిగారు. నిజాయితీ కలిగి ఉండటమే దాన్ని సాధించటానికి మంచి ఉపాయం. సంసారవేదంలో ఇదే ముఖ్యమైన విషయం.

# రతిరూల్సు

– డి.వై.ఆర్. ఖమ్మం

**ప్ర : మీ శీర్షిక 'సంసార వేదం' కొత్త ఆలోచనల్ని కలిగిస్తోంది. రొటీనుగా పత్రికల్లో వచ్చే వాటికన్నా భిన్నంగా ఉంటున్నాయి. నాదొక సందేహం ... గొప్ప రతికి రూల్సు ఏమిటో వివరంగా చెప్తారా?**

**జ :** సెక్సనేది ఇచ్చి పుచ్చుకునే ఒక భావావేశం. అది, గది నాలుగు గోడలమధ్య ఇద్దరికి మాత్రమే పరిమితమైన వ్యవహారం. గెలుపోటములు నిర్ణయించే అంపైర్లెవరూ ఉండని ఒక రహస్య క్రీడ. దానికి నియమనిబంధన లేవీ ఉండవు. ఇద్దరి అంగీకారంతో జరిగే ఒక 'రాగుంజు పోగుంజు'లాట అది! ఇందులో చేయటం చేయబడటం అనే రెండు వ్యవహారాలు ఉండవు. ఆడది సుఖపెట్టేది, మగాడు సుఖపడేవాడు అనే అభిప్రాయానికి తావు లేదు. సుఖ సంతోషాలను ఇచ్చి పుచ్చుకునే సమస్థితి ఉన్నప్పుడే అది ఆరోగ్యదాయకమైన దాంపత్య సుఖానుభూతి నిస్తుంది.

# లైంగిక సమర్ధతను పెంచే అంశాలు

– కె.కె. (గిద్దలూరు)

**ప్ర : సెక్సు సమర్ధతను పెంచే అంశాలు ఏవో వివరంగా చెప్తారా?**

లైంగిక సమర్ధతని చాలామంది అదంతా తమ జననాంగ ప్రతిభ అనుకుంటారు. మగవాళ్ళలో ఈ రకమైన ఆలోచనా ధోరణి ఉన్నవాళ్ళే ఎక్కువమంది కనిపిస్తారు.

లైంగికశక్తి కూడా ఒక శక్తే (energy) ! అది మనసులో జనించే ప్రేరణల గుణాత్మకమైన పరిమాణం (quantitative magnitude of instincts) అంటాడు సిగ్మండ్ ఫ్రాయిడ్ ఆయన మనోవిశ్లేషణా శాస్త్ర పితామహుడు మనసులో జనించే కోరికలకు లేదా ప్రేరణలకు (Instincts) కొంత శక్తి ఉంటుంది. దాన్ని మనోప్రేరక శక్తి

(instinct energy of force) అంటారు. దీన్నే మరోరకంగా చెప్పాలంటే లిబిడో అంటారు. 'లిడిడో' అంటే, బలమైన మనోప్రేరణ (sex drive) ! రిరంస లేదా లాలసగా దీన్ని పిలవొచ్చు. ఈ లిబిడో అనేది మనసులోని నిజమైన లైంగిక శక్తి లిబిడో తక్కువగా ఉన్నప్పుడు లైంగికశక్తి, లైంగిక ఆసక్తి రెండూ కూడా తక్కువగా ఉంటాయి.

లిడిడోని కాముకతగా చెప్పటం కూడా సరికాదు. కాముకత లేనివాళ్ళు లైంగికతను పవిత్రమైనదిగా భావించుకునేవాళ్ళు ముద్దపప్పులని అని ఎవరైనా అనుకుంటే పొరబాటు ఎందుకంటే కాముకత అతిగా ఉన్న వాళ్లంతా లైంగిక సమర్ధత గొప్పగా కలిగిన వాళ్ళే ననటానికి వీల్లేదు కాబట్టి! అతి కాముకత కూడా లైంగిక అసమర్ధతలో ఒకటి కాబట్టీ!!

లైంగిక ప్రేరణ (Sex drive) అనేది శారీరకమైన, మానసికమైన సామాజికమైన కారణాల మీద ఆధారపడి ఉంటుంది. ఈ మూడూ లైంగికశక్తిని నిర్ధేశించే మూడు ముఖ్యమైన అంశాలు. ఈ మూడూ లైంగికతను నిలబెట్టే 'టెస్టోస్టిరోను' హార్మోనుని ప్రభావితం చేస్తాయి. 'టెస్టోస్టిరోను' హార్మోను బలం మీదే లైంగికబలం ఆధారపడి ఉంది.

లైంగికత మాత్రమే కాదు, ఆ వ్యక్తి, వ్యక్తిత్వం, మానసిక ఉన్నతి, మానసిక ఆందోళనలకు లొంగని ధృడచిత్తత అనేవి కూడా ఆధారపడిఉన్నాయి. ఇవన్నీ ఒకదానిపైన ఒకటి ఆధారపడి, ఒకదాని నొకటి ప్రభావితం చేసుకునే అంశాలన్నమాట! దీన్ని ఎలా అర్ధం చేసుకోవాలంటే ఉన్నతమైన మానసిక స్థితి, వ్యక్తిత్వ వికాసం కలిగి మనోబలం ప్రదర్శించే వారిలో లైంగిక శక్తి కూడా బలంగా ఉంటుందని అర్ధం! అవును! లోకోపకారకులకు బలమైన లైంగికశక్తి ఉంటుంది. లోకహాని చేసేవారిలో కాముకత మాత్రమే ఉంటుంది. అది లైంగిక బలసంపన్నత కాబోదు.

లైంగిక బలానికీ, కాముకతకూ మధ్య, నిజమైన ప్రేమికుడికీ, యాసిడ్ ప్రేమికుడికీ ఉన్నంత తేడా ఉంటుంది.

Hypersexuality (కాముకత) healthy sexuality (దాంపత్యభావన, ప్రేమ) Asexuality (వైరాగ్యం) ఈ మూడింటి గురించీ కొంత చర్చ జరగవలసిన అవసరం ఉంది.

వీటిలో కాముకత అనేది ప్రేమభావనను తగ్గించటం ద్వారా లైంగిక శక్తిని చంపుతుంది. వైరాగ్యం అనేది మనో నిగ్రహాన్ని పెంపొందింప చేయటం ద్వారా మనసును ఉత్తేజితం చేసి, ప్రేమభావననూ, లైంగికశక్తినీ పెంపొందింపచేస్తుంది.

కామానికి లొంగిపోయి ఆచరణలో పెట్టటం వలన మనోబలహీనత కలుగుతుంది. కామాన్ని ఎదిరించి జయించి నిగ్రహాన్ని ప్రదర్శించటం వలన మనోబలం పెరుగుతుంది. అణచివేయబడిన మనోప్రేరక శక్తి (instinct energy or force) మనోబలంగా మార్పిడి చెందుతుంది. ఈ మార్పిడి చెందటాన్ని సబ్లిమేషన్ అంటారు. మనుషులు సబ్లిమేట్ అయినప్పుడు మనోబలసంపన్నత కలిగి ఆరోగ్యవంతమైన లైంగిక సంపన్నతను సాధించుకుంటారు. సబ్లిమేట్ కాలేని వాళ్ళు లోకహాని కారకులుగా మిగిలిపోతారు. మనోబలం, లైంగికబలం కలిసి ప్రపంచ శాంతిని సాధిస్తున్నాయన్నమాట.

శారీరక మానసిక, సామాజిక పరిస్థితులకు తగ్గట్టుగా మనో మనోప్రేరక (instinct energy) శక్తుల్ని నడుపుకు పోగలిగే స్త్రీ పురుషులు దాంపత్య సుఖాన్ని, సంసారిక సుఖాని, సమాజ సుఖాన్ని, సంతృప్తినీ, మళ్ళీ మళ్ళీ పొందాలనే బలమైన కోరికనీ పొందగలుగుతారు.

కాబట్టి, కోరిక ఎంత బలంగా ఉంటే దాన్ని నెరవేర్చుకోగలిగే సమర్థత అంత బలీయంగా ఉంటుంది. అయితే యాసిడ్ ప్రేమికుడు కూడా తనది బలమైన కోరికేనంటాడు. ఎంత బలమైనదంటే అది తనకు దక్కకపోతే ఇంకెవరికీ దక్కనీయనంత బలమైనదంటాడు. దీన్ని లైంగిక సమర్థత అనగలమా? ఎందుకంటే, లైంగిక సమర్థత నెరవేరాలంటే ఆ స్త్రీ పురుషుల మధ్య ఆవేశం సమానంగానూ, ఆకాంక్ష బలంగానూ, ఆనందం చెరిసగంగానూ ఉన్నప్పుడే అది నిజమైన లైంగిక సమర్థత అవుతుంది. మనోబలం అనేది లైంగిక బలానికి పునాదిగా ఉంటుందన్నమాట! మనోబల సంపన్నత సిద్ధించినప్పుడే లైంగిక బలసంపన్నత కూడా సిద్ధించే అవకాశం ఉంటుందని అర్థం చేసుకోవాలి.

ఈ కారణాలన్నింటినీ పక్కన బెట్టి లైంగిక సమర్థత, నపుంసకత, అంగము చిన్నదగుట, హస్తప్రయోగం, శీఘ్రస్ఖలనం మొదలైన లైంగిక సమస్యలకు తక్షణ నివారణ ఆని ప్రకటనలిచ్చే వైద్యుల చుట్టూ తిరుగుతూ కాలాన్ని, ధనాన్ని, గౌరవాన్నీ ఖర్చుపెట్టుకుంటూ ఉంటారు.

లైంగిక శక్తిని, ఆసక్తినీ చంపేసే వాటిలో మదుగులేని సంసారం, మనోదౌర్బల్యం, వత్తిళ్ళు, కుటుంబ పరిస్థితులు, అనుకూలత లేని దాంపత్యం, గొప్పగా చేసేయాలనే అతి తాపత్రయం... ఇలా అనేక అంశాలు ప్రభావితం చేసేవి ఉన్నాయి. వాటన్నింటి గురించీ మనం చక్కగా నిస్సిగ్గుగా, నిర్మొహమాటంగా మాట్లాడుకోవాల్సిన అంశాలు ఎన్నో ఉన్నాయి.

సమస్త అనారోగ్యాలకు ఏవి కారణమో లైంగిక పరమైన అనారోగ్యాలకూ అవే కారణం. కాకపోతే కాళ్ళనొప్పులో, కీళ్ళనొప్పులో ఉన్నాయని చెప్పుకున్నంత

తేలికగా లైంగిక సమస్య గురించి స్త్రీ పురుషులు చెప్పుకోలేరు. గమ్మత్తేవిటంటే జంతకట్టే దంపతులు కూడా ఒకరికొకరు చెప్పుకోరు. ఇందువలన అసంతృప్తితో కూడిన సంసార జీవితం అనేక ఒడిదుడుకులను చవి చూస్తుంటుంది.

# వేసవిలో లైంగిక శక్తిని కాపాడుకోవాలి

- కె.వి.డి. ప్రసాద్ (కానూరు)

**ప్ర : సర్! సమ్మర్‌లో సెక్సు ధ్యాస తక్కువగా వుంటుందా? ఈ సీజన్లో ఏ జాగ్రత్తలు పాటించాలి.**

వేసవి కాలంలో లైంగిక శక్తి, లైంగిక ఆసక్తి కూడా తక్కువగా ఉంటాయి. భార్య దూరమైనప్పుడు బతుకు ఎండాకాలం అయిపోయిందంటారు. చెట్లు చిగిర్చేప్పుడు ఉండేంత శోభ ఎండిపోయేప్పుడు ఉండదు కదా! వేసవిలో లైంగిక శక్తిని కాపాడుకుంటే మళ్ళీ వర్షాకాలంలో మనసు ఆర్ద్రతను పొందగలుగుతుంది.

వేసవికాలం శరీరంలోంచి శక్తిని తీసుకుంటుంది. శీతాకాలం శరీరానికి శక్తిని ఇస్తుంది. కాబట్టి, చలవ చేసే వాటిని తీసుకోవటం ద్వారా శరీర శక్తిని కాపాడుకోవాలి. ఇక్కడ శక్తి అనేది శారీరక శక్తి మాత్రమే కాదు. లైంగిక శక్తికి కూడా ఇవే వర్తిస్తాయి. వేసవికాలంలో ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో శాస్త్రంలో చెప్పింది సరిగా అర్థం చేసుకుంటే దాని ప్రయోజనం లైంగిక శక్తిని కాపాడుకోవటానికేనన్న సంగతి అనుభవంలోకొస్తుంది!

**"స్వాదు స్నిగ్ధ హిమం లఘు ద్రవమయం ద్రవ్యం రసాలాం సితాం సక్తు క్షీరమజాంగలాని సితయా శాలిం రసం మాంసజం/ శీతాంశుం శయనం దివాబలయజం శీతం పయ: పానకం సేవేతోష్ణదినే త్యజేత్తు కటుక క్షారామ్ల ఘర్మ** శ్రీమాన్ ఒక్కొక్క పదం విడదీసి చదివితే ఈ శ్లోక భాగం బాగానే అర్థం అవుతుంది.

- స్వాదు : తియ్యగానూ సౌమ్యంగానూ ఉండే పదార్థాలను తినాలి.
- స్నిగ్ధ : ఆహార పదార్థాలను కొద్దిగా నేతితో తినాలి. నెయ్యి పోసుకుని తినకూడదు. వేసుకుని తినాలి.
- హిమం : ఏది తిన్నా చలవ చేసేదిగా ఉండాలి. చలవచేసే వాటిలో బీర, పొట్ల, సొర, ముల్లంగి, క్యారెట్టు, క్యాబేజీ, క్యాలీఫ్లవరు, పాలకూర, తోటకూర, మెంతికూర, లేతబెండ, లేత దొండ... ఇలా కూరగాయలన్నీ చలవ చేసేవే! వాటిని చింతపండు రసం గానీ, అల్లం వెల్లుల్లి మషాలాలు గానీ, శనగపిండి గానీ కలిపి వండటం వలన చలవ చేసే కూరలు కూడా వేడి చేసేవిగా మారిపోతాయి. వేడి చేసేవి తిన్న రోజున దాంపత్య సుఖం తగ్గిపోతుంది.

చలవ చేసేవి మాత్రమే తిన్నరోజున వేసవి కాలంలో కూడా శరీరం శీతాకాలంలో లాగా సహకరిస్తుంది.

✦ లఘు : కష్టంగా అరిగే ఆహార పదార్థాలను వేసవి కాలంలో ఎక్కువగా తినకుండా ఉండటం మంచిది. బిరియానీ, పలావు, ఫ్రైడ్ రైస్, స్పైసీ వంటకాలు వేసవిలో లైంగిక శక్తిని దెబ్బతీస్తాయి. ఇది హెచ్చరికే మరి!

✦ ద్రవం : వేసవి కాలంలో ద్రవరూపంగా ఉండే వాటిని ఎక్కువగా తినాలి. అన్నంలో మజ్జిగ పులుసు, మెంతిమజ్జిగ, చారు, చింతపండు వెయ్యని పప్పుకట్టు, పులుపు పరిమితంగా ఉండే పప్పుచారు లాంటివి ఎక్కువగా తినాలి. సగ్గుబియ్యం జావ, బార్లీజావ, సబ్జాగింజలు ఇలాంటివి వేసవిలో తరచూ తీసుకుంటూ ఉండాలి. రాగి, జొన్న, సజ్జ, గోధుమలతో చేసిన సూపు జావలు వేసవిలో మేలు చేస్తాయి.

✦ రసాలా : షుగరువ్యాధి లేని వారు పెరుగులో గానీ, మజ్జిగలో గానీ పంచదార కలిపి తయారుచేసిన లస్సీ (రసాల) తరచూ తాగుతూ ఉండాలి. పంచదారకు బదులు శొంఠిపొడి, తగినంత ఉప్పు వేసుకుని కూడా తాగవచ్చు. ఇది లైంగిక శక్తిని కాపాడే గొప్ప ఉపాయం. రాత్రి పడుకోబోయే ముందు తాగితే మరీ మంచిది.

✦ సితాం : షుగరువ్యాధి లేని వాళ్ళు వేసవికాలంలో పంచదారగానీ, పటికబెల్లంగానీ వాడుకోవటం లైంగిక శక్తి పెరిగేందుకే తోడ్పడుతుంది.

✦ సక్తు : మరమరాలు, జొన్నపేలాలు, జొన్న అటుకులు ... ఇవి వేసవిలో తినటానికి అనుకూలంగా ఉంటాయి. వాటిని విడిగా తినకపోయినా రకరకాల వంటకాలుగా చేసుకుని తినవచ్చు కూడా! పిండిగా విసిరి వాటితో ఏవయినా వంటకాలు చేసుకోవచ్చు.

✦ క్షీరం : యవ్వనంలో ఉన్నవాళ్ళూ వేసవిలో పాలు తాగటం మంచిది. ముప్ఫయ్యేళ్ళు దాటినవాళ్ళు పెరుగునీ, యాభైయేళ్ళు వచ్చాక బాగా చిలికిన మజ్జిగనీ తాగటం శక్తిని కాపాడుకోవటానికి మంచి ఉపాయాలుగా ఉంటాయి.

✦ జాంగలం : మాంసాన్ని అతిగా మషాలాలు వెయ్యకుండా వండుకుని వేసవిలో తినటం మంచిది.

✦ శీతాంశుం శయనం : రాత్రి పూట ఏసీలో పడుకోవటం కన్నా ఆరుబయట వెన్నెల్లో పడుకోవటం లైంగికశక్తిని పెంచే మరొక ఉపాయం. చాలా మంది తమకు ఏసీ పడదంటూ ఉంటారు.

✦ దివామలయజం : పగటి పూట ముఖానికీ వీపుకీ పొట్టకీ గంధం చెక్కని

అరగదీసి గంధం తీసి రాసుకోవాలి. గంధం పొడిని బజార్లో కొని దాన్ని వాడితే మనకు కావలసిన ప్రయోజనం రాదు. అలాగని శవాల మీద వెయ్యటానికి బజార్లో అమ్మే మాయా గంధం చెక్కని వాడినా ఆ ప్రయోజనం కలగదు. మంచి గంధం చెక్క దొరికితేనే సానమీద అరగదీసి ఉపయోగించండి... శరీరం చల్లదనాన్ని పొందటం అంటే వీర్యానికి చలవనిచ్చి, లైంగిక శక్తిని పెంచటం అనే అర్థం.

- జననాంగాల దగ్గర అమిత వేడిగా ఉండేవారు గంధాన్ని ఆ ప్రాంతాల్లో కూడా లేపనం చేయవచ్చు. చల్లదనాన్ని, వీర్యవృద్ధినీ కలిగిస్తుంది.
- శీతంపయ : చల్లని పాలు, పాలతో తయారైన పదార్థాలు తరచూ తీసుకోవటం వలన లైంగిక శక్తి పెరుగుతుంది.
- పానకం : నీళ్ళలో బెల్లం మిరియాలు కలిపిన తియ్యని పానీయం వడదెబ్బ కొట్టకుండా మాత్రమే కాదు, లైంగిక శక్తిని ధృడతరం చేయటానికి కూడా ఉపయోగపడ్తుంది. షుగరు జబ్బు లేని యువతీ యువకులకు ఇది తరుణోపాయం!
- మెట్టభూమిలో పండే ధాన్యాన్ని 'శాలిధాన్యం' అంటారు. ఇవి చలవనిస్తాయి... తేలికగా అరుగుతాయి. రుచికరంగా ఉంటాయి. వీటిని వేసవిలో తినటం మంచిది. మలమూత్రాలను ఫ్రీగా జారీ చేసే గుణం ఉన్న ద్రవ్యాలన్నీ వీర్యానికి కూడా చలవనిచ్చి వీర్యవృద్ధినిస్తాయి.
- మాంసాన్ని తేలికగా అరిగే పద్ధతిలో వండుకొని తింటే ఎలాంటి హానీ చెయ్యదు. నూనె, మషాలాల అతి వాడకం వలన మాంసం హానికరం అవుతోంది. మాంసరసం అంటే ఇది మాంసం సూపు. వేసవిలో మంచిది. శక్తిని కాపాడుతుంది.
- వేసవికాలం వచ్చాక ఆవకాయి, మాగాయిల ఆధిపత్యం పెరుగుతుంది. అదనపు పులుపు, కారం ఉప్పు కడుపులోకి చేరి పోయి శరీరాన్ని శోషింపచేస్తాయి. వీటివలన వేసవికాలం భార్యా భర్తలకు ఎక్కువ ఎడబంధానికి కారణం అవుతోందని గమనించాలి.

# మగానుభవంలో రతిమాంద్యం

**- వి. వరహాలు (నిజామాబాద్)**

**ప్ర : పురుషుల్లో లైంగిక సమర్థత ముందు తగ్గిపోతుందా! స్త్రీలలో ముందుగా తగ్గుతుందా?**

మనిషి ఆరోగ్యం, అతని అభ్యున్నతి, అతని సాధకత అంతా అతని లైంగిక

జీవితం మీదే ఆధారపడి ఉంటుంది. కోరికను ఆరోగ్యకరమైన రీతిలో సంతృప్తిపరచుకున్నా మానసిక శక్తి సమకూరుతుంది. లేదా దాన్ని ఆరోగ్యకరమైన రీతిలో నిగ్రహించుకున్నా మానసిక శక్తి సిద్ధిస్తుంది. కోరిక నెరవేరక, నెరవేరినా సంతృప్తి కలగక, దాన్నీ అణచుకోలేక నిరంతర అసంతృప్తితో జీవించేవారికి మానసిక శక్తి అందని ద్రాక్ష అవుతుంది. బ్రహ్మచర్యం మాత్రమే గొప్పదనటాన్ని కామశాస్త్రం అంగీకరించదు. కమ్మని సంసార సంతృప్తి అంతకన్నా గొప్పది.

సంసార సుఖాన్ని పొందటానికి వయసుతో నిమిత్తం లేదు. ఆజన్మాంతం రతిసుఖం ఒక్కటి దక్కితే చాలు, కోట్లు ఉన్నవాడికన్నా గొప్పవాడౌతాడు, quality of life అనేది సంతృప్త హృదయాలకు మాత్రమే సిద్ధించే ఒక గొప్ప అవకాశం.

లైంగిక పరమైన సంతృప్తి చాలినంత లేకపోవటం నాణ్యమైన జీవితాన్ని తప్పకుండా దెబ్బతీస్తుంది. దీనికి అనేక కారణాలున్నాయి. అసంతృప్తిని బయటకు వెళ్ళబుచ్చుకునే అవకాశం, ఇతరులతో చెప్పుకుని సేద తీరే అవకాశం, ఇతర మార్గాలలో దాన్ని పొందే అవకాశాలు లేకపోవటం వలన లైంగిక అసంతృప్తి జీవిత నాణ్యతని తప్పకుండా దెబ్బతీస్తుంది.

లైంగిక అసంతృప్తిని sexual dysfunction అంటారు. లైంగిక మాంద్యం అని దీన్ని పిలుద్దాం. ఆర్థిక మాంద్యం లాంటిదే ఈ లైంగిక మాంద్యం! ఇది స్త్రీ పురుషులిద్దరికీ సమానంగానే ఏర్పడవచ్చు కూడా! తాను సంతృప్తి పొందలేకపోయానని స్త్రీ భావించుకుంటే, తాను సంతృప్తి పరచలేకపోయానని పురుషుడు అసంతృప్తి చెందుతారు. ఇది లోక సహజమైన విషయం. అసంతృప్తికి కారణం ఏదైనా కానీయండి, అది జీవితంలో నాణ్యతా మాంద్యాన్ని తెచ్చేదాకా వెళ్ళనివ్వకూడదు. ఎవరికి వారు ప్రయత్న పూర్వకంగా సరిదిద్దుకునే విషయం.

లైంగికమాంద్యానికి శారీరక, మానసిక, సామాజిక కారణాలనేకం ఉన్నాయి. మానసిక సామాజిక కారణాలను ధృడచిత్తంతో ఎదుర్కోగలగవచ్చు. అక్కడ మగవారు మనోబలంతో సాధించుకోవాల్సిందే ఎక్కువగా ఉంటుంది. కానీ, శారీరక కారణాల గురించి చర్చించవలసింది చాలా ఉంది.

హార్మోన్లు, నాడీ వ్యవస్థ ఈ రెండింటి సమన్వయం వలనే సెక్సు కోరిక కలుగుతోంది. జననాంగానికి సంబంధించిన రక్తనాళాలు, నరాలు, మాంసకండరాలు రతి సమయానికి అనుకూలంగా స్పందించకపోయినా లైంగిక మాంద్యం ఏర్పడుతుంది.

సెక్సు కార్యానికి సంబంధించిన కండరాలు, నరాల సమన్వయం సరిగా లేకపోయినా, భావప్రాప్తి గానీ, వీర్యస్ఖలనం గానీ సకాలంలో జరగకుండా పోతాయి. స్ఖలనం వెంటనే జరిగినా, బాగా ఆలస్యంగా జరిగినా సంతృప్తికరమైన రతికార్యం జరగనట్టే అవుతుంది. అది మగవారిలో అసంతృప్తిని తెచ్చిపెడుతుంది.

మగవారిలో అసంతృప్తి సాధారణంగా తన స్త్రీ గురించి ఉండదు. తన గురించే ఉంటుంది. తన వైఫల్యాన్నే ఎక్కువగా భావిస్తాడు. అది తనను తాను తక్కువ చేసుకునే ఆత్మన్యూనతా భావానికి దారితీసి, వ్యక్తిగతమైన ఇతర సమర్థతల్ని దెబ్బతీసేదిగా మారుతుంది.

భావప్రాప్తిని Orgasm అంటారు. ఇది ఏమిటో ఇంతవరకూ కచ్చితమైన నిర్వచనం ఏదీ లేదు. అది కలగటానికీ, కలగకపోవటానికి నిర్దిష్టమైన కారణాలు కూడా లేవు. కానీ, శరీరాంగాలన్నింటి సమన్వయం వలన మాత్రమే భావప్రాప్తి సిద్ధిస్తుంది. స్త్రీకి భావప్రాప్తి కలగకుండానే స్ఖలనం జరిగిపోయినప్పుడు పురుషుడు తప్పకుండా ఆందోళన చెందుతాడు. ఈ ఆందోళన ఆ వ్యక్తిలైంగిక వ్యవస్థనే దెబ్బతీస్తుంది. కాబట్టి తక్షణ చికిత్స అవసరం అవుతుంది.

తీవ్రమైన కోరిక (libido) జననాంగ స్తంభన (erection) సకాలంలో స్ఖలనం (ejaculation), భావప్రాప్తి (orgasm) ఇవన్నీ సక్రమంగా ఉండేలా చూడటమే చికిత్సా పరమార్థం. లైంగిక మాంద్యానికి చికిత్స ఈ సూత్రం మీదే ఆధారపడి ఉంటుంది. ఇందులో ఔషధ ప్రాత ఎంత, వ్యక్తి పాత్ర ఎంత అనేది ముఖ్యం.

సెక్సు కోరిక బాగా తక్కువగా ఉండటం (లో లిబిడో), సెక్సు కోరిక పూర్తిగా నశించిపోవటం (లాస్ ఆఫ్ లిడిడో) అనే రెండు దశలు ఇందులో కనిపిస్తాయి.

పూర్తి లైంగిక జడత్వం (sexual inertia) ఆవహించిన వారికీ, లిబిడో బాగా తక్కువగా ఉన్న వారికీ కొన్ని రకాల హార్మోన్లు మెదడు పైన వ్యతిరేక ప్రభావం కలిగించటం ఒక కారణం. ఇది వైద్యుడి ద్వారా మాత్రమే సరి చేసుకోగల అంశం.

వయసు పెరిగి వృద్ధాప్యానికి చేరువౌతోన్న కొద్దీ పురుషులలో testosterone అనే హార్మోను ఉత్పత్తి తగ్గిపోయి, సెక్సు కోరిక మందగించవచ్చు. ఆల్కాహాలు, పుగాకు, మాదకద్రవ్యాలూ అతిగా సేవన వలన టెస్టోస్టిరోన్ ఉత్పత్తి తగ్గిపోవచ్చు. పోషక విలువలు లేని పీజ్జాలూ, బర్గర్లు, బఠాణీ పిండి లాంటి వాటితో తయారైన వంటకాలు, నూనె పదార్థాలూ లైంగిక ఆసక్తినీ, శక్తినీ తగ్గించవచ్చు. బీపీ, షుగరు, థైరాయిడ్ జబ్బులూ, ఎసిడిటీ లాంటి రోగాలకు వాడే మందులు, పొస్టేట్ గ్రంధిలో వాపు లాంటివి పురుషుల్లో లైంగికత మందగించటానికీ, లైంగిక ఆసక్తి మందగించటానికి కారణం కావచ్చు. రకరకాల మానసిక వత్తిడులు, సామాజిక అంశాలు, కుటుంబ పరిస్థితులు కూడా ఇందుకు కారణం కావచ్చు.

కోరిక బలంగా లేని పురుషుడు బలవంతంగా రతికి ప్రయత్నించినా అంగస్తంభనా మాంద్యం (erectile dysfunction ED) వలన రతినిష్ఫలం అవుతుంది. అంగస్తంభన తగినంత దృఢంగా లేకపోవటానికి మనసే ప్రధాన కారణం. అందుకు జననాంగాన్ని తప్పుపట్టనవసరం లేదు. ఒక్కోసారి రతిలో పాల్గొంటున్న స్త్రీ తన

జననాంగాన్ని స్పృషించటం వలన బలమైన అంగస్తంభనం కలగవచ్చు. ఒక్కోసారి రతిసంబంధమైన ఆలోచనలు మెదడుకు బాగా ఎక్కించినందువలన కలగవచ్చు.

కొందరికి ప్రత్యక్షంగా రతిలో ఉన్నప్పటికన్నా నిద్రలో ఎక్కువ దృఢంగా, ఎక్కువ సేపు ఉండేలాగా అంగస్తంభనం కలగవచ్చు. ఎప్పుడు కలిగితేనేం... ఎలా కలిగితేనేం... కలగటమే ముఖ్యంగా సంతృప్తి కోసం వెంపర్లాడాలి.

మగాడి ఈ అసౌకర్యాన్ని అతని స్త్రీ కూడా అర్థం చేసుకోగలిగితే దాంపత్యంలో చికాకులుండవు.

# నపుంసక మనసు

- ఎస్.ఎస్.ఎల్ (వరంగల్)

**ప్ర : మనుషుల్లో మానసికంగా నపుంసకులు వుంటారా? వారి గురించి వివరించండి!**

అందమైన ఆడపిల్ల కోరి వచ్చినప్పుడు నువ్వు మా నాయనమ్మలా ఉన్నావు... అని ఎవడైనా అన్నారనుకోండి... ఆ అమ్మాయి మగతనం లేని పేడి ముఖం కాడా ... అంటుంది. అలా అన్నది పవర్‌ఫుల్ లేడీ అయితే అచ్చం అలానే జరుగుతుంది కూడా!

కానీ, అలా అన్నది ఊర్వశి! అనిపించుకున్నవాడు సాక్షాత్తూ అర్జునుడు. ఫలితంగా అర్జునుడు కొన్నాళ్ళపాటు నపుంసకుడయ్యాడు. శాపాన్ని వరంగా మార్చుకుని, అజ్ఞాతవాసం కొద్దికాలాన్నీ డ్యాన్సు టీచరుగా గడిపినట్టు మహా భారతం చెప్తుంది.

నుపుంసకుణ్ణి ప్రాచీనకాలంలో ఆడపిల్లల నాయకుడు "Chief of the Girls" అనేవాళ్ళు. పురుషుల ముష్కాలను, ఒక్కోసారి జననాంగాన్నీ కత్తిరించేసి (Castration) నపుంసకుడిగా మార్చి రాణీవాసానికి కావలి పెట్టేవాళ్ళు. రాజులకు భయం బయట వాళ్లతో కాదు. కాపలావాళ్ళతోనే! రాణిగారికి ఎవరో పరాయివాడికారణంగా పిల్లాడు కలిగితే వంశం కలుషితమౌతుందని కూడా! అందుకని నపుంసకుల కావలిలో తమ రాణులు సురక్షితం అని భావించేవాళ్ళు. ఇలా నపుంసకుడిగా మారినవ్యక్తిని "eunuch" అనేవాళ్ళు. కాలక్రమంలో పురుషరూపం ఉండి పురుషావయవం లేని నపుంసకులు (హిజ్రా, కొజ్జా), స్త్రీ ద్వేషులు, నిజమైన బ్రహ్మచర్యం పాటించే వాళ్ళు, పెళ్ళి చేసుకోకూడదనుకునేవాళ్ళు, మానసిక వికారంతో స్త్రీని కాక మరొక పురుషుడితోనే లైంగిక సంతృప్తిని పొందేవాళ్ళూ వీళ్ళను కూడా యూనక్ అనే పిలవసాగారు. ఇదంతా నేటికి నాలుగువేల యేళ్ళ క్రితమే మొదలైన ఒక సంస్కృతి. గ్రీకు రాజులు

వీళ్ళని ten eunen ekhein = bed chamber attendants పడకగది పరిచారకులుగా నియమించేవాళ్ళు. అలా వచ్చింది యూనక్ అనేమాట.

ఒక వ్యక్తి పుంసకుడా నపుంసకుడా అనేది తేల్చటానికి అతని పురుషాంగాన్ని పరిక్షించటం, నమ్మకమైన స్త్రీని అతని దగ్గరికి పంపి మగతనాన్ని నిర్ధారించటం, తినే తీరు, వినే తీరు, నడక, నడత అన్నింటినీ గమనించి పురుషత్వం లేనివాణ్ణి గుర్తించే వాళ్ళు.

వాత్స్యాయనుడు కామశాస్త్రంలో స్త్రీ జననాంగం కలిగిన పురుషుల్ని 'తృతీయాప్రకృతి' అని పిలిచాడు. రిచర్డ్ బర్టన్ వాత్స్యాయనాన్ని అనువాదం చేసినప్పుడు ఈ తృతీయాప్రకృతుల్ని 'యూనక్' అని అనువదించాడు. మధ్యయుగాలలో సుల్తానుల కాలంలో హిజ్రాల సంస్కృతి భారత దేశంలో ప్రబలింది. వాళ్లకి రాణివాస కావలి దక్కడంతో గౌరవమూ పెరిగింది. క్రమేణా ధనికులు వివాహాది కార్యక్రమాలలో ఈ హిజ్రాలను పిలిపించి నృత్య గానాది ప్రదర్శనలు చేయించటం ఒక ఆచారంగా మారింది. హిజ్రా ఆశీర్వదిస్తే ఫలిస్తుందనే ఒక నమ్మకం కూడా ఉండేది. ఒకప్పుడు దుకాణం యజమానులకు ఈ నమ్మకం బాగా ఉండేది. ఇప్పటికీ హిజ్రాలు తరచూ షాపులకు వెళ్ళి ఎంతోకొంత చిల్లర వసూలు చేసుకుంటూ మనకు కనిపిస్తారు.

అంగస్తంభనం లేనివాళ్లందరినీ నపుంసకులుగానే హిప్పోక్రేట్స్ భావించాడు. వ్యక్తుల లైంగికత ఆధారంగా, సంతానోత్పత్తి శక్తి ఆధారంగా స్త్రీ, పురుషుల నిర్ధారించాలని అరిస్టాటిల్ సూచించాడు. స్త్రీ పురుషుల మధ్య సహజంగా ఉండవలసిన సెక్సు బంధానికి అర్హులు కాని పురుషుల్ని ఆయన స్త్రీలుగానే భావించాడు. సెక్సుకు అవసరమైన అతి ముఖ్యమైన అంగం లేకపోవటం ఒక్కటే. పుంసత్వ పరీక్షకు నిలిచేది కాదు. అంగపుష్టి ఉన్నా పురుషుడు పురుషుడిలా వ్యవహరించలేనప్పుడు అతన్నీ యూనక్‌గానే పాశ్చాత్య దేశాలలో పిలిచేవాళ్ళు. లైంగిక సమర్థత పుష్కలంగానే ఉన్న వ్యక్తికి సంతాన యోగ్యత ఒక్కటే లేనప్పుడు మాత్రం అతను వివాహం చేసుకుని దత్తత స్వీకరించవచ్చని రోమన్ ధర్మశాస్త్రాలు ప్రకటించాయి.

వైద్య నిఘంటువులు యూనక్‌ని ముష్కాలుండి వాటి వలన కలగవలసిన సంతానోత్పాదక శక్తి, కామోద్రేకం, భావప్రాప్తి లాంటివి ఏ వ్యక్తిలో ఉండవో వాడు యూనక్ అనే నపుంసకుడని పేర్కొన్నాయి. పురుషుడిలో పురుష సంబంధమైన హార్మోన్ల లోపం ఏర్పడినందు వలన కలిగే నపుంసక లక్షణాలను "యూనకోయిడిజం" అంటారు.

ఇదే ఒక స్త్రీలో జరిగినప్పుడు వాళ్లని ఆడ యూనక్'లని పిలుస్తారు. మగ హిజ్రాలూ హార్మోన్ల లోపాల వలనే అలా ఏర్పడుతున్నారు. యవ్వనం ప్రారంభం అయ్యేవరకూ అంటే కనీసం ఏడెనిమిదేళ్ళ వయసు వచ్చే వరకూ ఆడపిల్లలుగానీ, మగపిల్లలు గానీ హిజ్రాలుగా మారతారని ముందుగానే గుర్తించలేం. ఆడ హిజ్రాలలో

(female eunuchoidism) అండకోశాలు (ovaries) ఆడపిల్లల్ని, బీజకోశాలు (testes) మగపిల్లల్ని బాల్యంలోంచి యవ్వనంలోకి చేరుస్తాయి. వాటి పనితీరు లోపించినప్పుడు యవ్వనారంభ వికాసాలు (secondary sexual characteristics) ఒక మోస్తరు స్థాయి నుండి పూర్తిస్థాయి వరకూ ఆగిపోతాయి. శరీరం పెరుగుతుంది గానీ, లైంగిక చిహ్నాలు లేకుండా పోతాయి. దాంతో ఆడపిల్లల్లో మగలక్షణాలు, మగపిల్లల్లో బీర్జాలు లేకపోవటం, పురుష లక్షణాలు తక్కువగా ఉండటం, లైంగికోద్రేకత లేకపోవటం లాంటివి ఏర్పడి, హిజ్రాలుగా మారుస్తాయి. హిజ్రాలలో ఎక్కువమంది అసాధారణమైన పొడుగు పెరుగుతారు.

స్త్రీలకు స్త్రీత్వాన్ని పురుషులకు పురుషత్వాన్ని ప్రసాదించే ఉత్ప్రేరకాలను సెక్సు హార్మోన్లంటారు. అవి లోపించినప్పుడు ఆడపిల్ల మగాడిగానూ, మగపిల్లాడు ఆడపిల్లగానూ పెరుగుతారు. స్త్రీ జననాంగంతో పురుష రూపంలో పెరిగిన వ్యక్తులు పుట్టినప్పుడు ఆడపిల్లలుగానే పుడతారు. పుట్టినప్పుడు మగపిల్లాడిగానే పుట్టినా యవ్వనారంభకాలంలో సెక్సు హార్మోన్ల లోపం వలన ఆడంగిలాగా పెరగవచ్చు. కాబట్టి, తల్లిదండ్రులు తమ పిల్లలకు ఏడెనిమిదేళ్ళ వయసు వచ్చే సరికి యవ్వనారంభ వికాసాలు (secondary sexual characteristics) సక్రమంగా ఉన్నాయో లేదో పరీక్షించి చూసుకోవాలి. తేడా ఉన్నట్టు అనుమానం వస్తే, వైద్యుడి సలహా పొందటం మంచిది. సరిగ్గా ఆ సమయంలో జరగవలసిన చికిత్స జరగకపోతే ఒక నిండు జీవితం నిరర్ధకంగా మారిపోతుంది. ఇదంతా పిట్యూటరీ గ్రంథి స్రావాలలో ఒకటైన గొనడో ట్రోఫిన్ లోపం వలన కలుగుతున్న దుస్థితి.

శారీరకంగా పిల్లలు పురుషుడిలా ఎదుగుతారా, స్త్రీలా ఎదుగుతారా అనే విషయాన్ని నిర్ధారించేవి జననాంగాలు కాదు, ఆడపిల్లల్లో ఓవరీలు, మగపిల్లల్లో ముష్కాలు స్త్రీ పురుషత్వాలను ప్రసాదిస్తాయి కాబట్టి వీటిని గోనడ్స్ అంటారు. స్త్రీని పరిపూర్ణమైన స్త్రీగానూ, పురుషుణ్ణి పరిపూర్ణమైన పురుషుడిగానూ చేసే సెక్సు హార్మోన్లను ఇవి ఉత్పత్తి చేస్తాయి. సెక్సు హార్మోన్ల ఉత్పత్తి లోపం వలన హిజ్రాతనం వస్తుంది.

పిట్యూటరీ గ్రంధి ఈ మొత్తం సెక్సు పరికరాన్ని తన ఆధీనంలో పర్యవేక్షిస్తుంటుంది. పురుష పరమైన హార్మోనుని యాండ్రోజెన్ అనీ, స్త్రీ సంబంధమైన హార్మోనుని ఈస్ట్రోజెన్ అనీ అంటారు. బాల్యావస్థలో నిరుపయోగంగా కనిపించే జననాంగ వ్యవస్థని పరిణత స్థితికి (adult form) చేర్చటంలో ఈ హార్మోన్ల పాత్ర ముఖ్యమైంది.

మనిషి అమ్మ కడుపులో పడటానికి ముందే భార్యాభర్తల స్త్రీ పురుష బీజాల కలయిక సమయంలోనే ఏర్పడబోయే పిండం ఆడా లేక మగా అనేది నిర్ధారణ అయిపోతుంది. కానీ పుట్టిన బిడ్డ తదనుగుణంగానే ఆడపిల్లగానే లేక

మగపిల్లవాడిగానో పెరగాలి కదా! దాని పర్యవేక్షణాలోపం జరగకుండా తల్లిదండ్రులు జాగ్రత్త పడాలి. ఇదంతా శారీరక నపుంసకత్వం కథ! ఇవన్నీ సక్రమంగానే ఉన్నా మానసికంగా నపుంసకత్వంతో సతమతమయ్యేవారి గురించి మనం చర్చించుకోవాల్సినవి చాలా ఉన్నాయి.

# అరసిక రసికాగ్రత

- ప్రసాద్ (ఒంగోలు)

**ప్ర : సెక్సులో క్రూరత్వం తగ్గించగలమా? దాని గురించి వివరంగా చెప్పండి సార్!**

రసికత అనే మాట వెనుక చాలా అర్థాలున్నాయి. లైంగికపరమైన రసికత గురించి మాత్రమే ఇక్కడ పరిశీలన చేద్దాం. లైంగిక రసికతలో ఆరోగ్యపరమైన, మనోవికారపరమైన రెండు రకాల రసికతలు కనిపిస్తాయి. మనోవికారులు కూడా రసికతను అనుభవిస్తారు. కానీ అందులో అమోదయోగ్యత ఉండదు. ఒకరి ఆమోదంతో నిమిత్తం లేకుండా తన ఆనందాన్ని మాత్రమే చూసుకోవటాన్నే అనారోగ్యకర రసికతగా భావించవలసి ఉంటుంది. శాడిజం, మాసోచిజం లాంటివి ఈ కోవలోకి వస్తాయి.

కొందరికి ఆడదెతే చాలు, వావివరసలూ, సభ్యతా సంస్కారాల ప్రమేయం లేకుండా తమ రసికతను ప్రదర్శించే తత్త్వం ఉంటుంది. ఇంకొందరు మగాళ్ళకు రసికత కలగటానికి స్త్రీయే కావాల్సిన అవసరం ఉండదు. ఎదురుగా ఒక మగాడు కనిపిస్తే చాలు వీళ్ళలో ఎక్కడ లేని రసికత పుట్టుకొస్తుంది. వీళ్ళని హోమో సెక్సువల్ రసికులంటారు. వాళ్ళ మానాన వాళ్ళేదో తంటాలు పడతారులే అని ఉపేక్షించే అంశం కాదది. ఒక మగాడి కామానికి ఇంకో మగాడు బలైపోకూడదు కదా! ఇంకొందరుంటారు... వీళ్ళు పూర్తి అరసికులు. తమకు సెక్సు అవసరమూ లేదన్నట్టు మాట్లాడతారు. అంటే ప్రకృతి ధర్మానికి వ్యతిరేకులన్నమాట.

అలాగని వీళ్ళు ఆడపిల్లలజోలికి పోరని కూడా కాదు. అందమైన ఆడపిల్ల కనిపిస్తే చెరిచి, అందం చెడగొడితే గానీ వీళ్ళకు రసికత కలగదు. యాసిడ్ ప్రేమికులంతా ఈ అరసికులే! వాళ్ళవాళ్ళ తత్వాలనుబట్టి వాళ్ళు తమ వ్యతిరేకతను ఎంత తీవ్రస్థాయిలోనైనా వ్యక్తపరచగలరు.

రసికత ఇలా వక్రమార్గాన పట్టినప్పుడు సమాజ నీతికి భిన్నమైన లైంగిక రసికత అనేది వ్యక్తిగత విషయం ఎంతమాత్రమూ కాదని అది సమాజం మొత్తానికి చెరువు చేస్తుందనీ, కాబట్టి దాని గురించి బహిరంగంగా మాట్లాడవలసిన అవసరం ఉందనీ అర్థం అవుతోంది. భారతీయ కట్టు బాట్ల కారణంగానూ, పురుషాధిక్యత కారణంగానూ, సమాజ వ్యతిరేక రసికత స్త్రీలలో బహిర్గతం అయ్యే అవకాశాలు

భారతీయ సమాజంలో తక్కువే కావచ్చు. కానీ స్త్రీలలో ఇలాంటివి ఉండవని అర్థం కాదు.

ఆరోగ్యవంతమైన రసికత కలిగిన వ్యక్తిని సెక్సు విషయంలో మీ ప్రాధాన్యత ఏమిటని అడిగితే, సర్వాంగ శోభిత అయిన స్త్రీ అని మగాళ్ళూ, సర్వలక్షణ సంపూర్ణుడైన పురుషుడని ఆడాళ్ళూ చెప్పగలుగుతారు. దీన్ని 'లైంగిక ప్రాధాన్యత (సెక్సువల్ ప్రిఫరెన్స్) అంటారు. ఇందుకు భిన్నంగా ఆలోచించేది ఏదయినా అది అనారోగ్యదాయకమైన రసికతే! అంటే, ఆ వ్యక్తి లైంగికతలోని ప్రాధాన్యతలు వక్రమార్గాన పడ్డాయని అర్థం.

ఒక మగాడి సెక్సు మగాళ్ళ చుట్టూ ఎందుకు తిరుగుతుంది...? ఒక మగాడు స్త్రీ దగ్గర పురుషుడిలాగా కాకుండా స్త్రీ లాగా ఎందుకు ప్రవర్తిస్తాడు...? ఒక మగాడు సహజమైన పద్ధతుల్లో కాకుండా అసహజ మార్గంలో రతికి తలపడాలని ఎందుకు కోరుకుంటాడు..? ఒక మగాడు హింసపెట్టి రతి సౌఖ్యాన్ని పొందాలని ఎందుకు చూస్తాడు. ఒక మగాడు హింస పెట్టించుకుని ఎందుకు ఆనందిస్తాడు...? ఇవి ఎవరికి వారికి వ్యక్తిగతమైన ప్రైవేటు వ్యహారాలేనా...? వీళ్ళ వలన లోకోపకారం ఏమైనా ఉంటుందా? ఉపకారం మాట అలా ఉంచుదాం.. అపకారం ఎంతమేర ఉంటుంది..? ఇవన్నీ చర్చించాల్సిన విషయాలే!

ఎలాంటి ఆలోచనైనా ఎలాంటి వారికైనా రావటం సహజం. అసలిలాంటి ఆలోచన నీకెలా వచ్చిందీ అని మనం ఎవరినీ అడగనవసరం లేదు. ఆలోచన రావటాన్ని తప్పుబట్టలేము కూడా! కానీ, దానికదిగానే వచ్చిన ఆ ఆలోచనని పుచ్చుకుని ఆ వ్యక్తి వ్రేలాడటమే తప్పు! ఎవరిపైనైనా తీవ్రమైన ఆగ్రహం కలిగితే వాణ్ణి చంపి పారేయాలనిపిస్తుంది. అది ఒక ఆలోచన మాత్రమే! ఆగ్రహంలోంచి పుట్టిన ఒక రెమ్మ ఈ ఆలోచన! ఆ రెమ్మే ఒక మహావృక్షంగా పెరిగితే ఆ వ్యక్తి నేరస్థుడౌతాడు. ఈ ఆలోచన వచ్చిన ప్రతి ఒక్కరూ హంతకులుగా మారిపోలేరు. వారి వ్యక్తిగత సంస్కారం, పాపభీతి, సమాజ కట్టుబాట్లూ, అవకాశం కుదరకపోవటం, అంత ధైర్యం లేకపోవటం, కొద్ది సేపటికే ఆ ఆగ్రహం చల్లారిపోవటం ఇలాంటి అనేక కారణాల వలన ఆ మనిషి నేరపూరితుడు కాలేకపోతున్నాడు. ఇదే విషయం సెక్సుకీ వర్తిస్తుంది. సెక్సు నేరాలు పెరగటానికి పైన చెప్పిన అడ్డంకులు లేకపోవటమే కారణం.

యువతీ యువకుల్లో లైంగికత వికసిస్తున్న తరుణంలోనే, యవ్వనంలోకి రాబోతున్నప్పుడే సమాజ ప్రభావంతో లైంగిక వికారాలు కూడా అంకురిస్తాయని మానస శాస్త్రవేత్తలు చెప్తున్నారు. మనో వికారాలు వాటికవిపుట్టి గలిగేవి కాదు. వాటికి కారణం వ్యక్తి చుట్టూ ఉన్న సమాజమే! ముమ్మాటికీ సమాజమే! అందుకే

మనో వికారుల ప్రభావం తిరిగి సమాజం పైన తీవ్రాతి తీవ్రంగా ఉంటుంది. వ్యక్తుల మానసిక అనారోగ్యాన్ని ముఖ్యంగా సెక్సు పరమైన మనోదౌర్బల్యాన్ని సమాజ పరమైన కోణంలోంచి పరిశీలించాల్సిన అవసరం ఉంది. దీని వెనకాల సైకాలజీ మాత్రమే కాదు, బయాలజీ, సెక్సాలజీ కూడా ఉన్నాయి. సామాజిక వ్యవస్థ ప్రభావం కూడా దీని మీద ఉంటుంది. social constructionism అనేది మనో దౌర్బల్యాలకు మూలకారణం అవుతోంది.

మగాడిలా తయారైన ఒక స్త్రీతో మరొక స్త్రీ లైంగిక భావప్రాప్తి పొందటం (లెస్బియాన్స్), గే సెక్సు (మగాడితో మరో మగాడు సుఖాన్ని పొందాలని చూడటం) ఇలాంటి తత్వాలున్న వ్యక్తులతో లోకం నిండిపోతే ప్రకృతి ధరర్మం ఏమౌతుంది? సమాజంలో SGL (Same Gender Loving) సర్వలింగ కాముకత అనేది ఒక కొత్త లైంగిక రసికతగా భాసిల్లే ప్రమాదం ఉంది కదా! SGL (Same Gender Loving) నిస్సదేహంగా సమాజ వ్యతిరేక, లైంగిక అరసికతగా భావించవలసిన అంశం మానసశాస్త్ర పరంగా యాండ్రోఫిలియా, గైనీ ఫిలియా లాంటి పేర్లతో దీన్ని చాలా సీరియస్ మానసిక సమస్యగా భావిస్తున్నారు మానసశాస్త్ర వ్యాధులు ఇప్పుడు కొత్తగా బైక్, క్వీర్ అనే పదాలతో కూడా వ్యవహరిస్తున్నారు.

ఇలాంటివి గతంలోనే ఉన్నా రాను రానూ ఈ అరసిక రసికాగ్రత అనేది మితిమీరి పోవటానికి ముఖ్యకారణం సామాజిక పరిస్థితులలో మార్పు రావటమే! అనుకరించటం, వ్యామోహ పడటం అనే రెండు బలహీనతలున్న సమాజాలమీద వీటి దుష్ప్రభావం త్వరగా పడే అవకాశం ఉంది. యవ్వనంలోకి ప్రవేశిస్తున్న పిల్లల్లో ఆడైనా, మగైనా వారి ఆలోచనలు సెక్సుపరంగా ఏ రీతిలో సాగుతున్నాయో తల్లిదండ్రులు, ఉపాధ్యాయులూ ఒక కంట కనిపెట్టవలసిన అవసరం ఉంది. సామాజికపరమైన జాగ్రత్తలు తీసుకుంటే దీన్ని పెను మహమ్మారి కాకుండా నిలువరించవచ్చు.

# 'సెక్సు ఆరోగ్యం' మన హక్కు

- ప్రీతీరామ్ (సికింద్రాబాద్)

**ప్ర : ఆరోగ్యదాయకమైన సెక్సుని కోరుకునే హక్కు మనకున్నదా! వివరంగా చెప్పండి సార్.**

మనం అన్ని ఆరోగ్యాల గురించీ మాట్లాడుతున్నాం గానీ, సెక్స్ పరమైన ఆరోగ్య, అనారోగ్యాల గురించి నోరు తెరిచి మాట్లాడటమూ లేదు, ఆలోచించటమూ లేదు.

సెక్సుని ఒక ఆరోగ్య పరమైన విషయంగా కాకుండా మషాలా అనే అర్థంలో చూడటం వలన మనకు మనం కొంత అపకారం కొని తెచ్చుకుంటున్నాం కూడా!

సెక్సు హక్కు, సెక్సు బాధ్యత, సెక్సు నీతి, సెక్సు ఆరోగ్యం, సెక్సు సభ్యత, సెక్సు వాడకం, సెక్సు ఆచారం, సెక్సు అనాచారం, సెక్సు నిజాయితీ, సెక్సు వికారం ఇవన్నీ ఆరోగ్యవంతమైన సెక్సును నిలుపుకోవటానికి ప్రాతిపదికలు. అంతర్జాతీయ విషయాలు కూడా!

సెక్సంటే పెళ్ళి, సెక్సంటే వీధుల్లో కావులింతలు, సెక్సంటే చిందులు, పూనకం డ్యాన్సులూ అని మాత్రమే అనుకునేలా మన సినిమాలు మన యువతరాన్ని తయారు చేశాయి. ఆడా, మగల మధ్య జననాంగాల కలయిక మాత్రమే సెక్సనే ఒక అభిప్రాయం బలంగా ఏర్పడటం వలన, అసలు అదుకోసమే మనిషి పుట్టినట్టు అనుకునేలా తయారయ్యింది పరిస్థితి. అందువలన సెక్సు హక్కులు, సెక్సు బాధ్యతలు, సెక్సు ఆరోగ్యాల గురించి మాట్లాడుకునేదేం ఉన్నదనే అభిప్రాయం కూడా ఉంది చాలామందిలో!

సెక్సు గురించి చేతలేగానీ, మాట్లాడుకోవాలసింది ఏమీ లేదనుకోవటం వలన సెక్సు ఒక బ్రహ్మపదార్ధంగా మారిపోయింది. సెక్సులోని శాస్త్రీయత గురించి పిల్లలూ పెద్దలు కూడా కలిసి మాట్లాడుకోవచ్చు. అందులో అసభ్యత, అనాగరికత ఏమీ లేదు. అలా మాట్లాడే అలవాటు లేకపోతే, పువ్వులు ఫలదీకరణం చెందటాన్ని కూడా ఒక టికిలింగ్ విషయంగా భావించే ప్రమాదం ఉంది. జంతువుల లైంగిక కార్యకలాపాలను ఒక బూతు సినిమాగా తీసి చూపించటం ఇలాంటి అల్ప దృష్టికి ఒక పరాకాష్ట. పత్రికల్లో లైంగిక సమస్యల శీర్షికల్ని లైంగికోత్తేజానికి ప్రచురించే దౌర్భగ్యం తెలుగు పత్రికల్లోనే కనిపిస్తుంది.

పుట్టిన నాటి నుండీ గిట్టే వరకూ మనిషి సంపూర్ణ జీవితానికి సెక్సు అనేది ఒక కేంద్ర బిందువు. సెక్సు వ్యక్తీకరణకు తోడ్పడే అంశాలు చాలా ఉన్నాయి. ఆలోచనలు, అద్భుత భ్రమలు, ఆకాంక్షలు, నమ్మకాలు, నడతలు, విలువలు, ప్రవర్తనలు, సంబందాల్లాంటివి సెక్సుని వ్యక్తీకరిస్తాయి. వీటిలో కొన్ని అనుభవం ద్వారానూ, కొన్ని చేతల ద్వారానూ వ్యక్తం అవుతాయి.

శరీర ధర్మాలకు సంబంధించిన, మనసుకు సంబంధించిన, సమాజానికి సంబంధించిన అంశాలు, వ్యక్తి ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, న్యాయ, ధర్మసంబంధమైన, చారిత్రకమైన, మతపరమైన, ఆధ్యాత్మిక పరమైన అంశాలూ మనిషి లైంగిక జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. ఇవన్నీ సంతృప్తికరంగా ఉన్నప్పుడే మనిషి సెక్సు జీవితం కూడా సుఖమయంగా ఉంటుంది. వీటన్నింటి సమాహారమే సెక్సు ఆరోగ్యం అంటే!

చాలామందికి శరీర ఆరోగ్యం లేకపోతేనే సెక్సు ఆరోగ్యం కూడా తగ్గిపోతుందనే నమ్మకం ఉంది. కానీ శరీర ఆరోగ్యంతో నిమిత్తం లేకుండా సెక్సు ఆరోగ్యం చెడే ప్రమాదాలుంటాయి. సెక్సు పరిజ్ఞానం పొందటం మనుషుల ప్రాథమిక హక్కు కావాలి. చదువులెల్లా చదివినా సెక్సు చదువు చదవకపోతే ఆ చదువులెల్లా నిరుపయోగం అవుతాయి. శంకరాచార్యులవారు ఇలాంటి అనుభవాన్నే ఎదుర్కొన్న కథ అందరికీ తెలిసిందే!

సెక్సు ఆరోగ్యం అనేది గౌరవప్రదంగా చూడవలసిన విషయం. రోగి తన సెక్సు బలహీనతను చెప్పుకుంటుంటే, వైద్యుడు ఆ రోగిని హీనంగా చూడలేడు కదా!

ఎక్కువ ఆనందదాయకమైన అనుభవం సమస్థితిలో స్త్రీ, పురుషులు ఇచ్చి పుచ్చుకోగలిగినప్పుడు అది ఆరోగ్యకరమైన సెక్సు అవుతుంది. ఇవ్వటం ద్వారా పుచ్చుకునేది ఆరోగ్యవంతమైన సెక్సు, పుచ్చుకోవటం మీద మాత్రమే దృష్టి పెట్టేవాడు సెక్సు అనాచారిగా మారే ప్రమాదం ఉంటుంది. అది సెక్సు భాగస్వామి సెక్సు హక్కుని దెబ్బతీస్తుంది. సెక్సుహక్కుని దెబ్బతీయటం చట్టరీత్యా నేరం కావాలి. అలా కావాలంటే ఆరోగ్యవంతమైన సెక్సుహక్కుని ప్రాథమిక హక్కుగా చేర్చాలి.

మొదట సెక్సు గురించి మాట్లాడుకోవటం ఒక టికిలింగ్ అంశం అనే అభిప్రాయంలోంచి మనం బయటకు రావాలి. ఆకలిదప్పుల్లాగే సెక్సు కూడా జీవుల ప్రవృత్తుల్లో ఒకటి. జీవితంలో అదొక పార్శ్వం! దాన్ని మనం బ్రహ్మపదార్థంగా మార్చనవసరం లేదు.

వాత్స్యాయనం, అనంగరంగ, కొక్కోకం లాంటి గ్రంథాలు సెక్సుని ఒక సైన్సుగా విశ్లేషించటానికే ప్రయత్నం చేశాయి. సుఖానుభవాన్ని పెంచుకోవటానికి తోడ్పడే ఉపాయాలను సూచించాయి. అవి బూతు సాహిత్యం అనుకుంటే మన అజ్ఞానమే బయటపడ్తుంది. అలాగని ఆ పుస్తకాలను మెళ్ళో తగిలించుకుని తిరగాల్సిన అవసరం కూడా లేదు.

ప్రామాణికమైన లైంగిక జీవితాన్ని పొందే హక్కు మనుషులందరికీ సమానంగా ఉంది. సెక్సుకు సంబంధించిన శాస్త్రీయ పరిజ్ఞానాన్ని సైన్సుగా భావించాలే గానీ, దాన్నొక బూతుగా  చూడరాదు. మనసులోని స్వేచ్ఛాభావనకూ, ఔన్నత్యానికీ, సమభావనకూ, అంకితభావనకూ సెక్సు అనేది ఒక సంకేతం.

సెక్సు హక్కులు కులమతాలకు, ధనికబీద వర్గాలకూ అతీతంగా మనుషులందరికీ సమానంగా ఒక నిర్దేశన ప్రత్యేకంగా జరగాలి. ఇతర ప్రాథమిక హక్కులకు వర్తించేవన్నీ సెక్సుకీ వర్తించవచ్చు. కానీ, ప్రత్యేకంగా నిర్దేశించటం వలన అబలల మీద సెక్సు దాష్టీకం నేరమనే ఒక భావన మగాడిదల్లో పెంచటానికి వీలౌతుంది.

జీవితం, స్వేచ్ఛ, రక్షణ అనే మూడు అంశాలు మనిషి సుఖంగా బతకటానికి ఎంత అవసరమో సెక్సు జీవితం, సెక్సు స్వేచ్ఛ, సెక్సు రక్షణ అనే మూడు అంశాలు కూడా అంతే ముఖ్యంగా పరిగణించబడాలి. వీటికి వ్యతిరేకంగా ఉండే ఏ విషయం అయినా ఎదుటి వ్యక్తి సెక్సు హక్కుకు వ్యతిరేకం అవుతుందనే అవగాహన కలిగించాలి.

సెక్సు పట్ల గౌరవంతో కూడిన ఒక అంకితభావం ముఖ్యం. సెక్సనేది ఒక నీచమైన, ఛండాలమైన పని అనటం సెక్సు హక్కుకు వ్యతిరేకమే! సెక్సులో నీచత్వం నీచం గానీ, సెక్సు నీచం కాదు. ఎందుకంటే ఆరోగ్యవంతమైన తరాలు ఏర్పడటానికి ఆరోగ్యవంతమైన సెక్సు అవసరం కదా! రేపటి జాతిని నిర్దేశించేటంత ప్రాముఖ్యత కలిగిన ఈ విషయాన్ని మాట్లాడకూడనిదిగా ఎలా వదిలేస్తారు? సెక్సు ఆరోగ్యం వలన ఆరోగ్యదాయకమైన సంతతి ఏర్పడుతుంది. రేపటి దేశ నిర్మాతలు, నిర్ణేతలు, నిర్వాహకులు ఆరోగ్యవంతమైన సెక్సుని ఆచరించిన అమ్మానాన్నల వలన మాత్రమే ఏర్పడతారు కాబట్టి.

లైంగిక వేధింపులు సెక్సు ప్రాథమిక హక్కుని కాలరాచేవిగా నిర్దిష్టంగా ప్రకటించాలి. శిక్షలు కూడా సెక్సు హక్కుకు భంగం కలిగించినందుకే పడాలి. ఇలాంటి చేష్టల వలన చట్టరీత్యా ఇబ్బందులు గురించిన అవగాహన కలగాలి.

ఒక ప్రసిద్ధ క్రీడల శాఖాధిపతి, ఒక ప్రసిద్ధ పత్రికా సంపాదకుడు, ఒక ప్రసిద్ధ న్యాయమూర్తి ఇటీవల లైంగిక వైధింపుల కేసులో ఇరుక్కొని కష్టాలపాలయిన సంగతి గుర్తు చేసుకోవాలి. ఇప్పుడు జరగవలసింది సామాన్యుడి స్థాయిలో హక్కులూ బాధ్యతల అవగాహన కలిగించటమే! వివాహానికి అంగీకారం, దంపతులైనా సరే సెక్సుకి పరస్పర అంగీకారం, సంతానాన్ని కనటం లాంటివన్నీ ప్రాథమిక హక్కులు కావాలి. సెక్సు ఆరోగ్యానికి చట్టపరమైన రక్షణ కావాలి.

సెక్సు పరమైన ఆధునిక వైద్యపరమైన సమాచారాన్ని తెల్సుకోవటం కూడా ఒక ప్రాథమిక హక్కుగానే భావించాలి! సెక్సు హక్కుల్లో ఏకాంతం (privacy) కూడా ముఖ్యమైంది. ఏకాంతానికి భంగం కలిగించటం కూడా సెక్సు హక్కుని దెబ్బతీసేదే!

వివిధ వాణిజ్య కంపెనీలు తయారు చేసే ఆహారపదార్థాలలోనూ, ఔషధాల్లోనూ, వాడుకునే వస్తువుల్లోనూ సెక్సు ఆరోగ్యాన్ని దెబ్బతీసే అంశాలేవీ లేవని సూటిగా స్పష్టంగా ప్రకటించే ఆదేశాలు ఉండాలి.

నాణ్యమైన సెక్సు జీవితం అందరికీ అవసరమైన ఒక హక్కు అనే విషయం మీద ప్రభుత్వ వ్యవస్థ, న్యాయపరమైన వ్యవస్థలు, ఇంకా ఇతర సామాజిక వ్యవస్థలూ దృష్టిని పెట్టాల్సిన అవసరం ఉంది.

# సంసారాలు చెడగొడుతున్న సెక్సు విముఖత

**ప్ర : సెక్సు'లో తేడా ఉంటే, మునుపటిలా ఆడపిల్లలు మౌనంగా ఊరుకోవటం లేదు. వెంటనే విడాకులంటున్నారు. సామాజికంగా ఈ సమస్య గురించి మీరేం చెప్తారు?**

సెక్సు పట్ల అత్యాసక్తి, ఆసక్తి, అనాసక్తి, ద్వేషం, వైరాగ్యం ఇలా మనుషుల్లో లైంగికానుభూతి వివిధ స్థాయిల్లో ఉంటుంది. వీటిల్లో లైంగిక ఆసక్తి ఆరోగ్యదాయకంగా ఉంటుంది.

బ్రహ్మచర్యం, మనోనిగ్రహం, వైరాగ్యం లాంటివి మనోబలంతో సాధించుకునే విషయాలు తక్కినవన్నీ అంతో ఇంతో మానసిక రుగ్మతల కిందే లెక్క.

మానసిక సెక్సు రుగ్మతల్లో లైంగికద్వేషం (Sexual aversion disorder) గురించి మనం మాట్లాడుకోవలసింది ఉంది. కొందరికి సెక్సంటే చీదర (disgust) ఇంకొందరికి భయం, విరక్తీ (revulsion) మరికొందరికి జీవిత భాగస్వామి పట్ల అయిష్టత (aversion) కారణంగా లాలస అనేది నశించిపోయి ఏర్పడే లైంగిక జడత్వం వగైరా ఏర్పడి ఉంటాయి. ఈ జడత్వం సాధారణ స్థాయి (normal loss of desire) నుండి తీవ్ర స్థాయి దాకా వివిధ దశల్లో ఉండవచ్చు.

చాలామంది, కొత్త యువ దంపతుల్లో సెక్సు సుఖానుభూతిని సంపూర్ణంగా పొందాననుకోవటం గానీ, అలా పొందాలని కోరుకోవటం గానీ ఇటీవలి కాలంలో చాలా తక్కువగా కనిపిస్తోంది. ముఖ్యంగా స్వాధికారికత, స్వయం ప్రతిపత్తుల నిచ్చే ఐటీ రంగం, వైద్యరంగం, పాలనా రంగాలలో ఉన్న స్త్రీలు విడాకులకు త్వరగా వెడుతున్నారు. ఎందుకని?

ఏ యుగంలో అయినా, దాంపత్య బంధానికి సెక్సు సంతృప్తే ముఖ్యమైన విషయం. తన స్త్రీలో లైంగిక ఆకర్షణ తక్కువగా ఉన్నప్పుడు మగవాడు త్వరగా బయటపడతాడు. కానీ, మారిన కాలంలో, మగవాడిలో సెక్సు అసమర్థత కనిపించినప్పుడు సహించేందుకు ఆడపిల్లలు కూడా సిద్ధంగా లేకపోవటం ఒక గొప్ప మార్పు! అందుకు తగ్గట్టుగా మగవాడే మారాల్సిన పరిస్థితి వచ్చేసింది. నువ్వు నాకొద్దని ఆడవాళ్ళు ముఖాన చెప్పేస్తే, ఆ మగాడి జీవితం తిరగబడ్డట్టే అవుతుంది. మారు మనువులు మగాళ్ళలో కన్నా ఆడవాళ్ళలోనే ఎక్కువగానూ వేగంగా కూడా జరుగుతున్నాయి. మగపిల్లలకు మొదటి మనువే కష్టం అవుతుంది.

లైంగిక సమర్ధతలు ఎప్పుడూ మానసికమైన పరిస్థితుల కారణంగా 'పెంపు-దింపు'గా నడుస్తుంటాయి. వాటిని పాత రోజుల్లో పరస్పర సహకారంతో సరిచేసుకోగలిగేవాళ్ళు! కానీ, నవీన కాలంలో అది కొరవడుతోంది. ఫలితంగా చాలా కొత్త సంసారాలు పెళ్ళి ప్రథమ వార్షికోత్సవాలకు కూడా నోచుకోలేకపోతున్నాయి.

నడివయసులో కొచ్చాక స్త్రీలలో మెనోపాజ్, పురుషుల్లో ప్రోస్టేట్ గ్రంథిలో వాపు లైంగిక విముఖతకు ముఖ్య కారణాలుగా ఉంటాయి. బాలింతగా ఉన్న సమయంలోనూ, బిడ్డకు పాలిచ్చే రోజుల్లోనూ, జబ్బుపడి లేచిన సమయంలోనూ, సర్జరీలు జరిగినప్పుడూ, ఉద్యోగం పోయినప్పుడూ, పరువు ప్రతిష్టలకు భంగం కలిగినప్పుడూ, ధన మాన ప్రాణాదులకు ఇబ్బంది కలిగినప్పుడూ దాంపత్య పరమైన సుఖానుభవానికి స్త్రీ పురుషులు విముఖులు కావటం సహజం. కానీ అది విడాకులదాకా సాగేంత వ్యవహారం కాకూడదు కదా!

ఇంటికి సంబంధించిన విషయాల్లో సమయం కేటాయించే తీరిక లేని వాళ్ళు ఒక్కోసారి ఈ సెక్సు విముఖతని ఎదుర్కొంటారు. ఈ పరిస్థితులను మార్పు చేసుకుంటే మళ్ళీ సాధారణ స్థితి రావచ్చు. ఇలాంటి తాత్కాలిక విముఖతని reversible loss of desire అంటారు. ఇంట్లో ఏకాంతం కుదరకపోవటం, కుటుంబంలో రాగద్వేషాలు, అత్తపోరు, మానసిక ఉద్వేగాలు, వత్తిళ్ళు లాంటి పరిస్థితుల వలన కూడా ఈ తాత్కాలిక విముఖత కలగవచ్చు.

ఇలాంటివేవీ లేకుండా సెక్సువిద్వేషం, విముఖత కలుగుతున్నదంటే ఆ వ్యక్తికి వైద్యపరమైన సలహా అవసరం అవుతుందనే అర్థం. సెక్సు విముఖతని తగ్గించుకోకుండా దాంపత్యం నిలవాలంటే అది కష్టమే అవుతుంది. నన్నూ, నా పరిస్థితినీ అర్థం చేసుకో అంటే ఓర్పు పట్టే వ్యక్తులు ఈ రోజుల్లో అరుదు. ఎదుటి మనిషికి అర్థం అయ్యేలా ప్రవర్తించగలగటమే దానికి నివారణ. ఎదుటి మనిషిలో తాను కోరుకుంటున్న మార్పుని తాను మారి సాధించాల్సి ఉంటుంది.

సంసారం అంటే కేవలం సెక్సే కానప్పటికీ, సెక్సు అనేది సంసారంలో ముఖ్యాంశం కాబట్టి "అది తప్ప మిగతాదంతా ఓకే" అంటే, అది నిజమైన దాంపత్యం అనిపించుకోదు. బహుశా అలాంటి జీవితానికి సహజీవనం లాంటి పేర్లు అతుకుతాయి. కానీ అదీ సంసారం ఎత మాత్రమూ కాబోదు.

జీవితం అంటే డబ్బు కాదు, జీవితం అంటే సుఖం ఇచ్చిపుచ్చుకోవటం!

స్త్రీ గానీ, పురుషుడు గానీ, ఇవ్వటమూ పుచ్చుకోవటమూ రెండూ చెయ్యలేకపోతున్నట్టు గమనిస్తే, రెండో వ్యక్తి సహకరించి సుఖానుభవాన్ని పెంపు చేసేందుకు తోడ్పడాలి.

దుర్వాసనతో కూడుకున్న జననాంగాలు, శరీరంలోచి చెమట వాసన, నోట్లోంచి వెల్లులిపాయి కంపు, సిగరెట్టు, ఆల్కాహాలు వెగటు వాసన, హింసాత్మకంగా రాక్షసంగా సెక్సుని పొందాలని ప్రయత్నించటం – ఇలాంటివి స్త్రీకి సహజంగానే ఇబ్బందికరంగా ఉంటాయి. ఆ పురుషుడి సెక్సు సమర్థత కలిగినవాడైనప్పటికీ, దగ్గరగా వస్తేనే విరక్తి కలిగేలా ఉంటే ఆ స్త్రీ ఎవరితో ఏవని మొరపెట్టుకుంటుంది...? ఇలా మొదలైన విముఖత, సంబంధంలేని ఇతర విషయాల మీదకు మళ్ళి చిలవలు పలవలై, దాంపత్య బంధం చెడేదాకా దారి తీయవచ్చు. ఇలాంటి పరిస్థితినే కొందరు పురుషులు కూడా ఎదుర్కొంటూ ఉండొచ్చు. గది నాలుగ్గోడల మధ్య స్త్రీ పురుషులు స్వేచ్ఛగా ఆచరించే వ్యవహారం కాబట్టి ఆ క్షణంలో వ్యక్తిగతమైన మానసిక బలహీనతలు బయటకొచ్చి ఇబ్బంది పెడుతుంటాయి.

సెక్సు విముఖత మొదటినుండి ఉన్నదా? ఆ వ్యక్తితో మాత్రమే ఉన్నదా? ఎప్పుడు సెక్సుకు తలపడినా ఉంటున్నదా? ఇవన్నీ అడగవలసిన ప్రశ్నలే! తాత్కాలిక కారణాలు కనిపించినప్పుడు వాటిని సరిచేసుకోవటం ఉత్తమం. పురుషుల్లో కన్నా స్త్రీలలో సెక్సు విముఖత ఎక్కువగా ఉంటుంది. సెక్సు తపన, రంధి, కుతి లాంటివి పురుషులతో పోలిస్తే స్త్రీలలో సహజంగానే తక్కువగా ఉంటాయి!

సున్నితమైన సెక్సుని, సున్నితమైన తీరులో సుతారంగా జరిపితే ఎక్కువమంది స్త్రీలు సంతృప్తి పడతారు. మళ్ళీ మళ్ళీ కావాలని కోరుకుంటారు. మోతాదు మించి జరిపినప్పుడు గానీ, లేక, అస్సలు మొదలెట్టలేకపోయినప్పుడుగానీ, ఆ స్త్రీ సెక్సు విముఖతనీ, సంసార విముఖతనీ పొందే ప్రమాదం ఉంది. అతి సెక్సునీ, అసమర్థ సెక్సునీ స్త్రీలు అంగీకరించలేరన్నమాట!

కనీసం 20–30% కొత్త దాంపత్యాలు కనీసం మొదటి వార్షికోత్సవం కూడా చేసుకోలేకపోవటాన్ని గమనించినప్పుడు, చాలామంది ఆడపిల్లల తండ్రులు చెప్పే కారణాలు సెక్సు పరమైనవే కనిపిస్తున్నాయి. తమ అల్లుడు అతి కాముకుడనీ, అనేక స్త్రీలతో సంబంధాలున్నవాడనిగానీ, లేదా అతను అసమర్థుడనీ, అసల్దే అతనికి లేదనీ అనడం మనం గమనిస్తున్నాం. అంటే, దాంపత్యం చెడటానికి సెక్సు కారణాలే ప్రముఖంగా కనిపిస్తున్నాయన్నమాట! చాలామంది దాన్ని పైకి చెప్పలేక వరకట్నాల వేధింపులూ, గృహహింస వేధింపుల గురించి మాట్లాడతుంటారు. ఈ వేధింపులకు మూలకారణం సెక్సు విముఖత ఏర్పడటమే కావచ్చు. దాన్ని సరిచేయటానికి ప్రయత్నించటం అవసరం.

# నడివయసులో జననాంగ సమస్యలు

- వి.యల్.యస్ (విజయవాడ)

ప్ర : వయోధర్మంగా ఏర్పడే జననాంగ సమస్యలకు పరిష్కారం చెప్తారా ?

నడి వయసులో లైంగిక సుఖానుభవం గురించే ఎక్కువ చెప్పుకోవాల్సింది ఉంది. యవ్వనం గురించి చెప్పేదేం వుంటుంది అన్నీ తెలిసిన వయసులో ఏమీ తెలియని ఒక విచిత్ర పరిస్థితి నడివయసు దాటుతున్న చాలామందిలో కనిపిస్తూ ఉంటుంది.

ఆడకైనా, మగకైనా లైంగిక పరమైన యావ ఉన్నంతగా లైంగిక కార్యం కోసం ముందుకు దూకలేని స్థితి నడివయసు ప్రత్యేకత! యవ్వనంలో ఉన్నప్పుడు ఎన్నో అవరోధాలు, అడ్డంకులు, పిల్లలు, అత్తమామలూ, కొత్త సంసారం, ఆర్థిక సమస్యలు ఇన్ని ఉన్నప్పటికీ, అప్పుడే ఎక్కువ సుఖానుభవాన్ని పొందగలుగుతారు కదా! కానీ, వాళ్ళకే యాభైలు వచ్చేసరికి ఎంత ఏకాంతం దొరికినా, ఎంత స్థిరజీవితం ఉన్నా మునుపటి లైంగిక సమరోత్సాహం కనబరచ లేకపోతారు. మరీ ముసలితనం సంగతి సరే... యాభై - అరవైల మధ్యే ఈ పరిస్థితి వస్తే ఇబ్బంది కరంగానే ఉంటుంది.

ఎంత వయసొచ్చినా గ్లామరు నిలబెట్టుకోగలిగిన వ్యక్తులుంటారు. అది వాళ్ళకి ప్రకృతి వరం అనే చెప్పాలి. కానీ, యాభైలోకి వచ్చిన చాలా మందిని గమనించినప్పుడు స్త్రీలలో ఎక్కువ వార్ధక్య కవళికలు కనబడతాయి. ముఖంలో దైన్యం కొట్టుమిట్టాడుతుంది. ఒకావిడ అంటుంది "మా అమ్మ అరవైల్లో చేయగలిగిన పనులు నేను నలభైలక్కూడా చేయలేకపోతున్నాను" అని! ఇది బాగా ఆలోచించవలసిన అంశమే!

పూర్వకాలపు మనుషులనీ, నాటు మనుషులనీ, నాగరికత తెలియని వాళ్ళనీ, జీవితాన్ని ఎంజాయ్ చేయటం వాళ్లకు తెలియదనీ చాలామంది యవ్వనం మీద ఉన్నవాళ్ళు బహిరంగంగానే అంటూ ఉంటారు. మరి తమను తాము నాగరికులం అనుకునే వీళ్ళే నలభైలు దాటేసరికే ఎందుకు ఔటైపోతున్నారు. యాభైలో కొచ్చే సరికి ఏమీ లేని వాళ్ళైపోవటానికి కారణం ఏమిటీ? ఆడవాళ్లలో ఈ పరిస్థితి మరీ ఎక్కువగా కనిపిస్తోందని శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఇది ప్రపంచ వ్యాప్తంగా ఉన్న

సమస్యే! ప్రపంచ సగటు ఐదు ఉంటే భారతదేశ సగటు పది ఉన్నా ఆశ్చర్యం లేదు. నడివయసు లైంగిక నిరర్థకత అనేది ఎందుకు ఏర్పడుతుందో గట్టిగానే ఆలోచించాలి!

నడి వయసు అంటాం గానీ, నూరేళ్ళలో మొదటి 20-25 యేళ్ళను లేప్రాయంగా వదిలేయాలి. ఇంక నిండు జీవితంలో నిజమైన లైంగికతని మనిషి అనుభవించేది కేవలం ఇరవై లేదా పాతికేళ్ళే! అంతేనా? ఈ ఇరవై లేదా పాతికేళ్ళ సెక్సు సుఖాన్ని మరో పదేళ్ళయినా పొడిగించగలమా...? అనే ప్రశ్నని నలభైలోకి వస్తున్న వాళ్ళే మొదట ఆలోచించాల్సి ఉంది. ముఖ్యంగా ఆడవాళ్ళకు ఈ మాట బాగా వర్తిస్తుంది.

ఈస్ట్రోజెన్, టెస్టోస్టిరోన్ హార్మోన్ల స్థాయి శరీరంలో తగ్గిపోవటమే లైంగిక నిరర్థకత ఏర్పడటానికి కారణం అని వైద్య నిపుణులు చెప్తున్నారు.

నిజానికి సెక్సు భావావేశం లైంగికావయవాలలో పుట్టదు. లైంగికోద్రేకానికి పుట్టిల్లు మెదడే!

మెదడులో ఉన్న హైపోథాలమస్ భాగం స్త్రీ పురుషుల్లో 'మూడ్' అని మనం చెప్పుకునే మానసిక స్థితిని కలిగిస్తాయి. జననాంగం లోపలి భాగాలు, వాటి చుట్టూ ఉండే కండరాలు, లోపలి మృదువైన భాగాలన్నింటి మీదా స్త్రీ పురుష హార్మోన్ల ప్రభావం ఉంటుంది. ఆ కారణంగా మనసులో కోరిక పుట్టినా జననాంగంలో కదలిక కనిపించని స్థితి ఏర్పడుతుంది.

ఆడవాళ్లలో జననాంగ శుష్కత్వం, కరకుదనం, నొప్పి ఉద్రేకం (dryness, irritation and pain) ఇలాంటివి కలుగుతుంటాయి. అందువలన లైంగిక విముఖత కూడా కలుగుతుంటుంది. దీన్ని సుశ్రుతుడు "కర్కశాం శీతలాం స్తబద్ధమల్ప స్పర్శాంచమైథునే" అంటూ వివరించాడు. స్త్రీల జనాంగం లోపల కర్కశత్వం (కరకుగా ఉండటం), వేడి తగ్గిపోయి చల్లగా ఉండటం, మొద్దుబారినట్టు, స్పర్శజ్ఞానం లేకుండా ఉండటం ఇలాంటి లక్షణాలు కనిపిస్తాయని సుశ్రుతుడి వివరణ.

మోయిశ్చరైజర్లు, జనాంగం లోపల సూక్ష్మజీవుల దోషాలు తగ్గటానికి క్రీములూ చెప్పినట్టే ఆయుర్వేదంలో అనేక తైలాలు, లేపనాలను చెప్పటం జరిగింది. సూక్ష్మజీవుల తాకిడి (infection) వలన జనాంగంలోపల మంట, దుర్గంధం, జిగటగా ఉండటం లాంటి బాధలు కలగవచ్చు. అందుకని లైంగికత కోసం మాత్రమే కాదు, జనాంగ వ్యాధి, దానివలన కలిగే బాధలు కూడా తగ్గాలి. కాబట్టి, కొన్ని ముందు జాగ్రత్తలు తప్పనిసరి అవుతాయి.

నడి వయసులోకి వస్తున్న స్త్రీ పురుషులందరూ ఆహారంలో వేడి చేసే పదార్థాలను బాగా తగ్గించేయటం మంచిది. వ్యాధి రాకమునుపే జాగ్రత్త తీసుకోవటం అవసరం కదా! అతి పులుపు పదార్థాలు, అతి కారం, మషాలా గ్రేవీలు, వెల్లుల్లి అల్లాలను

అతిగా వేసి వండిన పదార్థాలు నిస్సందేహంగా లైంగికతని చంపేస్తాయి. నూనెలో వేసి, లేదా అమితంగా నూనె పోసి వండిన పదార్థాలన్నీ లైంగికతని చంపేవే! అతిగా మద్యపానం, ధూమపానం నపుంసకతను కల్గించి తీరుతాయి. గుట్కాలు తింటే మగతనం గుటకాయస్వాహా అవుతుంది.

చలవ చేసేవి ఎక్కువగా తీసుకోండి. పులుపులేని కూరగాయలు అన్నీ చలవ చేసేవే! వాటిని చింతపండు, బఠాణీపిండి లేదా శనగపిండి వేసి, అతిగా మషాలాలు కలిపి పరమ వేడి చేసేవిగా మార్చి తింటున్నాం. అలా తినటం ఒక ఫ్యాషను అనుకుంటున్నాం. ఇది లైంగిక జీవితాన్ని తగ్గించేస్తుందని గమనించే లోపు జీవితకాలం లేటు అయిపోతుంది.

బూడిద గుమ్మడి కాయ గుజ్జును తరచూ తినండి. సొరకాయతో వండుకునేవన్నీ బూడిద గుమ్మడితోనూ వండుకోవచ్చు. సొరగింజలు, గుమ్మడి గింజలు, బాదం పప్పు, జాజికాయ, జాపత్రి, పచ్చకర్పూరం, సబ్జా గింజలు, ఈ నడివయసు సమస్యలకు చక్కని పరిష్కారాలనిస్తాయి. అరటికాయలు, పళ్ళు, ముల్లంగి, ఏలకులు, కర్బూజా పండు, మునగాకులు, మునగ పూలు ఇలాంటివి తీసుకుంటూ ఉండండి! లైంగిక శక్తిని చంపే అంశాలు అదుపులో కొస్తాయి. హార్మోన్లు వాటికవే సరి అవుతాయి. వీటిని ఎలాగైనా తివచ్చు. మీకై మీరే యుక్తిననుసరించి తినే పదార్థాలుగా చేసుకోండి.

లేతగా ఉన్న కొబ్బరిని మిక్సీ పట్టి, గుడ్డలో వేసి పిండితే చిక్కటి పాలొస్తాయి. మిగిలిన పిప్పిని పారేసి, పాలు మాత్రం ఒక గ్లాసు తీసుకోండి. మీకు నమ్మకం ఉన్న మంచి గంధం చెక్కను తీసుకుని, సానమీద అరగదీసి, ఒక చెంచాడు గంధాన్ని ఆ కొబ్బరి పాలలో కలిపి తాగండి! అవసరాన్ని బట్టి, రోజూ ఒకసారి లేదా రెండుసార్లు ఇలా తీసుకోండి. గంధం వాసన తాగటానికి అనువుగా లేదంటే, అందులో రెండు పచ్చకర్పూరం పలుకులు కలుపుకుని తాగండి. తీపి కూడా కలుపుకోవచ్చు. జనాంగాల సమస్యలకు మంచి నివారకంగా పని చేస్తుంది.

# రతిలో మంట - నివారణ

**- ఎన్.ఎల్ (మదనపల్లె)**

**ప్ర : సెక్సులో పాల్గొనాలంటే మంటగా వుంటోంది.**

"లైంగికోద్రేకం మొదలైతే చాలు, జననాంగంలో మంట మొదలౌతుంది. లైంగిక కార్యం పూర్తయ్యే వరకూ లోపల కారం పోసినట్టే ఉంటుంది..." ఇదెక్కడి సెక్సో నాకు అర్థం కావట్లేదు. దీనికన్నా సన్యాసమే భరించగలిగేలా ఉంది. సెక్సంటే తీపి అంటారు గానీ, ఇంత తీపుగా (soreness after sex) ఉంటుందని ఊహించలేదు..." అని బాధపడ్తుంది ఓ ఇల్లాలు.

మిషనులో ఆయిల్ వేయకపోతే lubrication లేక, అది కీచుమంటు పట్టేసి ఎలా తిరగదో, అలాగే జనాంగంలో కందెన లేదా తడి తక్కువగా ఉన్నప్పుడు కూడా తీపు, మంట, పోటు లాంటివి కలుగుతాయి. లోపలంతా ఎర్రగా కమిలిపోయి ఉంటుంది. నోటిపూత వచ్చినప్పుడు నాలికంతా పూసి ఎలా మంట పెడ్తుందో అలా irritation, redness soreness బాధలు ఏర్పడతాయి.

నిరంతరంగా తడిగా, చెమ్మగా ఉండవలసిన లైంగికావయం అలా ఎండి శుష్కించి పోవటానికి ఈస్ట్రోజెన్ హార్మోను లోపమే కారణం! సాధారణంగా మెనోపాజ్ వయసులోకి వస్తున్న వారిలో ఎక్కువగా కనిపించే సమస్య ఇది. జుట్టు ఎండి పోయి కొబ్బరి పీచులాగా అవటం, రచర్మం పొడిబారి, గరుకుగా ఉండటం, స్త్రీ జననాంగం పొడిబారటం ఇవన్నీ ఈస్ట్రోజెన్ లోపం వలన కలిగే సమస్యలు.

ముఖ్యంగా స్త్రీలలో లైంగికతకు ప్రేరకం ఈస్ట్రోజెన్ హార్మోనే! లైంగిక పరికరాలన్నింటిమీదా దాని లోపం వలన ఎంతో కొంత ప్రభావం వుంటుంది. జనాంగంలో సుఖప్రాప్తిని కలిగించే సున్నితమైన పొరలు కొద్దిపాటి వత్తిడికే irritate అవుతాయి. తడిని అక్కడ నిలిపి ఉంచేందుకు, సానమీద గంధం చెక్కని అరగదీసిన గంధాన్ని శుద్ధమైన వెన్న లేదా నేతిలో కొద్దిగా కలిపి, సబ్బుతో చేతులు కడుక్కొని అప్పుడు జనాంగంలోపల రాసుకుంటే చల్లదనం కలుగుతుంది. మంట తగ్గుతుంది.

గర్భధారణ వయసులో ఉన్న స్త్రీలలో శరీరమే జనాంగం లోపల నిరంతరం చెమ్మని సరఫరా చేసి, అక్కడ తడి నిలబడేలా చేస్తుంది. ఇది లేకపోతే సంతానోత్పత్తి ప్రక్రియ procreation సరిగా జరగదు. జనాంగానికి సంబంధించిన బార్తోలిన్ గ్రంథులు ఈ చెమ్మని సరఫరా చేస్తాయి. స్త్రీ పురుషులిద్దరికీ ఈ గ్రంథులు రతి సమయంలో ఎక్కువ తడిని విడుదల చేస్తాయి. ముందుగానే తడి ఎక్కువ వచ్చేస్తోందని అది తమ లైంగిక బలహీనతగా కొందరు అపోహ పడతారు. ఇది సెక్సు సుఖానుభవాన్ని పెంచేది గానీ, సెక్సు త్వరగా ముగిసిపోయేలా చేసేది కాదు. స్ఖలనానికీ దీనికీ ఎలాంటి సంబంధం లేదు. పురుషావయవం ఎలా తీగలు సాగుతూ తడిబారుతుందో అలాగే స్త్రీ అవయవం కూడా తడెక్కుతుంది. అది సెక్సు సమయంలో జనాంగాలమధ్య రాపిడి కలగకుండా కాపాడుతుంది.

కొందరు పురుషులకు విపరీతమైన వేడి వలనగానీ, కొన్ని రకాల infections వలన గానీ, చీము దోషం వలనగానీ వాళ్ళ వీర్యం విపరీతమైన వేడిగా ఉండి స్త్రీ జనాంగంలోపల మంటని vaginal burning sensation after sex కలగవచ్చు. ఇలాంటి వ్యక్తులు తప్పనిసరిగా వేడి చేసే ఆహార పదార్థాలు మానాలి. స్త్రీ పురుషుల్లో

ఎవరికి ఈ బాధ ఉన్నా ఇద్దరూ చలవ చేసే పదార్థాలే తినటం అవసరం. మెనోపాజ్ వయసులో స్త్రీలు సాధారణంగానే వేడిచేసే పదార్థాలను తగ్గించటం అవసరం అవుతుంది. యోనిలో మంట ఏర్పడినప్పుడు మరింత జాగ్రత్త పడాలి. పులుపు, కారం, పచ్చళ్ళు అతిగా మషాలాలూ, ఆల్కాహాలు, ధూమపానం ఇవి ఇరిటేషన్ కలిగించేవిగా ఉంటాయి.

కొన్ని రకాల ఆహార పదార్థాలుగానీ, కొన్ని రకాల ఔషధాలు గానీ, జననాంగం దగ్గర ఉపయోగించే కండోములూ తొడుగులు, నైలాన్ బికినీలూ, సబ్బులూ, లోషన్లూ వగైరా శరీరానికి సరిపడనప్పుడు యోని శుష్కత్వం (vaginal dryness) ఏర్పడవచ్చు.

జనాంగ ప్రక్షాళన కోసం బలమైన యాంటీ సెప్టిక్ లోషన్లను వాడకండి. డెట్టాల్ లాంటి లోషన్లను నేరుగా వాడటం వలన పొక్కిపోయి, బొబ్బలెక్కి, నానా హడావిడి చేస్తాయి. సున్నితమైన అవయవం దగ్గర చాలా సున్నితమైన ద్రవ్యాలనే ఉపయోగించాలి. అరికాలి మడమల దగ్గర వ్రాయగలిగిన వాటిని తెచ్చి జనాంగం దగ్గర వాడకూడదు.

వైద్యుల సలహాలను పొందండి. అశ్రద్ధ చేయకండి.

# ఆసక్తి తగ్గిపోతోందా?

- వై.ఎస్.ఎల్ (ద్వారపూడి)

**ప్ర : డాక్టరుగారూ! వైద్యుడు తండ్రితో సమానం! మీ రచనలు తరచూ చదువుతుంటాను. నాదొక సమస్య. ఇది నాలాగే చాలా మందికి ఉండవచ్చు. అందరికీ ఉపయోగపడుతుంది కదా అని పత్రికా ముఖంగా అడుగుతున్నాను. నేను హౌస్ వైఫ్ని నాకింకా మెనోపాజు రాలేదు. కానీ రోజురోజుకి కోరిక తగ్గిపోతోంది అసలా ధ్యాసే రావటం లేదు. థైరాయిడ్, షుగరూ ఏమీ లేవ్వు. కోరిక తగ్గిపోవటానికి కారణాలేమిటీ? పరిష్కారాలు చెప్పగలరు.**

కోరికలోని బలాన్ని కొలిచేందుకు కొలమానాలు లేవు. మనుషులందరికీ కోరిక ఒకే తీరున ఉండదు. ఆ కోరిక కూడా ఎల్లకాలం ఒకే తీరున ఉండదు. లైంగికపరమైన యావ తగ్గటానికి మానసిక కారణాలే ముఖ్యమైనవి. కుటుంబ పరిస్థితులు, భార్యాభర్తల మధ్య అవగాహనలు కూడా కారణం కావచ్చు. దాన్ని వ్యాధి అనటానికీ వీల్లేదు. ఒక్కోసారి వ్యాధిగా కూడా రావచ్చు.

సెక్సనేది దంపతులిద్దరూ ఒకరికొకరు సుఖాన్ని ఇచ్చే ప్రక్రియే గానీ, ఎదుటివారి

నుంచి పుచ్చుకునేది కాదు. ఇచ్చేది సమరతి. పుచ్చుకునేది అత్యాచారం. ఇచ్చే ఉత్సాహం దాంపత్యానికి బలం చేకూరుస్తుంది. మీ ఉత్తరాన్ని బట్టి మీలో లైంగిక వైరాగ్యం లేదని ఇచ్చే ఉత్సాహం పోలేదనీ అర్థం అవుతోంది. ఆసక్తి తగ్గటం ఒక తాత్కాలిక విరామం మాత్రమే.

కోరిక తగ్గిపోవటాన్ని సాంకేతికంగా Hypoactive Sexual Desire Disorder (HSDD) అంటారు. పురుషులకు సెక్సు విషయంలో శారీరకంగా ఉన్నంత సౌలభ్యం స్త్రీలకు ఉండదు. మనసులో పుట్టిన కోరిక శరీరం పైకి ప్రసరించేందుకు స్త్రీలలో ఒక్కోసారి ఆలస్యం కావచ్చు. శరీరంలో ఉత్తేజం వచ్చేలోగా ఆ కోరిక అణగిపోవచ్చు. స్త్రీలలోనే కాదు, పురుషుల్లో కూడా ఇలా జరగవచ్చు. దీని వలన చికాకులూ, విసుగుదలలూ, చిరుకోపాలూ ఎక్కువై భార్యాభర్తల మధ్య ఎడం పెరిగే అవకాశం ఉంది. సెక్సు యావ, ధ్యాస తగ్గిపోతుంటే చాకచక్యాన్ని ఉపయోగించాలి. మనసు దాని మీద పెట్టాలి. ఒక రకంగా కాకపోతే ఇంకోరకంగా ప్రయత్నించి ఎక్కువ సుఖాన్ని ఇచ్చేందుకు ప్రయత్నించాలి. మనోబలంతోనే లైంగిక అనాసక్తతను (HSDD) ఎదుర్కోవాలి. భాగస్వామి సహకారం కూడా అవసరమే. భార్యాభర్తలిద్దరూ కూడ బలుక్కోవటమే ఆదర్శ దాంపత్యం.

శరీరంలో వేడి ఎక్కువగా ఉన్న వారిలో ఇలాంటి సమస్య తరచూ కలగవచ్చు. చలవచేసే ద్రవ్యాలన్నీ లైంగిక శక్తినీ, ఆసక్తినీ పెంచేవిగా ఉంటాయి. బూడిదగుమ్మడి గుజ్జు, దూలగొండి విత్తులు మనసు మీద పనిచేసి, చలవనిచ్చి, సెక్సు సమర్థత పెరిగేందుకు తోడ్పడతాయి. కూష్మాండలేహ్యం బూడిదగుమ్మడితోనూ, వానరీకల్పం దూలగొండి విత్తులతోనూ తయారైన ప్రసిద్ధ ఔసధాలు, ఒక చెంచా మోతాదులో తీసుకుని పాలు తాగండి. అవసరం అయితే, రెండు పూటలా తీసుకోవచ్చు.

# రక్షిత రతి అంటే ?

- కె.బి.ఆర్ (తాడేపల్లిగూడెం)

**ప్ర : సేఫ్ సెక్సంటే ఏమిటి డాక్టరుగారూ! పెళ్ళయినవాళ్ళు కూడా పాటించాలా?**

**జ :** ఎస్‌టీడీ (సెక్సు ద్వారా సంక్రమించే వ్యాధులు) జాగ్రత్తలు, గర్భం రాకుండా తగిన జాగ్రత్తలు తీసుకుంటే దాన్ని ప్రొటెక్టెడ్ సెక్సు (రక్షితరతి) అంటారు. చట్టబద్ధంగా సెక్సులో పాల్గొనే వారిక్కూడా (లీగల్ సెక్సు) ప్రెగ్నెన్సీ వద్దనుకున్నప్పుడు గానీ, వ్యాధులేవైనా ఉన్నప్పుడుగానీ ఈ సేఫ్ సెక్సు సూత్రాలు వర్తిస్తాయి.

# 'నాణ్యమైన సెక్సు' హక్కు

- కె.వి.ఎల్.ఎన్.ఎన్ (మచిలీపట్నం)

**ప్ర : డాక్టరుగారూ! మొన్న మీరు ఆంధ్రభూమి ఆదివారం సంచికలో సెక్సు హక్కుల గురించి ప్రస్తావించారు. హక్కుల్లాంటి పదాలు దాంపత్య జీవితానికి ఎలా వర్తిస్తాయో మాకు అర్థం కాలేదు. వివరణ కావాలి. చెప్తారా?**

**జ :** మనసులోని స్వేచ్ఛాభావనకూ, ఔన్నత్యానికీ, సమభావనకూ, అంకిత భావనకూ సెక్సు ఒక సంకేతం. నాణ్యమైన సెక్సు అందరి హక్కు!

మనం తింటున్న ఆహారం, మనం వాడుతున్న వస్తువులు, మనం జీవిస్తున్న పరిసరాలు, మనచుట్టూ ఉన్న మనుషుల బారి నుండి మన సెక్సు నాణ్యతకు భంగం కలగకుండా ఉండాలంటే సెక్సు హక్కులను స్పష్టంగా నిర్దేశించే చట్టం రావాలి. ప్రభుత్వ వ్యవస్థ, న్యాయవ్యవస్థలు, ఇంకా ఇతర సామాజిక వ్యవస్థలూ దీనిపైన దృష్టిపెట్టాలి.

నాణ్యమైన సెక్సు అంటే నాణ్యమైన జీవితమే! స్వచ్ఛభారత్'లో ఇదీ ఒక భాగమే!

నిర్భయ చట్టాలు నేరానికి శిక్షలు వేసేందుకు ఉపయోగపడతాయి. గృహ హింసచట్టాలు పోలీసు స్టేషనకు వెళ్ళి రిపోర్టు చేస్తేనే వర్తిస్తాయి. కానీ, స్త్రీ పురుషులకు నాణ్యమైన సెక్సును పొందే హక్కుని ప్రసాదించటం లేదు.

నూనెలోనూ, తేనెలోనూ, పాలలోనూ, నేతిలోనూ కలుపుతున్న కల్తీలు సెక్సు బలహీనతలను తెస్తున్నాయి. గుండ్రటి బఠాణీ శనగలు (బొంబాయి శనగలు) మగతనాన్ని దెబ్బతీస్తాయని వైద్యశాస్త్రం హెచ్చరిస్తోంది. వాటి పిండినే మనకు శనగపిండి పేరుతో అంటగడ్తున్నారు. ఇది మన నాణ్యమైన సెక్సు హక్కును దెబ్బతీయటమే!

స్వీటు షాపుల్లోనూ, హోటళ్లలోనూ విపరీతంగా రంగులు కలిపిన పదార్థాలే మనకకు దొరుకుతున్నాయి. ఆ రంగుల్లో సెక్సు బలహీనతను తెచ్చేవి లేవనే హామీ లేదు.

ప్రభుత్వ ఉదాసీనత వలన కూడా మనం లైంగిక నష్టాన్ని చవి చూస్తున్నాం. వీటి గురించి మాట్లాడుకోవాలి. లోతుగా చర్చించాలి. నాణ్యమైన సెక్సుహక్కుల్ని సాధించుకోవటానికి ఉద్యమ స్ఫూర్తితో పోరాడాలి.

# సరసాలాడేవాళ్ళే సమర్థులా?

- కె.వి.ఆర్. (తిరువూరు)

**ప్ర : కొందరు స్త్రీ పురుషులు అదేపనిగా సరసాలాడుతూ మాట్లాడుతుంటారు. అలాంటి వాళ్లకి సెక్సు సమర్థత ఎక్కువగా ఉంటుందా? వాళ్ళు జీవితాన్ని ఎక్కువ ఎంజాయి చేస్తారనీ, వాళ్ళకి కష్టాలంటే తెలియవనీ అంటారు. నమ్మొచ్చా?**

జ : అదేపనిగా సరసాలాడటం (incessant flirt) ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ (sense of humor) సరదాగా జీవించటం వేర్వేరు అంశాలు. సరసాలరాయుళ్ళు లోకువ అవటమే తప్ప వాళ్ళకి దక్కే ఫలితం ఉండదు. How to flirt with a guy without really flirting అనే పుస్తకంలో ఈ విషయాలమీద లోతైన చర్చ జరిగింది. వల వెయ్యటం, వలపించటం, వదిలించుకోవటం అనే మూడు విద్యల్లో ఆరితేరిన సరసరాయుళ్ళు ప్రమాదకర వ్యక్తులే!

తనను చూడగానే ఆడవాళ్ళు అమాంతం ఫ్లాట్ అయిపోతారని కొందరు మగాళ్లకు ఒక దురాశ ఉంటుంది. వెర్రిమొర్రి క్రాఫింగుల్నీ, చెవరింగుల్నీ, ముక్కు పుడకల్నీ, జిప్పు తీసే ఉన్నట్టు కుట్టిన జీన్సుప్యాంట్లని తొడుక్కుంటే సినిమా హీరోయిన్లు ఫ్లాట్ కావచ్చునేమోగానీ, నిజ జీవితం అలా ఉండదు.

'ఎ ఫేస్ ఇన్ ద క్రౌడ్' అంటామే అలా ప్రత్యేకంగా అనిపించిన, ప్రత్యేకంగా కనిపించిన, ప్రత్యేకంగా వినిపించిన వ్యక్తి మాత్రమే స్త్రీల దృష్టిలో ఆకర్షణీయుడు.

ఆడవాళ్లలో తమమీద తమకు అపనమ్మకం గానీ, లేదా తమని తాము తక్కువ చేసుకుని ఆలోచించటం గానీ అరుదు.

ఆకర్షణీయత విషయంలో ఆడవాళ్ల అంచనాలు ఇతరులకు అందనంతగా ఉంటాయి. అది తెలియక మగాళ్లు తాము ఆకర్షించబడటం కోసం చేసే వెర్రిచేష్టల్లో ఈ అతి సరసం ఒకటి! రెండర్థాల సంభాషణా చాతుర్య ప్రదర్శన, ప్యాంటుని పిర్రలు కనిపించేంతగా జార్చి కట్టటం, గుండీలు తీసుకుని ఛాతీ విరిచి చూపిస్తూ నడవటం... ఈ ఫోజులన్నీ ఆకర్షించబడటానికి మగాళ్ళు పడే పాట్లు వాటిని వెర్రి ఫోజులుగా గుర్తించే చాకచక్యం ఆడవాళ్లకి సహజంగానే ఉంటుంది. ఆ సంగతి ఫోజులిచ్చే వాళ్ళకు తెలీదు.

'సైన్సు ఆఫ్ హ్యూమర్' కలిగిన వ్యక్తుల హాస్య చతురత ఎదుటిమనిషిని సంతోషపెట్టాలనే తపనతో కూడి ఉంటుంది. కానీ, అతి సరస సంభాషణ ఎదుటి వ్యక్తిని లొంగదీసుకోవాలనే కుట్రతో కూడుకుని ఉంటుంది. మీరు చెప్పిన సెక్సు సమర్థత వగైరాలు ఈ రెండో తరహా వ్యక్తులకు ఉండే అవకాశమే లేదు. అయినా, మాటల్ని బట్టి, చేతల్ని బట్టి సెక్సు సమర్థత నిర్ధారించగలిగేది కాదు!

# అంగ ప్రవేశం

- టి.ఎస్.ఆర్ (నేలకొండపల్లి)

**ప్ర : ఆసక్తి కొద్దీ సెక్సులో తొలిసారి పాల్గొన్నాం. కానీ, అంగప్రవేశమే సరిగా జరగలేదు. కానీ నాకు స్ఖలనం అయ్యింది. వీర్యం లోపలికి పోయిందేమో, ప్రెగ్నెన్సీ వస్తుందేమోనని తనకు బెంగగా ఉంది...**

జ : ప్రెగ్నెన్సీ భయం అక్రమ సెక్సులో పాల్గొనాలని అనుకున్నప్పుడే మీకు కలిగి ఉండాల్సింది. అంగప్రవేశం (పెనిట్రేషన్) జరక్కపోయినా స్త్రీ జననాంగం పైన పడిన వీర్యం పాకుతూ లోపలికి పోయి, ప్రెగ్నెన్సీ పిలవకుండానే వచ్చే ప్రమాదం లేకపోలేదు. పెళ్ళి చేసుకున్నాక అంగానికి ప్రవేశం కల్పిస్తే మీకీ 'బెంగ' ఉండేది కాదు కదా! ముందు ఆమెకు ప్రెగ్నెన్సీ టెస్ట్ చేయించండి.

# రసికత - అరసికత - విరసికత !

**ప్ర : ఫలానా ఆయన గొప్ప రసికులని స్టేజీమీద పొగిడి సన్మానాలు చేస్తూ ఉంటారు కదా... రసికత అంటే ఏమిటి? అది ఉన్నవాళ్లని ఎందుకు గౌరవించాలి? అరసికతని ఎలా గుర్తించాలి? వివరంగా చెప్పండి డాక్టరుగారూ!**

జ : రసికత అనే మాట వెనుక చాలా అర్థాలున్నాయి. ఆ వ్యక్తిని బహిరంగంగా రసికుడని పొగిడింది. ఆయన లైంగిక రసికత గురించి కాదు. రసం అంటే సారం (ఎస్సెన్స్) ఆ రసం (సారం) ఆ విషయంలోని వాస్తవికత! దాన్ని తెలుసుకోవటం రసజ్ఞత. తెలుసుకున్నవాడు రసజ్ఞుడు దాన్ని ఆస్వాధించటం రసికత. సంగీత నృత్య సాహిత్యాది కళల్లో రసం పదాన్ని హాస్యం, శృంగారం కరుణ ఇలా షడ్రసాలకు సంబంధించి వాడతారు. దేని విషయంలో పరిజ్ఞానం ఉంటే అది దాని రసజ్ఞత అవుతుంది.

"వారు రసికులు" అంటే సంగీతాది కళల్లో నిష్ణాతులని మాత్రమే అర్థం. వారి సెక్సు సమర్థతకు ఈ రసిక శబ్దాన్ని ఆపాదించనవసరం లేదు. సెక్సు రసికతలో ఆరోగ్యపరమైన రసికత, మనోవికార పరమైన రసికత రెండు రకాలున్నాయి. ఎదుటి వ్యక్తిని సంతోషపెట్టి, తాను సంతోషించటం ఆరోగ్యకర రసికత! ఎదుటి వ్యక్తి ఆమోదంతో నిమిత్తం లేకుండా తన ఆనందాన్ని మాత్రమే చూసుకోవటం వికార రసికత.

కొందరు మగాళ్ళకు ఆడమనిషయితే చాలు, వావివరసలూ, సభ్యతా సంస్కారాల ప్రమేయం లేకుండా రసికతను ప్రదర్శించే తత్త్వం ఉంటుంది. ఇంకొందరు మగాళ్ళకు రసికత కలగటానికి స్త్రీయే కావాల్సిన అవసరం ఉండదు. ఎదురుగా ఒక మగాడు

కనిపిస్తే చాలు వీళ్ళలో ఎక్కడ లేని రసికత పుట్టుకొస్తుంది. అది స్వలింగ కాముకతే గానీ రసికత కాదు. ఇంకొందరు మగాళ్ళుంటారు... వీళ్ళు పూర్తి విరసికులు తమకు సెక్సు అవసరమే లేదన్నట్టు వ్యవహరిస్తుంటారు. సెక్సనే ప్రకృతి ధర్మానికి వ్యతిరేకులన్నట్టే మాట్లాడతారు. కానీ, అందమైన ఆడపిల్ల కనిపిస్తే చెరిచి, అందం చెడగొడితే గానీ వీళ్ళకు రసికత కలగదు. యాసిడ్ ప్రేమికులంతా ఈ విరసికులే! వాళ్ళ వాళ్ల తత్వాలనుబట్టి వాళ్ళలోని విరసికతను ఎంత తీవ్రస్థాయిలోనైనా వీళ్ళు వ్యక్తపరచగలరు. ఇలా చాలా మంది విరసికుల్ని మనం నిజ జీవితంలో చూస్తూను ఉంటాం. సమాజ నీతికి భిన్నంగా వక్రమార్గాన పట్టిన సెక్సు ప్రవర్తనని విరసికత అంటారు. అది ప్రైవేటు సెక్సు వ్యవహారం కానే కాదు. సమాజం మొత్తానికి చెరుపు చేసేది కాబట్టి, దాని గురించి బహిరంగంగా మాట్లాడవలసిన అవసరం ఉంది!

వ్యక్తుల 'లైంగిక ప్రాధాన్యత (సెక్సువల్ ప్రిఫరెన్స్) ఏవిటో తెలుసుకునే విధానాలు అందుబాటులోకి రావాలి. వారిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకున్నారు అంటే ఆమెకి ఏ రంగు చీరలు ఇష్టమో, ఈయనకు ఏ విధమైన కూరలు ఇష్టమో తెలుసుకోవటం అనుకుంటే పొరబాటు. ఆ వ్యక్తి లైంగిక ప్రాధాన్యతని తెలుసుకోవటం, ఆ వ్యక్తి మానసిక అనారోగ్యాన్ని ముఖ్యంగా సెక్సు పరమైన మనో దౌర్బల్యాన్ని గ్రహించగలగాలి. ఇది సమాజ పరమైన కోణంలోంచి పరిశీలించాల్సిన విషయం కూడా! వ్యక్తి రసికుడో, అరసికుడో, విరసికుడో అతని మాటతీరునీ, చేత తీరునీ ముందుగానే గమనించగలగటం వలన దాంపత్యాలు చెడకుండా ఉంటాయి.

# మనలో 'గే'లున్నారా?

- కె.యన్.సి (ఆదిలాబాద్)

**ప్ర : నా వయసు 30 యేళ్ళు. ఈ మధ్య తరచూ అసహ్యకరమైన, అసభ్యకరమైన ఆలోచనలు వస్తున్నాయి. ఒడ్డూ పొడుగూ ఉన్న మగవాళ్ళని చూసినప్పుడు నా మనసు ఆడవాళ్ళ మనసులా స్పందిస్తోంది. ఇలా జరగటానికి కారణం ఏమిటి? అందులోంచి నేను ఎలా బయటపడాలి? నేను 'గే' నేనా? ఎలా తెలుసుకోవటం? అసలు 'గే' లు అలా ఎందుకవుతారు? దీనికి పరిష్కారం ఏమిటి?**

జ : మీ సుదీర్ఘమైన ఉత్తరంలో చాలా విషయాలు ప్రస్తావించారు. ఇద్దరు స్త్రీల మధ్య లేదా ఇద్దరు పురుషుల మధ్య లైంగిక సంబంధాన్ని 'గే' సెక్సు' అంటారు. స్వలింగ సంపర్కం (హోమో సెక్సువాలిటీ) కూడా ఇలాంటిదే! ఇప్పుడు ఈ పదాన్ని స్త్రీలకు మాత్రమే వాడుతున్నారు. లైంగిక సంబంధం కలిగిన ఇద్దరు స్త్రీలను లెస్బియన్లనీ, పురుషుల్ని 'గే'లనీ అంటున్నారు.

సాధారణంగా లైంగికోత్తేజం అనేది పిల్లల్లో ఏడు నుండి పది పన్నెండేళ్ళ మధ్య కలుగుతుంది. అది పెద్దవాళ్ళయ్యాక కలిగే లైంగికతకు (adult sexual orientation) పునాది అవుతుంది. లైంగికపరమైన మనోవికారాలు ప్రవేశించే వయసది! వాటి వలన ఆ పిల్లలు పెద్దయ్యాక 'గే'లుగా 'లెస్బియన్లు'గా మారతారు. హాస్టళ్ళలో ఉండి చదువుకునే పిల్లల్లో ఇది మరీ ఎక్కువగా ఉంటుంది. తమ పిల్లల్ని హాస్టళ్ళపాలు చేయబోయే ముందు తల్లిదండ్రులు ఇది గుర్తించాలి.

'గే' తరహా ఆలోచనల్ని నిగ్రహించుకోగలగటం పెద్ద కష్టమేమీ కాదు. కానీ, మనోనిగ్రహాన్ని మరిచి తమకు తోచినట్టు చేసేయటమే హీరోయిజంగా భావించటం చేత 'గే'లు మన దేశంలో కూడా తయారౌతున్నారు. ఈ మధ్యకాలంలో తెలుగు సినిమాలలో కమెడియన్ల చేత 'గే'లుగా నటింపచేయటం ఎక్కువైంది. కమెడియన్లు హీరోలుగా మారాలని కోరుకోవాలి గానీ, 'గే'లుగా మారాలని కోరుకోకూడదు కదా! గాంధీజీని అనుసరించటం కన్నా సినిమావాళ్ళని అనుకరించటానికి యువతరం ఎక్కువ ఇష్టపడతారు కాబట్టి, మన సినిమా నటులు తెలుగు యువతని 'గే'లుగా మార్చకూడదు.

ఆలోచనలను అదుపులో పెట్టుకోవటాన్ని, నిగ్రహంగా ఉండటాన్ని చిన్ననాటి నుండే నేర్పించగలిగితే 'గే' సంస్కృతి ఆగే అవకాశం ఉంది. వ్యక్తిత్వ వికాసం తరగతుల్లో మనోవికారాల్లేని శుద్ధమనసు గురించి బోధించాలి. తెల్లవారేసరికి కోటీశ్వరుడు కావటం ఎలాగో ఆలోచించేకన్నా, మనో నియంత్రణ వలన వ్యక్తిత్వం వికసించటం గురించి, వ్యక్తిగత సమర్థతను పెంచుకోవటం ద్వారా జీవితంలో రాణించటం గురించీ యువతని ఆలోచింపచేయాలి. తద్వారా 'గే' సంస్కృతిని నిరోధించవచ్చు.

# సెక్సు పదకోశం అవసరం?

- వీ.వీ.ఆర్ (కాకినాడ)

**ప్ర : సెక్స్ సాంకేతిక పదాల్లో మాట్లాడితే, అసభ్యత అశ్లీలత ఉండవనీ, బాధను చెప్పుకోవటం తేలిక అనీ మీరు వ్రాశారు. సెక్సు పదకోశం దొరుకుతోందా?**

**జ :** మీరు సరదాగా అన్నారో, సీరియస్‌గా అన్నారోగానీ సెక్సు పదకోశం అవసరం ఎంతయినా ఉంది. అయితే అదొక వైద్యగ్రంథంలా కాకుండా జన సామాన్యానికి ఉపయోగపడేదిగా ఉండాలి. అటువంటి నిఘంటువు తెలుగులో తయారు కావాలి. త్వరలో వస్తుందని ఆశిద్దాం. సెక్సుకు సంబంధించిన సాంకేతిక

పదాలు బాగా వ్యాప్తిలోకి వస్తే, సెక్సు విషయాలను పిల్లలూ పెద్దలూ కలిసే మాట్లాడుకోగలుగుతారు. సెక్సుకు సంబంధించిన సాంకేతిక పరిభాష తెలియకపోవటం వలన బాధ చెప్పుకోవటం కష్టం అవుతుంది. సెక్సు పదాలన్నీ బూతుపదాలుగా ముద్రపడి ఉంటాయి. రతి, సంభోగం లాంటి సంస్కృత పదాలు కూడా ఇబ్బంది కలిగించేవే! coitus, conjugation లాంటి సాంకేతికపదాలు అసభ్యంగా అనిపించవు. అసభ్యత, అశ్లీలత అనేవి ఆ పదాలలోనో, భావాలలోనో, వాటిని అర్థం చేసుకోవటంలోనో లేవు! వాటిని వ్యక్తపరిచే తీరులో ఉన్నాయి. పువ్వుల ఫలదీకరణాన్నీ, జంతువుల లైంగిక కార్యాన్ని ఒక చక్కలిగిలి (టికిలింగ్- లైంగికోత్తేజకారకమైన) సినిమాగా చూడటం సెక్సు అనారోగ్యమే!

# సెక్స్ గుట్టు రట్టు

**- సీ.పీ.ఆర్ (నూతక్కి)**

**ప్ర : సెక్సుకు కొంచెం గుట్టూ, గోప్యత, రహస్యం ఉండాలి కదండీ... సెక్సు స్వేచ్ఛ అంటే బరితెగించినట్టు వ్యవహరించటం అవుతుందేమోనని...?**

"అబద్ధాలనే మందపాటి దుస్తుల్లో మనిషి తన సెక్సుని కప్పెడతాడనీ, మనిషికి సెక్సు నిజాయితీ లేదనీ ఫ్రాయిడ్ అంటాడు. సెక్సు పరిజ్ఞానం పెంచుకోగలగటమే సెక్సు నిజాయితీ! సెక్సు హక్కు, సెక్సు నీతి, సెక్సు బాధ్యత, సెక్సు ఆరోగ్యం, సెక్సు సభ్యత, సెక్సు ఆచారం ఇవన్నీ ఆరోగ్యకరమైన లైంగికతకు ప్రాతిపదికలు. 'హేవెలాక్ ఎల్లీస్' అనే తొలితరం సెక్సాలజిస్టు 'సిగ్గు' గురించి వ్రాస్తూ, "జననాంగాలు 'అక్కడ' ఉన్నాయి కాబట్టే ఈ సిగ్గు, ఈ రహస్యం, ఈ గోప్యం ఇదంతా! అదే, అరచేతిలో ఉన్నట్టయితే షేక్'హ్యాండ్ ఇచ్చుకున్నంత సులువుగా రతి కార్యం జరిగిపోయేది. అప్పుడీ సిగ్గెగ్గులూ, రసమూ, రసికత కూడా ఉండేవి కావు" అంటాడు. సెక్సుకి గోప్యత లేకపోతే వ్యవహారం ఇలా అంగడి పాలౌతుంది. దీన్ని సెక్సు స్వేచ్ఛగా భావించటం కన్నా అమాయకత్వం ఇంకొకటి ఉండదు. అసలది సెక్సే కాదు.

కానీ, మరీ అతి గోప్యత కూడా మంచిది కాదు! ఎవరికీ చెప్పుకోకుండా, వైద్య సలహా పొందకుండా యేళ్ళ తరబడీ లైంగిక అనారోగ్యాన్ని మోస్తూన్న వాళ్లున్నారు. వీటిలో చాలా విషయాలు అనుభవంలోంచి నేర్చుకునేవే ఉంటాయి. కొన్నింటికి వైద్య సలహాలు అవసరం అవుతాయి. కాబట్టి, సెక్సు బాధని ఆత్మీయులతో చెప్పుకోగలగాలంటే గోప్యతను సడలించటం అవసరం. లేకపోతే సంసారాలు చెడే ప్రమాదం కూడా ఉంటుంది. సెక్సు స్వేచ్ఛ అంటే 'అంగడిరతి' కాదు. సుఖంగా,

ఆరోగ్యవంతమైన సెక్సుని పొందే ఒక హక్కుగా భావించండి. మన హక్కు మనం పొందటానికి గుట్టెందుకండీ...?

# తొలి అనుభవానికే ప్రెగ్నెన్సీ వస్తుందా?

**- వి.యస్ (మెహబూబాబాద్)**

**ప్ర : ఇద్దరం ప్రేమించుకుంటున్నాం. తొలిసారి ఇద్దరమూ సెక్సులో కలిస్తే కడుపు వచ్చే ప్రమాదం ఉన్నదా? తొలిసారికే వచ్చేస్తుందా...? ఎవరిని అడగాలో తెలియక ఇద్దరమూ కలిసే ఈ ఉత్తరం వ్రాస్తున్నాము. వివరంగా చెప్పగలరు.**

**జ :** గర్భం రావటానికి తొలిసారా మలిసారా అనే తేడాలేమీ ఉండవు... ఇద్దరూ ఇంజనీరింగు చదివి, అర్థం లేని చట్టవ్యతిరేక సహజీవనాల కోసం ఎందుకు వెంపర్లాడతారు? రాజమార్గంలో పెళ్ళి చేసుకుని చట్టబద్ధంగా జీవించండి... పండంటి పిల్లల్ని కని, వాళ్ళు సగౌరవంగా సమాజంలో తలెత్తుకు తిరిగేలా పెంచండి! దొంగలాగా ఎందుకు బతకాలి? మీలో సెక్సు నిజాయితీ ఉంటేనే మీకు పుట్టే పిల్లలు సమాజానికి ఉపయోగపడే వారుగా పెరుగుతారు. ఆరోగ్యకర దాంపత్యమే ఉత్తమ పౌరుల్ని ఇస్తుంది.

# ఉపరతి ఉపయోగం?

**- టి.కె.వి.సి (జహీరాబాద్)**

**ప్ర : భార్యాభర్తా కలిసినప్పుడు ఉపరతి ఎక్కువసేపు కొనసాగించాలని చాలా మందిచెప్తారు. దాని ప్రయోజనం వివరిస్తారా?**

**జ :** భౌతికంగానూ, మానసికంగా కూడా ఉద్వేగాన్ని తెచ్చుకునేందుకు, వచ్చినదాన్ని నిలబెట్టుకునేందుకు, తృప్తిని కొనసాగించేందుకూ, మరింత బలమైన బంధాన్ని సాధించుకునేందుకూ ఉపరతి ఉపయోగపడుతుంది. స్త్రీ పురుషుల మధ్య ఉపరతి అనేది ఒక emotional connection! ఉపరతి లేని రతి హడావిడి బేరంలా సాగుతుంది. ఒళ్ళో పెట్టనా దళ్ళో పెట్టనా అనే సామెతని ఇలాంటి హడావిడి కార్యానికే ఉపయోగిస్తారు.

ఆస్ట్రేలియాలో జరిగిన ఒక పరిశోధనలో మెజారిటీ ఆడవాళ్ళు అసలు రతికన్నా ఉపరతే తమకు ఎక్కువ ఆనందదాయకం, తృప్తిదాయకంగా ఉంటున్నదని చెప్పారట. అలా ఉండటానికి కారణాలు అనేకం ఉన్నాయి. అన్నింటి కన్నా ముఖ్యమైనది ఉపరతిలో గంటల కొద్దీ ఆనందాన్ని పొడిగించుకుంటూ పోగలిగే అవకాశం కలుగుతుంది. ఉపరతి ద్వారా లైంగికోత్తేజం కలిగినప్పుడు కటి భాగంలో కండరాలు

గర్భాశయాన్ని పైకి లేపుతాయి. అందువలన యోని ద్వారం బాగా విచ్చుకుంటుంది. దానివలన రతికి అనుకూలత ఏర్పడుతుంది. ఉపరతి జరక్కపోతే ఈ సౌలభ్యాన్ని కోల్పోవాల్సి రావచ్చు! ఉపరతి ఉత్తేజం వలన స్త్రీ పురుష జననాంగాలు తడిబారి ఎలాంటి వత్తిడీ లేకుండా రతి జరిగేందుకు అవకాశం ఏర్పడుతుంది.

ఉపరతిలో ముద్దుముచ్చట్లది ముఖ్యమైనపాత్ర. ఎక్కువ లైంగికోత్తేజాన్ని కలిగించేది ముద్దేనని తేలింది. ఎవరికి ఎక్కడ ముద్దుపెడితే ఎక్కువ లైంగికోత్తేజం కలుగుతుందో తెలుసుకుని ఆచరించటమే నిజమైన ఉపరతి. సెక్సు కబుర్లు కూడా ఎక్కువ ఉత్తేజాన్ని ఇచ్చేవిగా ఉంటాయి. "ఈ రోజుల్లో ఇంత తీరిక ఎవరికి ఉందండీ..." అని పెదవి విరిచేయకండి. ఉపరతి లేని సెక్సు ఉప్పులేని కూరలాంటిదే! సెక్సులో అసంతృప్తులే పెళ్ళయిన ఏడాదికే విడాకులకు దారితీస్తున్నాయి.

# కడుక్కుంటే ప్రెగెన్సీ రాదా?

- కె.ఆర్.టి (నిజామాబాద్)

**ప్ర : సిల్లీగా అడుగుతున్నాననుకోకండి. ముఖాముఖి అడిగి తెలుసుకోగలిగే విషయాలుకావు. కుర్రాళ్ళకే కాదు, పెద్దాళ్ళకీ సందేహాలు పీడిస్తూనే ఉంటాయి. రేపు మా పిల్లలు పెద్దవాళ్ళై అడిగితే చెప్పేందుకూడా మా దగ్గర సమాధానాల్లేవు. భార్యాభర్తలు కలిసిన వెంటనే నీళ్ళతో కడుక్కోవటం వలన ప్రెగ్నెన్సీ రాదని అంటున్నారు. నిజమేనా? చెప్పగలరు.**

**జ :** ప్రశ్నల్లో సిల్లీ ప్రశ్నలనేవి ఉండవు. ప్రశ్నల్లో అమాయకత్వం, అపోహ, అపనమ్మకాలు ఉన్నప్పుడు వాటిని పోగొట్టి ముఖ్యంగా యువతరానికి లైంగిక పరిజ్ఞానం కలిగించేందుకే ఈ శీర్షిక. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ కాలంలో ఇంట్లో చాలామంది ఉండేవారు కాబట్టి, ఎవరో ఒకరి ద్వారా పిల్లలకు అన్ని రహస్య సమాచారాలూ తెలిసోయేవి. కానీ, మనం పరిమిత కుటుంబ వ్యవస్థలోకీ, అక్కణ్ణించి అత్యంత పరిమిత కుటుంబ వ్యవస్థలోకీ మారిపోయినందువలన ఈ తరం పిల్లలకు సందేహాలు తీర్చేవారు లేక, ఆ సందేహాలు అలాగే లోపల్లోపల అణిగిపోయి, శల్యంలా బాధిస్తాయి. అన్ని సందేహాలూ కాకపోయినా, కొందరికి కొన్ని సందేహాలు తక్షణం తీర్చాల్సిన అవసరం ఉంది కూడా! నీళ్ళతో కడిగేస్తే ప్రెగ్నెన్సీ రాదనీ, సుఖవ్యాధులు రావనీ, అనుకోవటం అపోహ. నీళ్ళతో కడిగేది జననాంగం ఉపరితలాన్ని మాత్రమే! అప్పటికే వీర్యం "గర్భాశయ ప్రవేశం" జరిగిపోతే కడిగినా ప్రయోజనం ఉండదు. ప్రెగ్నెన్సీ రాకుండా చేసే చిటిక చిట్కాలేవీ లేవు. ఉన్నాయనుకుని ఆ సున్నితమైన

జనాంగం పైన లేనిపోని ప్రయోగాలు చేయకూడదు. ప్రెగ్నెన్సీ అనేది మనం వద్దనుకుంటే (by choice) ఆగుతుంది గానీ, రమ్మంటే వచ్చేది కాదు. అది రావటం అనేది by chance మాత్రమే! గర్భం కలగాలని గుళ్ళూ తీర్థాలు తిరిగేవాళ్ళకు రాకుండా పోవటం, రహస్యంగా గుట్టు చప్పుడు కాకుండా కలవాలనుకునే అక్రమ సంబంధీయులకు గర్భం వచ్చి కొంపలంటుకోవటం సహజమే!

# ఎంత వయసు వచ్చాక ప్రెగ్నెన్సీ వస్తుంది?

- కె.యల్.ఆర్ (నరసరావుపేట)

**ప్ర : ఆడవార్లైనా మగ వార్లైనా ఎంత వయసు వచ్చాక సెక్సులో పాల్గొంటే గర్భం వచ్చే ప్రమాదం ఉంటుంది.**

జ : ఎంత వయసు వచ్చాక సెక్సులో పాల్గొనవచ్చు అనే ప్రశ్నకు సమాధానం తెలిస్తే, సెక్సులో పాల్గొంటే చాలు, ఏ వయసు వారికైనా గర్భం రావచ్చునన్న విషయం అర్థం అవుతుంది. సెక్సు గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉండవచ్చు గానీ, పాల్గొంటే ఎలా ఉంటుందో చూడాలనే తహతహ కెరీరుని పాడు చేస్తుంది. బాబూ! ఈ రెండు ప్రశ్నలకన్నా ఉత్తమమైన మూడో ప్రశ్న ఉంది... ఏ వయసువచ్చాక పెళ్ళి చేసుకోవాలి...? అని! జీవితంలో స్థిరత్వం కుదిరే వరకూ సెక్సు యావకన్నా కెరీరు ధ్యాస వలన భవిష్యత్తులో సుఖసంసారం దక్కుతుంది. సెక్సు కూడా కెరీరులో ఒక భాగమే!

# సంతృప్తి పరిచే టెక్నిక్కు

- వైజెఆర్ (శ్రీకాకుళం)

**ప్ర : డాక్టరుగారూ! నమస్కారం. మనసులో మాట మీతో చెప్పుకోవాలనిపించి ఇలా అంటున్నాను. నా భార్యను నేను సంతృప్తి పరచలేకపోతున్నాను. ఎంత చేసినా దానికి సంతృప్తి లేదండీ, దానికి ఒకడు చాలడుండీ, అది ఆడది కాదు, కామపిశాచం అండీ... నాకు నివారణ చెప్పండి ప్లీజ్.**

జ : ఎంత చేసినా చాలడం లేదని మీరన్నప్పుడు మిమ్మల్ని ఠక్కున ఒక ప్రశ్న అడగాలి... ఎంత చేయాలో అంతే చేశారా...? అని! ఈ ప్రశ్నలకు సమాధానాన్ని మీరు మీకు చెప్పుకుంటే మీ సమస్యకు మీకే సమాధానం దొరుకుతుంది. స్త్రీ పురుషుల లైంగికత అనేది నూరు శాతం వ్యక్తిగతమైన విషయం. అది స్త్రీ పురుష జననాంగాల ఒడ్డూ పొడవుల మీద ఆధారపడి ఉండదు. అవన్నీ ఒప్పులకుప్పగానే ఉన్నా లైంగిక నిరాశని (sexual frustration) ఆపలేకపోవచ్చు.

"సెక్సులో నిజమైన సంతృప్తినిచ్చే అంశం ఏదీ అని పదిమందిని అడిగితే తలా ఒకటీ చెప్తారేగానీ అందరూ కలిసి ముక్తకంఠంతో ఒక్కటే చెప్పలేరు. వ్యక్తిగతమైన లైంగికతని వ్యక్తిగతంగా నిర్వచించాల్సిందే! ఎవరి వేలిముద్రలు వారికి ఎలా స్వంతమో లైంగికత కూడా ఎవరికి వారిది స్వంతం. ఒకరి సంతకం ఇంకొకరితో పోలి ఉండదన్నట్టే ఒకరి లైంగిక విధానం ఇంకొకరి విధానంతో సరిపోలదు. లైంగిక సమర్థతకీ, లైంగికంగా సంతృప్తి పరచటానికీ సంబంధం లేదు. ఒక స్త్రీగానీ, ఒక పురుషుడు గానీ తాము కోరుకున్న రీతిలో సెక్సు జరిగితేనే సంతృప్తి చెందుతారు. కాబట్టి ఎదుటి మనిషికి సంతృప్తి కలుగుతోందా లేదా అనే గమనింపు స్త్రీ పురుష లిద్దరికీ అవసరమే! ఏకపక్షంగా ఈ వ్యవహారం జరిగితే అది రెండో వ్యక్తిలో అసౌకర్యానికి, అసంతృప్తికీ, నిరాశకు, నిరాసక్తతకు దారి తీస్తుంది.

మీరూహించినట్టు మీ భార్య మనసులో మరో మనిషి ఉన్నాడేమోననేది కూడా అర్థం లేని ఆలోచనే! కొందరికి రతి కన్నా ఉపరతి మీద ఇష్టత ఎక్కువ ఉండవచ్చు. కొందరికి అది ఇష్టం ఉండకపోవచ్చు. "చేతుల్తో తడమటం తప్ప ఇంకేం లేదు" అని పెదవి విరిచే వాళ్ళూ ఉంటారు. "సెక్సులో సంతృప్తి పరిచే టెక్నిక్కులు" లాంటి పుస్తకాలు చదివి ప్రయత్నించటం కన్నా జీవిత భాగస్వామి మనసు తెలుసుకుని ప్రవర్తించాలని స్త్రీ పురుషులిద్దరూ గట్టిగా అనుకోవటం వలన నిజమైన సంతృప్తి ఇద్దరికీ సమానంగా కలుగుతుంది. ఉన్నతమైన జీవిత భాగస్వామిగా ఉండాలనే కోరిక నాకు కలగాలనే లక్ష్యం (desire to desire to be a great sex partner) బలంగా ఉండాలి. అదీ శాస్త్రీయమైన, ఆరోగ్యదాయకమైన, ఆనందదాయకమైన సెక్సు అనుభవాన్నిస్తుంది!

## జడ మనసు

- పి.వి. ప్రసాద్ (జగిత్యాల)

**ప్ర : సెక్స్ పట్ల విముఖత ఎందుకొస్తుంది? నివారణ వున్నదా?**

ఇటీవలికాలంలో అసెక్సువల్, అరొమాంటిక్, అలైంగిక, అకామ, అకామచారి, అనిచ్ఛ, అకామాతరుత, అమైథున, అసంభోగ, అసంగమ... ఇంకా ఇలాంటి సెక్సు వ్యతిరేక 'అ' కార పదాలకు ప్రాముఖ్యత పెరగటం ఒక ప్రమాద ఘంటిక. మరీ ముఖ్యంగా కొత్త దంపతుల్లో పెళ్లయిన బ్రహ్మచారుల సంఖ్య పెరుగుతోంది. దంపతుల్లో అలైంగికులు (asexuals) ఏర్పడటం, ఉత్తుత్తి కాపురాలు ఆలుమగలమధ్య బలమైన సాంసారిక బంధాలు లేకపోవటం ఇవి ప్రమాదకర ధోరణులే!

ఉన్నతోద్యోగిని అయిన తన భార్య అన్ని విధాలా తనతో అణకువగా ఉంటుందనీ, కానీ, సెక్సుకి మాత్రం ఒప్పుకోవటం లేదనీ, పెళ్ళయి నాలుగేళ్ళయినా 'ఆ ఒక్కటీ' ఒక్కసారి కూడా జరగలేదనీ ఒక భర్త చెప్పుకున్నప్పుడు ఇది వ్యక్తిగతమా, లేక సామాజికమా అనే ప్రశ్న ఉదయిస్తుంది! తన భర్త ఉపరతి విషయంలో బాగానే సహకరిస్తాడు గానీ, సెక్సు విషయాని కొచ్చేసరికి విముఖంగా ఉంటాడని ఒక ఇల్లాలు చెప్పుకుంది.

సంస్కృత సామెత "ఉపస్థ విన కన్యాదానం" అనేది నా విషయంలో నిజం అయ్యిందండీ. ఆమెతో గొడవ పడటమో, బలవంత చేయటమో నాకు ఇష్టం లేదు. ఆమె బుర్రనిండా గొప్ప ఆలోచనలున్నాయి. కానీ, వాటిలో సెక్కు ఒక్కటే లేదు" అనే భర్తలు చాలామంది ఉన్నారు.

"నాకసలు ఆ కోరికే కలగటం లేదు. ఇంట్లో వాళ్ళు పెళ్ళి చేస్తామంటున్నారు నాకేమో భయంగా ఉన్న" దంటున్న కుర్రాళ్ళు, అమ్మాయిలు కూడా ఎక్కువ సంఖ్యలోనే కనిపిస్తున్నారు.

లోకం పోకడలో ఇవి మచ్చుకు కొన్ని! పెళ్ళయిన బ్రహ్మచర్యం (asexuality) యావజ్జీవిత అస్ఖలిత బ్రహ్మచర్యం (lifelong celibacy) రెండూ ఒకటి కావు. బ్రహ్మచర్యం అనేది అన్ని దైహిక వాంఛలకూ సంబంధించింది కాగా, అలైంగికత' కేవలం సెక్సుకి మాత్రమే సంబంధించిన విషయం. ఈ సృష్టి ఈ తరంతోనే ఆగిపోవాలని ప్రకృతి కోరుకోదు. పునరపి జననం, పునరపి మరణం నిరంతరం జరగాలి.

స్త్రీ పురుషుల మధ్య కామప్రవృత్తి సహజంగా కలగవలసిన సమయంలో కలగకపోవటాన్ని Asexuality - అలైంగికత అంటారు. అది ఒక దీర్ఘకాలిక సమస్య అయినప్పుడు దాని గురించి తప్పక చర్చించవలసి ఉంటుంది. ఊహల్లోనూ, కలల్లోనూ, మాటల్లోనూ లైంగికత కనబరచే వ్యక్తులు కూడా సెక్సు కొచ్చే సరికి విముఖులు అవుతున్నారు. ఎందుకిలా జరుగుతోంది?

కొందరు అటు పూర్తి 'లైంగికత'కూ, ఇటు పూర్తి అలైంగికతకూ మధ్య ఆగిపోతారు. వీళ్ళలో కామప్రవృత్తి ఉంటుంది గానీ సమాగమాని కొచ్చే సరికి ఛీ... యాక్ అన్నట్టు వ్యవహరిస్తారు ఇంకొందరికి బాగా ప్రయత్నించి కామోద్రేకాన్ని రెచ్చగొడితే ఎప్పటికో స్పందించే అవకాశం ఉంటుంది. వీళ్ళని 'సెమీ సెక్సువల్' అంటారు.

మనసు నిండా జడత్వం ఆవరించిన ఒక దురదృష్టకర సన్నివేశం ఇది. ఈ జడమనస్కుల సంఖ్య నానాటికీ పెరుగుతోందని 2001 నుండి వైద్య ప్రపంచం

హెచ్చరిస్తూనే ఉంది. స్త్రీలు, పురుషులు, 'గే'లు వీళ్ళే కాకుండా జడ మనస్కుల్ని నాలుగో సామాజిక వర్గంగా గుర్తించాలనే డిమాండ్ మొదటగా లండన్లో బయల్దేరింది. మొత్తం బ్రిటిష్ జనాభాలో వీళ్ళు 1% ఉన్నారట. అలైంగికుల వెబ్‌సైట్లో 50,000 మంది సభ్యులున్నారు. మూడేళ్ళక్రితం వీళ్ళు మహాసభలు కూడా జరుపుకున్నారని 2012 ఆగష్టు 20 టైమ్స్ ఆఫ్ ఇండియా కథనం!

తమ పైన లైంగిక ఆకర్షణ (lustful attractions) ప్రభావం ఏమాత్రం లేని వాళ్ళని అలైంగికులని నిర్వచించవచ్చు. కొంతమంది సెక్సు పేరు చెపితేనే కడుపులో దేవినట్టయి వాంతి చేసుకున్నంత పని చేస్తారు. సెక్సంటే ఏమిటో తమకు తెలీనట్టు, అది అతి సామాన్యులు చేసుకునే అసభ్య క్రీడ అయినట్టూ వ్యవహరిస్తారు. వాళ్లని కరోడాలనీ, మల్లెపూవు ఇస్తే ఏం చేసుకోవాలో తెలీని జడపదార్థాలనీ అంటుంటాం మనం. పూర్వం ఎక్కడో ఒకరు అలాంటి వాళ్ళు బాల వితంతువుల్లోనూ, పెళ్ళికాని వాళ్లలోనూ కనిపించేవాళ్ళు. ఇప్పుడు అలాంటి జడమనస్కుల సంఖ్య పెరిగింది.

మన తెలుగు సమాజంలో పరిస్థితినే చూడండి... కోట్లు ఖర్చు చేసి పెళ్ళిళ్ళు చేస్తున్నారు. ఏడాది తిరక్క మునుపే 30-40% వివాహాలు కోర్టు తలుపులు తడ్తున్నాయి. విడాకులకు వెళ్ళిన వాళ్లను పలకరిస్తే, ఎక్కువమంది ఎదుటి వ్యక్తిలో "అలైంగికత" ఉందని ఆరోపించి విడాకులు అడుగుతున్నట్టు తేలింది. సెక్సు వైఫల్యం చుట్టూ మిగతా చిన్న విషయాలన్నీ చేరి అన్నీ కలిసి చివరికి తెగతెంపులు దాకా తీసుకుపోతున్నాయి.

# వద్దనిపిస్తే?

**- కె.ఎస్.వి.ఆర్ (హన్మకొండ)**

**ప్ర : నాకు డెబ్బయి రెండేళ్ళొచ్చాయి. సెక్సంటే అయిష్టత ఏర్పడి, రాను రానూ పెరుగుతోంది. నా భార్య సహకారం ఉన్నప్పటికీ, నాకే ఇష్టత కలగటం లేదు. దాన్ని సరిచేసుకోవాలని మిమ్మల్ని మందులు అడగటం లేదు. నా సందేహం ఒక్కటే... దంపతుల్లో ఒకరు కావాలని ఒకరు వద్దనీ అనుకునేప్పుడు ఎవరు మారాలి? దయచేసి వివరించండి.**

జ : కోరేవారు కోర్తున్నంత కాలమూ వద్దనుకునే వారు ఆ వద్దనుకోవటాన్ని మానేయాలి! కోరేవారికి అనుకూలంగా మీరే మారాలి! అది పెళ్ళినాటి మీ ప్రమాణం. ఏ నిర్ణయమైనా ఇద్దరూ కలిసి తీసుకోవాలి గదా! మీ అయిష్టతను వివరించి చెప్పి ఆమెను కూడా అంగీకరింప చేసుకోవాలని మీకు గుర్తు చేయాలంటారా?

# నపుంసకత పోయేదేనా?

- డి.పి.ఆర్ (నందిగామ)

**ప్ర : నాకు 42 యేళ్ళు. ఐదేళ్ళుగా షుగరు ఉంది. సెక్సు ధ్యాస తగ్గిపోతోంది. అంగస్తంభన రావటం లేదు. నపుంసకత వచ్చినట్టేనా? అది పోదా?**

జ : మనో వికారాలు కలిగి ఉండటాన్ని నపుంసకత అంటారు. అంతేగానీ, సెక్సు ధ్యాస తగ్గటం నపుంసకత కాదు. మానసిక, శారీరక, సాంసారిక, సామాజిక స్థితిగతుల ప్రభావం వలన సెక్సు ధ్యాస తగ్గొచ్చు. అది తాత్కాలికమే! ఆయా కారణాల విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకుంటే సాధారణ స్థితి వచ్చేస్తుంది.

మెదడు నుండి జననాంగానికి వచ్చే సిగ్నల్ మీద లైంగికోత్తేజం కలగటం ఆధారపడి ఉంటుంది. షుగరు వ్యాధిలో ఈ సిగ్నలింగ్ వ్యవస్థ దెబ్బతిని సెక్సు ధ్యాస తగ్గుతుంది. ఈ వ్యాధిలో తమ సాధారణ వయసు కన్నా కనీసం పదేళ్ళు ఎక్కువ వయసులో కనబడతారు. ఇలా ముసలితనం ముంచుకు వచ్చే వ్యాధులు ఇంకా మరికొన్ని ఉన్నాయి. జనరల్ చెక్‘అప్ చేయించుకోవటం మంచిది. ముఖ్యంగా థైరాయిడ్ పరీక్ష అవసరం.

బీపీని అదుపులో ఉంచుకోవాలి. రక్తంలో చెడుకొవ్వు పెరిగే కొద్దీ అది రక్తంలో చేరి, రక్తనాళాలను మూసేసి, రక్త సరఫరాని మందగింప చేస్తుంది. దాని ప్రభావం నేరుగా పురుషావయవం మీద పడుతుంది. వేపుడు కూరలు, నూనె పదార్థాలు, కొవ్వు కలిసిన పీజ్జాలు, బర్గర్లను తిని, స్త్రీ పురుషులు లైంగిక అసమర్థత కొని తెచ్చుకోకూడదు.

రక్తసరఫరాను, రక్తనాళాలను దెబ్బ తీసే పొగాకు ఉత్పత్తుల వినియోగాన్ని పూర్తిగా ఆపేయాలి. సిగరెట్లు, చుట్టలు, గుట్కాలు, పాన్ మసాలాలు, మగతనాన్ని దెబ్బతీస్తాయి. ఆల్కాహాల్, నాటుసారా కూడా అలానే చేస్తాయి.

అర్థరాత్రి దాకా టీవీలకు అంటుకొని పోవటం, తెల్లారి పొద్దెక్కే దాకా లేవకపోవటం, మధ్యాన్నం అన్నం తింటూనే నిద్ర కుపక్రమించటం, అన్నానికి బదులుగా డైటింగ్ పేరుతో పిండి పదార్థాలు ఎక్కువగా ఉండే అట్లు, పూరీలు, ఉప్మాలు తినటం, విపరీతంగా నూనె, మషాలాలు పోసిన కర్రీలను ఇష్టా రాజ్యంగా తినటం ఇవన్నీ పురుషత్వాన్ని దెబ్బతీసి, ముసలితనాన్ని తెచ్చిపెడతాయి.

మనసు ప్రశాంతంగా ఉంచుకోవటం, శరీరానికి తగినంత శ్రమ, తేలికగా అరిగే భోజనం, తగినంత నిద్ర ఈ నాలుగూ స్త్రీ పురుషుల్లో సుఖాన్ని, సంతృప్తినీ, మగటిమినీ, స్త్రీత్వాన్నీ పెంచుతాయి.

# సెక్సు బలహీనతను తెచ్చే రోగాలు

ప్ర : సెక్సు బలహీనతను తెచ్చే వ్యాధులున్నాయా? ఏ ఏ వ్యాధుల్లో అలా జరగవచ్చు?

లైంగిక పరమైన ఇబ్బందుల్ని చాలామంది నరాల బలహీనతగా భావిస్తారు. శరీర శక్తికి, మానసిక శక్తికీ సంబంధం లేని శారీరక బాధల్ని రోగులు నరాల బలహీనతగా డాక్టర్లదగ్గర చెప్పుకుంటారు. ఆ ఒక్క మాటకి వైద్యులు చాలా విషయాలు అర్థం చేసుకుని చికిత్స చేయాల్సి ఉంటుంది. ముఖ్యంగా లైంగిక విషయాలను సూటిగా చెప్పుకునేందుకు తగిన భాష మనకు లేదు. ఇంగ్లీషులోనూ ఈ సమస్య ఉన్నప్పటికీ కొన్ని పదాలను స్వేచ్ఛగా వాళ్ళు వాడినట్టు మన వాళ్ళు వాడలేరు. వైద్యుడికి ఎలా చెప్పాలో తెలియక వ్యాధిని లోపలే దాచుకునే వాళ్ళే ఎక్కువమంది.

ఇంగ్లీషులో న్యూరోలాజికల్'వ్యాధి అంటే నాడులు (nerves) దెబ్బతిన్నందుకు వచ్చే వ్యాధి అని స్పష్టమైన అర్థం కనిపిస్తుంది. మెదడు సంకేతాలు శరీరానికీ అలాగే, శరీరం చెప్పే విషయాలు మెదడుకీ చేర్చే సమాచార వ్యవస్థ దెబ్బతినటాన్ని న్యూరోలాజికల్ వ్యాధిగా చెప్తారు. పక్షవాతం, పార్కిన్'సోనిజం, వెన్నుపాములోపల నరాలు నలిగి వచ్చే వ్యాధులు, మెదడుకు బలమైన దెబ్బతగలటం వలన వచ్చే వ్యాధులూ ఇవన్నీ నరాల వ్యాధులే. ఈ వ్యాధుల్ని వ్యాధులుగానే చూస్తాం గానీ, అవి లైంగిక జీవితాన్ని ఏ విధంగా ప్రభావితం చేస్తాయో గమనించటానికి మనకు సభ్యతా పరమైన సమస్యలు అడ్డం వస్తాయి. సెక్సు అనేది ఉచ్చరించటానికి వీల్లేని పదంగా ఇంకా భావించబడుతోనే ఉంది. శరీరంలో ఏ విధమైన అనారోగ్యం కలిగినా దాని ప్రభావం అంతో ఇంతో సెక్సు మీద ఉంటుంది. ఆఖరికి అజీర్తి చేసినా లైంగిక సమర్థత తగ్గిపోతుంది. అలాంటప్పుడు సెక్సుని కేవలం జననాంగపరమైన సౌఖ్యం అనే అర్థంలోనే చూడాలనుకోవటం సబబు కాదు.

శరీరం సహకరించని వ్యాధులతో బాధపడే వాళ్ళకోసం విదేశాల్లో వైబ్రేటర్లవంటి సౌకర్యాల వాడకం ఎక్కువగా ఉంటుంది. మన సమాజంలో ఇంకా అటువంటి వాడకాలకు అలవాటు పడలేదు. చాలా వ్యాధులు మానసకిక కారణాల వలన పెరుగుతున్నాయి. చాలా వ్యాధులకు మానసిక కారణాలే అసలు ప్రేరకాలుగా కనిపిస్తున్నాయి. వాటిలో లైంగికపరమైన అంశాలు ముఖ్యమైనవి కూడా అయినా మనం వ్యాధులకూ, సెక్సు పరమైన అసంతృప్తికీ గల సంబంధాన్ని పట్టించుకోవటం లేదు. రోగానికి మందులిచ్చే విధానమే గానీ, రోగకారణాన్ని వెదికే తీరిక వైద్యుడుకుగానీ ఆ ఆసక్తి రోగులగ్గానీ లేకుండా పోవటం కూడా ఇందుకు ముఖ్య కారణాలే!

లైంగిక ఆసక్తి తగ్గిపోవటం, అంగ స్తంభనాదులు బలహీనంగా ఉండటం, రతి సమయం మరీ కుదించుకుపోవటం, సంతృప్తి కలగకపోవటం అనేవి కొన్ని శరీర వ్యాధుల్లో జరిగే అవకాశం ఉన్నవి కాగా, ఇలాంటి అంశాలు అనేక శరీర వ్యాధులు పెరగటానికి కారణం అవుతుంటాయి కూడా!

Viagra (sildenafil), Cialis (tadalafil), Levitra (vardenafil), లాంటి ఔషధాలు అంగస్తంభనాన్ని త్వరగా జరిగేలాగా ఎక్కువ సేపు నిలబడి ఉండేలాగా సహకరించేందుకు ప్రపంచ వ్యాప్తంగా వాడిస్తున్న ఔషధాలు కానీ, అవి వాడిన సమయానికి మాత్రమే ఉపయోగపడేవి గానీ, లైంగిక సమతుల్యతని కలిగించేవి, సంతృప్తినీ, సమర్థతనీ పెంపొందించేవీ కావు.

రాజూ పేద సినిమాలో జేబులో బొమ్మ పాట గుర్తుందికదా! జేబులో బొమ్మ ఉన్నంత సేపూ వాడు చెలరేగిపోయే వీరుడు. ఆ బొమ్మ లేకపోతే ఎందుకూ కొరగాడు. ఇలాంటి ఔషధ సేవన కూడా జేబులో బొమ్మ లాంటివే! మర్నాడు ఈ బొమ్మ లేకపోతే కథ వెనక్కే నడుస్తుంది. కాబట్టి, లైంగిక అసమర్థత అనేది పైకి చెప్పుకోలేని ఒక ప్రధాన సమస్యగా మారిపోయింది. చికిత్స కూడా అరచేతిలో వైకుంఠం చూపించగలిగే సెక్సు స్పెషలిస్టులకు సొమ్ము సంతృప్తినిచ్చేవే గాని, లైంగిక సంతృప్తిని తెచ్చి ఇచ్చేవి తక్కువ!

పార్కిన్సన్ వ్యాధిలో లైంగిక అసమర్థత ఎక్కువగా ఉంటుంది. ఆయుర్వేద మార్గాన ఈ వ్యాధికి ఇచ్చే ఔషధాలు ముఖ్యంగా దూలదొండి (దురదగొండి) విత్తులు లైంగిక సమర్థతని పెంచే వాటిలో ముఖ్యమైనవిగా గుర్తించబడ్డాయి. నాడీ వ్యవస్థను బలసంపన్నం చేయటానికి ఆయుర్వేదీయ పద్ధతిలో ఉపయోగించే వనమూలికలన్నీ లైంగిక శక్తిని పెంచేవిగానే ఉండటాన్ని గమనించవచ్చు.

అందుకే రోగి నరాల నిస్సత్తువ వచ్చిందంటున్నాడంటే కాళ్ళూ చేతులూ చచ్చుబడిపోయాయని మాత్రమే అనుకోకూడదు. లైంగిక వ్యవస్థ చచ్చుబడిపోయిందని చెప్పటం ఆ రోగి ఉద్దేశం కావచ్చు. అది వైద్యులు అర్థం చేసుకోవాల్సిన విషయం.

సెక్సనేది భార్యాభర్తలిద్దరికీ సంబంధించిన విషయం కాబట్టి ఒకరికొకరు సహకరించుకునే విధానాన్ని ఉపదేశించి, లైంగిక తృప్తిని పెంపొందించుకునేలాగా ప్రోత్సహిస్తే, చాలా వ్యాధుల్లో చికిత్స త్వరగా ఫలించే అవకాశం ఉంటుంది.

లోలంబ రాజీయం అనే వైద్యగ్రంథంలో "విరహజ్వరంతో బాధపడేవాడికి మందులు వెదుకుతావెందుకు వైద్యుడా...? కోరిన స్త్రీతో ధృఢమైన ఆలింగనం, అధరచుంబనాలను పథ్యంగా చెప్పు" అంటాడు. ఇది చాలా సందర్భాల్లో, విరహ జ్వరాలకేకాదు. ఇంకా చాలా వ్యాధులకు వర్తించే విషయం.

మానసిక కారణాలవలన వచ్చే మైగ్రెన్ తలనొప్పి, సొరియాసిస్, అకారణ నడుం నొప్పి లాంటి వ్యాధుల్లో లైంగిక అసంతృప్తిని ప్రధాన సమస్యగా చాలా మందిలో గుర్తించటం జరిగింది. ఈ అసంతృప్తి స్థానంలో సంతృప్తిని చేర్పించటమే అసలు మందు. ఈ మందుని రోగి స్వయంగా కల్పించుకోవాల్సి ఉంటుంది. మరింత యుక్తిమంతంగా లైంగిక విషయాల్లో వ్యవహరించాలని రోగికి తప్పకుండా చెప్పాలి.

లైంగిక కార్యాన్ని సృష్టి కార్యం అనేది ఇందుకే! పిల్లల్ని సృష్టించే కార్యం అనే అర్థానికి పరిమితం చేసే మాట కాదిది. ప్రాపంచిక జీవనంతో పాటుగా వ్యక్తి వ్యక్తిగత జీవితం కూడా ఈ సృష్టికార్యం చుట్టునే తిరుగుతుంది. వ్యక్తి చుట్టూ ఉన్న ప్రపంచం, వ్యక్తి లోపల ఆవరించి ఉన్న ప్రపంచాలు రెండింటి మధ్య సమన్వయం, సమతుల్యతలు దెబ్బతింటే వ్యక్తి శారీరక బాధలు తెచ్చుకుంటాడు. లైంగిక అసంతృప్తులు ఈబాధల్ని మరింత పెంచుతాయి.

షుగర్, బీ.పీ, గుండె జబ్బుల్లో లైంగిక సమర్థత మునుపటి లాగా వుండదు. కొన్ని వ్యాధుల్లో వాడే మందులు కూడా ఇందుకు కారణం కావచ్చు.

# లైంగికావయవాల బిగువు

- కె.వి.ఆర్ (నరసాపురం)

**ప్ర : నా జననాంగం బిగువు తగ్గుతోంది...**

ప్రసవంలో నొప్పులకు భయపడి సిజేరియన్ ఆపరేషన్ చేసేయమని ఎక్కువమంది మహిళలు కోర్తున్నారు. ఆపరేషన్'కి భయపడ్డవాళ్ళు కూడా కొంతసేపు నొప్పులుపడ్డాక ఇంక తట్టుకోలేక అప్పుడు ఆపరేషను చేయమని అడిగే సందర్భాలు కూడా ఉంటున్నాయి. ఇంకొంతకాలానికి సహజ ప్రసవాలు అనేవి ఉండకపోవచ్చు కూడా! ఎందుకంటే, పట్టణీకరణం చెందుతున్న మన సామాజిక వ్యవస్థలో ఆడపిల్లలు శారీరక శ్రమకు దూరం కావటం వలన పొత్తికడుపు కండరాలకు తగినంత సాగే శక్తి లేక, సహజ ప్రసవాలకు సహకరించలేకపోతున్నారు. సహజ ప్రసవాల వలన స్త్రీ జననాంగం సాగిపోయి, రతికి అనుకూలంగా ఉండదనే అపోహ చాలామందిలో ఉంది. ప్రసవం అయ్యాక గర్భాశయంతో పాటుగా సాగిన కండరాలన్నీ కుంచించుకుని సాధారణ స్థితికి వచ్చేస్తాయి. అనేక ప్రసవాలు జరిగిన స్త్రీలలో కూడా యోని బిగువు తగ్గని వారున్నారు. కొందరిలో యోని వదులైతే (persistent looseness of vagina) ఇది శస్త్ర చికిత్సా సాధ్య వ్యాధే! Vaginoplasty మరియూ Lanbiaplasty శస్త్ర చికిత్సల ద్వారా యోని బిగివును తిరిగి తీసుకు రాగలుగుతారు. నిజానికి,

ఇప్పుడున్న పరిమిత కుటుంబ వ్యవస్థలో సహజ ప్రసవాల (normal delivery) వలన ఇది ఏర్పడే అవకాశాలు తక్కువ.

ప్రసవాలకు, బిడ్డల పోషణకు సంబంధించి చాలా అపోహలు వ్యాప్తిలో ఉన్నాయి. బిడ్డకు తన పాలిస్తే వక్షోజాలు సన్నబడి వ్రేలాడతాయనేది ఇలాంటి అపోహే! అధిక సంతానవతుల్లో అరవై ఏళ్ళొచ్చినా రొమ్ము బిగువు తగ్గని వాళ్ళున్నారు. బిడ్డకు తన పాలివ్వటానికీ, రొమ్ములు వదులవటానికీ సంబంధం లేదు. తన పాలు త్రాగించకుండా కావాలని డబ్బా పాలు పెట్టే తల్లుల వలన స్తనాలు సంపన్నవంతంగా ఉంటాయనే గ్యారంటీ లేదు.

ఎంత ఎక్కువ రతిలో పాల్గొంటే స్త్రీ జననాంగం అంత ఎక్కువ సాగిపోతుందనే అపోహ కూడా ఇలాంటిదే! రతి ఉద్వేగం వలన జననాంగ కండరాలు సాగి, ఆ పని పూర్తి కాగానే తిరిగి సాధారణ స్థితికి చేరతాయి. రతి వలన కండరాలు సాగి ఉంటాయని, పురుషాంగం ప్రవేశం ఫ్రీగా జరిగిందంటే ఆమె కన్నెపిల్ల కాదేమోననే వింత అనుమానం కొందరు మగాళ్ళ కుంటుంది. ఈ ప్రపంచంలో అన్ని హక్కుల్నీ రద్దు చేసినా అనుమానించే హక్కుని రద్దు చేయలేదు కదా! ఆందోళన, విచారం, భయాల వలన జననాంగ కండరాలు విప్పారకుండా బిగుసుకుపోతాయి. మనసు ఉల్లాసభరితంగా, ఉత్తేజదాయకంగా ఉంటే శరీరం కూడా మనసుతో పాటే విప్పారుతుంది. ఇది మగాళ్లలోనూ జరుగుతుంది. "బుగ్గల్ని చెవులదాకా సాగదీసి వదలండి... మళ్ళీ మామూలు స్థితికి వస్తున్నాయా... లేక 'సాగి'ల పడి ఉండి పోతున్నాయా? ఇలా 100 సార్లు చేసినా మార్పేమీ ఉండదు. జననాంగం కూడా అంతే!

జననాంగస్రావాలు ఎక్కువగా ఉన్నప్పుడు యోని వదులుగా అనిపించవచ్చు. కానీ, భావప్రాప్తిలో తేడా ఉండదు. ఎక్కువ బిగువుగా ఉంటే, ఉపరతి (foreplay) ద్వారా, ఉద్వేగ స్థితిని ఆ స్త్రీ పొందినప్పుడు యోని కండరాలు వదులౌతాయి. ఒక్కోసారి పొజిషన్లు మార్చుకోవాల్సి రావచ్చు. ఇవన్నీ అప్పటికప్పుడు పరిస్థితిని బట్టి చాకచక్యంగా సరి చేసుకోవాల్సిన విషయాలు.

జననాంగం వదులుగా ఉండటం, సుఖప్రాప్తి తగ్గిపోవటం గురించి ఆందోళన అవసరం లేదు. సైకిల్ తొక్కటం, తాడాట ఆడటం (స్కిప్పింగ్), ప్రాణాయామం, యోగా సక్రమంగా చేస్తే, కటిభాగం, పొత్తికడుపు, తొడలకు సంబంధించిన కండరాలకు రక్తప్రసారం బాగా జరిగి కండరాలు బలంగా అవుతాయి. యోని బిగుసుకుంటుంది. కాలేదంటే అప్పుడే సర్జరీకి వెళ్ళవచ్చు! వయసుని బట్టి సహజంగా కొందరు స్త్రీలకు ఈ పరిస్థితి రావచ్చు. వారికి సర్జరీయే చక్కని మార్గాంతరం.

# పాజిటివ్ సెక్స్

**ప్ర : ఇటీవలి కాలంలో పాజిటివ్ సెక్సు అనే మాట ఎక్కువ వినబడుతుంది. దాని గురించి వివరించగలరు.**

సెక్సు పరమైన ఆరోగ్యము, శరీరపరమైన ఆరోగ్యమూ రెండూ ఒకదాని వలన ఒకటి బలసంపన్నమౌతుంటాయి. ఒకటి బాగుంటే రెండోదీ బాగుంటుంది! కేవలం బాగుండటానికే (pleasure only) అయితే సెక్సుకి ఇంత ప్రాధాన్యత అక్కరలేదు. కోరుకున్న ఒక వస్తువుని పొందినందువలన కలిగే ఆనందానికీ, కోరుకున్న ఒక స్త్రీ లేదా పురుషుణ్ణి పొందినందువలన కలిగే ఆనందానికీ మధ్య తేడా ఎంత ఉందో... నిగ్రహించుకోవటం, సుఖానుభవం పొందటాలవలన కలిగే ఆనందాల మధ్య కూడా అంత తేడా ఉంది.

అన్ని ఇతర శరీరావయవాలనూ స్వేచ్ఛగా ఉపయోగించగలిగిన మనిషి లైంగికవయవాల విషయంలో ఆ స్వేచ్ఛ ఎందుకు పొందలేకపోతున్నాడు? స్వేచ్ఛానందానికీ, నిగ్రహానందానికీ తేడా ఏమిటీ? ఇవి సామాజిక కోణం లోంచి చూడాల్సిన అంశాలు. కన్యాశుల్కం నాటకంలో చెప్పినట్లు బతికున్నంతకాలం యాంటీనాచ్, చచ్చాక రంభాదులతో ప్రోనాచ్చిగా ఉండే నిగ్రహం వలన ఒరిగిందీ, ఒరిగేదీ పెద్దగా ఉండకపోవచ్చు.

స్త్రీల విషయంలో బలవంతపు బ్రహ్మచర్యం, బలవంతపు నిగ్రహం ఇంకా మన సామాజిక వ్యవస్థలో కొనసాగుతూనే ఉన్నాయి. యాసిడ్ ప్రేమికుడు కూడా తను కోరుకున్న ఆడది ఇతరుల విషయంలో నిగ్రహ సంపన్నురాలిగా ఉండాలనే వాదిస్తాడు. ఇది మానవ సృష్టిలోనే సహజంగా ఉన్న విషపూరిత మగగుణం. ఇలాంటి వివక్షత లేని లైంగిక వ్యవస్థ కావాలని కోరటమే పాజిటివ్ సెక్సు! "it should be the relevant measure of a sexual act or practice where there is content pleasure and well-being by those affected and involved by the sexual activity" (Charlie Glickman)... అనేది పాజిటివ్ సెక్సు లేదా సెక్సు పాజిటివ్‌కు ఆధునిక నిపుణులిస్తున్న నిర్వచనం. స్త్రీ పురుషులిద్దరూ పరస్పర అంగీకారంతో, సుఖప్రదంగానూ, ఆరోగ్యదాయకంగానూ పొందే లైంగికతని 'పాజిటివ్ సెక్సు' అంటారు. మహిళా వాదానికి మూలం ఇదే! ఇది పురుష వ్యతిరేకత కాదు, పురుషాధిక్య వ్యతిరేకత! ఉద్యమ కారణంగా పురుష వ్యతిరేక పదజాలం కొంత కనిపించినప్పటికీ 'పాజిటివ్ సెక్సు' అనేది 'మేల్ నెగెటివ్' కాదు.

పాజిటివ్ సెక్సు అనేమాట సెక్సుని పొందటానికి మాత్రమే కాదు. సెక్సుని నిగ్రహించుకోవటానికీ వర్తిస్తుంది. సెక్సుని పొందటంలో ఆనందంతోపాటు ప్రమాదాలు, ప్రాణాపాయాలు అనేకం పొంచి ఉన్నట్టే, నిగ్రహం పాటించటంలో కూడా ఉన్నాయి. సాధారణంగా నిగ్రహించబడిన ఒక కోరిక మానసిక శక్తిగా సబ్'లిమేట్ అవుతుందంటాడు ఫ్రాయిడ్, కానీ, వివక్ష కారణంగా బలవంతపు నిగ్రహానికి గురికావటం వలన నిగ్రహించబడిన ఆ కోరిక సబ్లిమేట్ కాకుండా మనోవ్యాధిగా మారుతుంది. హిష్టీరియా లాంటి మానసిక వ్యాధులకు కారణం ఈ అతి నిగ్రహమే ! యోగశ్చిత్తవృత్తి నిరోధకః అన్నారు. బ్రహ్మచర్యం అనేది మనోబల సంపన్నతతో జరిగితే 'యోగ' దాయకం! లేకపోతే 'అయోగ్యం' అయి మానసిక బలహీనతకు కారణమౌతుంది.

పాజిటివ్ సెక్సే సమాజానికి మేలు చేస్తుంది. 'కేవల నిగ్రహం' వలన ఒరిగేదేమీ ఉండదు. సెక్సుని స్వచ్ఛమైన లౌకిక వ్యవస్థగా భావించి మనుషులందరూ సెక్సు హీనులుగా మారాలని ఏ వేదాంతీ కోరడు కూడా! సెక్సు ప్రయోజనం మనోబల సంపన్నమైన వ్యవస్థని నిర్మించుకోవటమే అనే భావన అందరిలో కలిగినప్పుడు సంసారవేదం ఫలప్రదం అవుతుంది.

# రతి విజయానికి సూత్రాలు

- కె.కె.డి.వి.ప్రసాద్ (నగరం)

**ప్ర : సెక్సులో సక్సెస్ కావటానికి ఏమైనా సూచనలు చెప్తారా సార్?**

పరీక్షల్లో ర్యాంకులు పొందటానికి ఏకాగ్రత (సి=కాన్'సన్'ట్రేషన్), ఇష్టత (ఐ=ఇంట్రెస్ట్), దీక్ష, పట్టుదల (డి=డెడికేషన్) ఇవి ఎంత అవసరమో, సెక్సు విషయంలో ర్యాంకు పొందటానిక్కూడా ఇవన్నీ అవసరమే! గది నాలుగ్గోడల మధ్య గుట్టు'చప్పుడు' కాకుండా జరిగే వ్యవహారమే అయినా, అందులో అసలైన స్వారస్యం అనుభవించటానికి ఆస్కారం ఏర్పడుతుంది. అయ్యిందనిపించే తీరులో భార్యభర్తలు తమ డ్యూటీ అయిపోయిందనుకోవటం వలన మొక్కుబడి రతి మాత్రమే జరిగినట్టు లెక్క!

లైంగిక సుఖాన్ని పొందాలనే కోరిక ఎంత బలంగా ఉంటే లైంగిక కార్యం అంత బలంగా జరుగుతుంది. కాన్'సన్'ట్రేషన్, ఇంట్రెస్ట్, డెడికేషన్, ఈ 'సి ఐ డీ'లు సెక్సులో డిస్టింక్షన్ పొందటానికి తోడ్పడతాయి. నిజానికి, సెక్సులో విజయం అనేది ఒక పరీక్షే! ఇందులో ఉత్తీర్ణత పొందితే, అన్నింటా జయమే! ఆందోళన లేకుండా అనుకూల భావావేశంతో (పోజిటివ్ యాటిట్యూడ్) మనసు నిండి ఉంటే, సుఖసంసారం, సంసార సుఖమూ సుసాధ్యం అవుతాయి. రతికి ముందే బలంగా కోరిక పెంచుకుని సిద్ధంగా ఉండాలి. విరహం ఎంత బలంగా ఉంటే రతి అంత ఆసక్తిదాయకంగా

ఉంటుంది. ధ్యాసని సెక్సుమించి ఇతర విషయాల మీదకు మళ్ళకుండా ఏకాగ్రత నిలుపుకోవాలి. తీర్చాల్సిన బాకీ గురించో రావలసిన బాకీ గురించో ఆ సమయంలో ఆలోచిస్తుంటే 'రతి' 'అరతి'గా మిగిలిపోతుంది.

రతి విజయానికి మొదట ఉత్సాహం ఉండాలి. అందుకోసం కొంత దీక్ష, పట్టుదల కూడా కావాలి. చింతా శోక భయదుఃఖాదులన్నీ లైంగిక శక్తిని చంపుతాయి. ఆత్మవిశ్వాసం కోల్పోతే, లైంగిక శక్తీ, ఆసక్తి అంతరిస్తాయి. ఆత్మవిశ్వాసంతో రతిక్రీడకు తలపడితే అనేక రెట్లు సుఖానుభవాన్ని పంచుకోగలుగుతారు. దైనందిన వ్యవస్థలో స్ట్రెస్సు వలన సుఖజీవనం నాశనం అవుతోంది. క్రమేణా అది దాంపత్యాన్ని చీల్చే దాకా దారి తీస్తోంది. ఇలాంటి పరిస్థితిని నివారించుకోవాల్సిన అవసరాన్ని గుర్తించాలి. దీర్ఘకాలం పాటు వృత్తిపరమైన, 'స్ట్రెస్సు' లో నిరంతర జీవనం వలన మనుషులు లైంగిక అసమర్ధతకు లోనౌతుంటారు. సంసారాలు విచ్ఛిన్నం కావటానికి ఇది ప్రధాన కారణం.

ఇవన్నీ సరిచేసుకోకుండా, లైంగిక శక్తిని పెంచే మందులను ఆశ్రయించటం వలన ధన, మాన, ప్రాణ దోపిడీ తప్ప దక్కేదేమీ ఉండదు. చిట్కా చికిత్సలు ఉడత సాయానికే గానీ, అవే ప్రధానం కాదు! మనోబలం లేనివాడి దగ్గర వజ్రాయుధం ఉంటే మాత్రం ఒరిగేదేం ఉంటుంది...? డబ్బుతో ఏదైనా కొనవచ్చుగానీ, సెక్సు సమర్ధతని కొనలేరు! మందులు మింగి 'వయాగ్ర'గణ్యులు కావచ్చు ననుకోవడం భ్రమ! అది శాశ్వత సుఖప్రాప్తి సాధనం ఎంతమాత్రమూ కాదు.

# లైంగికపరమైన అతి కుతి

"కాన్తా కటాక్ష దగ్ధానాం వద వైద్య కిమౌషధం

ధృఢమాలింగనం పథ్యం, క్వాథస్చ అధర చుంబనం" 'లోలంబ రాజీయం' అనే వైద్యగ్రంథంలో ఈ గమ్మత్తయిన శ్లోకం ఉంది. "కాంతా కటాక్ష దగ్ధుడు" అంటే మదన (విరహం)జ్వరంతో బాధపడేవాడికి జ్వరం మందులు చెప్తావేంటి వైద్యుడా! ధృఢమైన ఆలింగనాన్ని పథ్యంగా పెట్టు, అధర చుంబనాన్ని కషాయంగా ఇవ్వు, జ్వరం దానికదే తగ్గుతుంది .." అంటాడు, లోలంబరాజు అనే కవిరాజు. 'కాంతాకటాక్షదగ్ధత' అందరికీ అన్ని సందర్భాలలోనూ వచ్చేది కాదు. అతి తీవ్రమైన లైంగిక వాంఛ అది! విరహం అందరికీ కలుగుతుంది. అది నూటారు డిగ్రీల జ్వరంగా మారిపోతే తీవ్రమైన వాంఛ అవుతుంది. కానీ, అ పేరుతో సమస్త అనాచారాలూ చేస్తే అది వ్యాధి అవుతుంది. ఆ వ్యాధిని "రిరంసు:" అని పిలిచారు.

శరీరంలో టీబీ నుండి ఎయిడ్స్ వరకూ క్షీణింప చేసే వ్యాధులన్నింటినీ క్షయవ్యాధి ప్రకరణంలో వివరిస్తుంది ఆయుర్వేద శాస్త్రం. ఎయిడ్స్ లాంటి క్షీణింప

చేసే వ్యాధిలక్షణాలు రావటానికి కారణాలలో అతివ్యవాయం (sexual extravagance) ఒక కారణం. దానివలన ఈ క్షీణింపచేసే వ్యాధి రాబోయేముందుగా కనిపించే కొన్ని వ్యాధిలక్షణాల్ని పూర్వరూపాలంటారు. ఈ పూర్వరూపాలలో 'రిరంసువు' ఒకటి! రిరంసువంటే అదేపనిగా సెక్సు కావాలనే తీవ్రమైన యావ. సెక్సుపరమైన అతి కుతి. sex addiction (సెక్సుబానిసత్వం).. ఆల్కాహాలు తాగేవాడు అది లేకపోతే దానికోసం ఎలా వెంపర్లాడి పోతాడో అలాగే సెక్సు కోసం వెంపర్లాడే ఒక మానసిక దౌర్బల్య స్థితిని రిరంసువంటుంది మాధవనిదానం అనే ప్రసిద్ధ వైద్య గ్రంథం.

సెక్సు అనేది అదుపు చేయటానికి లొంగని గుర్రం లాంటిది. Sex is the most difficult to master అంటుందో ఆంగ్ల సామెత. నిరాశ, నిస్పృహ, అసంతృప్తి, సంతోష రాహిత్యం, దిగులు, ఆందోళన ఇలాంటివన్నీ ఈ అతి కుతిని మనుషుల్లో పెంచుతాయి. ఆ మనిషి మామూలు స్థితికి రావటానికి సెక్సులో పాల్గొనటమే సరైన ఔషధం అవుతుంది. లోలంబరాజు చెప్పిన 'కాంతాకటాక్షదగ్ధత'కు చికిత్స అదే! అది మనసుకు పట్టిన ఒక కండూతి. గోకినకొద్దీ మరింతగా గోకాలనిపించే ఒక దురద! సెక్సు కుతి ఏర్పడి, అతిగా గోకినందు వలన మనసుకు పుళ్ళు పడతాయి.

సెల్ఫోనుల్లో బూతు సంభాషణలు వినటం కోసం (ఫోన్ సెక్స్) ఇంటర్నేషనల్ కాల్స్ చేయటం, ఫేసుబుక్ లాంటి సోషల్ నెట్'వర్కుల్ని దుర్వినియోగం చేయటం, వేశ్యల్ని తరచూ కలవటం, తనను ఆడవారిలాగా అలంకరించుకుని అద్దం ముందు నిలబడి, తన లోపల ఉన్న పురుషుడు ఆ స్త్రీతో రమిస్తున్నట్టు ఊహించుకోవటం (ఫెటిషిజం), ఆడవాళ్లతో కొట్టించు కుని, గిల్లించుకుని ఆనందించటం (masochistic encounters), స్వలింగకాముకత్వం, పసిపిల్లల్ని సంభోగించటం లాంటి సమస్త లైంగిక అనాచారాలూ ఈ అతికుతి వ్యాధిలో తరచూ కనిపిస్తుంటాయి. ఇలాంటి మనుషులకు అతికుతి ఉన్నట్టు గమనించి ఇతరులు జాగ్రత్తగా ఉండవలసి ఉంటుంది.

రిరంసు (లైంగికపరమైన అతికుతి) వ్యాధి వచ్చినవారు క్రమేణా క్షీణించి పోతుంటారు. వ్యక్తిత్వం చచ్చిపోతుంది. శక్తి వృథాగా ఖర్చయి పోతుంది. మనుషులు దూరం అయిపోతారు. మన్నన పోతుంది. మానవ సంబంధాలు నశిస్తాయి.

నిజానికి ఈ వ్యాధిలో కనిపించే సెక్సు వెంపర్లాట జననాంగాలకు సంబంధించిన సెక్సు కోసం పడే ఆరాటం ఎంత మాత్రమూ కాదు. అంత చక్కని అవకాశాన్ని వీళ్లు సద్వినియోగ పరచుకోలేరు కూడా! అందుకని, లైంగికతకీ దీనికీ సంబంధం లేదనీ, "perversions" మనో వికారాల్ని నిజమైన లైంగికతగా పరిగణించటానికి వీల్లేదనీ చెప్తుంది ఆధునిక వైద్యశాస్త్రం. రసం అంటే ఆరోగ్యవంతమైన, నిర్మలమైన, ప్రేమనిండిన ఒక తత్వం! రసం ప్రధానంగా ఉన్నప్పుడే అది రసికత అవుతుంది కానిదంతా కాముకతే! కాముకత కూడా చాలా చిన్నమాట. అది ముదిరి ఒక వ్యాధిగా

పరిణమించినప్పుడు దాన్ని sex addiction అనే వ్యాధిగా చెప్తారు. ఆయుర్వేదం దీన్ని 'రిరంసు' అని పిలిచింది. రిరంసు వ్యాధిగ్రస్థుణ్ణి రిరంశువు అని పిలవొచ్చు. రిరంశు వ్యాధి క్రమేణా క్షీణింపచేసే వ్యాధులకు దారితీస్తుందని కూడా ఆయుర్వేద శాస్త్రం చెప్పింది. వీర్యనష్టం వలన సమస్త శరీర ధాతువులూ నశించిపోయి మనిషి క్షీణించిపోతాడు.

సెక్సుయావ కలిగినప్పుడు నిగ్రహించుకో లేని స్థితి, ఉచితానుచితాలు వదిలేసి ప్రవర్తిచటం, ఎదుటి మనిషికి అపకారం చేసే పనులు తలపెట్టటం, మనసులో ఎక్కడో మూలన దాగున్న కోరికలు, భయాలూ, అనుమానాలు, విరోధా లన్నింటినీ తీర్చేసుకోవా లనుకోవటం...మాదక ద్రవ్యాలు వగైరాలకు బానిసైన వాళ్లలాగానే సెక్సు ఎడిక్టులు కూడా ప్రవర్తిస్తారు.

చాలామందిలో రిరంశువుల్లో ఈ రకమైన 'అతికుతి' ధోరణులు కనిపిస్తాయి. కొందరిలో ఎక్కువగా కొందరిలో తక్కువగా ఉండొచ్చు. ఎక్కువగా ఉన్నవాళ్ళు తెలిసిపోతారు కాబట్టి వాళ్లకు దూరంగా ఉండి ప్రమాదం లోంచి బయటపడే అవకాశం ఉంది. తక్కువగా ఉన్న వాళ్లతోనే ఎక్కువ ప్రమాదం. వాళ్ళు మామూలు మనుషుల్లాగానే మనతో కలిసి తిరుగుతుంటారు. కానీ అమావాశ్య, పౌర్ణమి సముద్ర పొంగులాగా అనుకూల పరిస్థితు లొచ్చినప్పుడు వాళ్ళ లోపలి రావణ రాక్షసుడు నిద్ర లేస్తుంటాడు. ప్రేమించలేదని యాసిడ్ పోయటం, పీకలు కోయటం, చిన్నపిల్లలమీద అత్యాచారం చేయటం లాంటి ఘటనలు ఇలాంటివే! రసికతకీ కాముకతకీ తేడా తెలియని వాళ్ళను ఎక్కువగా తయారు చేస్తున్న సినిమాలు ఇతర మాధ్యమాలు ఇందుకు కారణం కావచ్చు కూడా!

అంతకన్నా ముఖ్యమైంది మనం తప్పకుండా ఈ శీర్షికలో చర్చించ వలసిందీ ఇంకొకటి ఉంది... అది inadequate parenting... అంటే, చాలని తల్లిదండ్రిత్వం. కుటుంబ వ్యవస్థను నాశనం చేసుకుని, పిల్లల మానసిక ఎదుగుదల గురించి ఆలోచించటం మానేసి, చాలామంది తల్లిదండ్రులు తమ పిల్లలకు ఆదరణ, ఆప్యాయత, అభిమానాలు పంచలేక పోయినందు వలన ఆ పిల్లలు పెరిగి కరులై సమాజ వ్యతిరేకులుగా మారతారని మనోవిశ్లేషణ సిద్ధాంత కర్తలు చెప్తున్నారు.

నా మొగుడు, నాపెళ్ళాం, నా పిల్లలు నా యిష్టం అనే ధోరణి గది నాలుగు గోడలవరకే పరిమితమైన అంశం కాదు. ఆ పిల్లలు ఎదిగి సమాజం మీద పశువులుగా వచ్చి పడుతారు కాబట్టి ఇది సామాజిక సమస్య. దాని గురించి ప్రతి ఒక్కరూ స్పందించ వలసిన అవసరం ఉంది. మనదేశంలో కూడా క్రమేణా వ్రేళ్ళూనుకుంటున్న ఈ విషసంస్కృతి గురించి ముందుగానే హెచ్చరించ వలసిన బాధ్యత మనకుంది!

# 3. సంసారం

## కామశాస్త్రంలో ముఖ్యాంశాలు

-జె.డి.వి.పి.రావ్, జగిత్యాల

**ప్ర : కామశాస్త్రం ఎలా పుట్టిందో, వివరంగా చెప్తారా సర్ ? దాని ముఖ్యాంశాలు తెలియజేయండి?**

మనం ఏ విషయం గురించి మాట్లాడుకొంటున్నామో దానిమీద మీకైనా, నాకైన్నా గౌరవం వున్నప్పుడే మనం మాట్లాడుకున్న ప్రయోజనం వుంటుంది. క్రొత్త విషయాలు తెలుస్తాయి. కొత్తగా ఆలోచించడం తెలుస్తుంది.

ఇప్పుడు మనం కేవలం ధర్మార్ధకామాల గురించి మాత్రమే మాట్లాడుకోబోతున్నాం కాబట్టి ఆ మూడింటిమీద గౌరవంతో నమస్కరించి అధ్యయనం చెయ్యాలి.

ధర్మార్ధకామాలు ఈ శాస్త్రానికి 'ప్రకృతి' (స్వభావం - Nature) కాబట్టి వాటికి నమస్కారం. వాటిని ఉపదేశించే బోధకులకి, శాస్త్రకర్తలైన ఆచార్యులకి, పండితులకి, కామశాస్త్ర పారంగతులక్కూడా నమస్కారం. ఎందుకంటే, అలాంటి అనుభవజ్ఞుల అనుభవాన్ని కూడా ఈ శాస్త్రంలో మనం ఉపయోగించుకోబోతున్నాం, కాబట్టి వారికీ నమస్సులు. వారి అనుభవాలు అందరికీ ఆరోగ్యవంతమైన శృంగారాన్ని, సురక్షితమైన శృంగారాన్ని, సమర్ధవంతమైన శృంగారాన్ని ఇచ్చేవిగా ఉండాలని కోరుకుందాం. కామశాస్త్ర విశేషాలు పేరుతో నేను వ్రాసిన గ్రంథంలో ఈ విషయాలను మరింత విపులంగా అందిచాను.

### తొలికామశాస్త్ర గ్రంథం

ఈ కామశాస్త్రం ఇవ్వాళ ఏదో కొత్తగా పుట్టుకురాలేదు. ప్రజలందరినీ సృష్టించే క్రమంలో బ్రహ్మదేవుడు ఎంతో పనిఒత్తిడి మీద వున్న రోజుల్లోనే, ధర్మార్ధకామాలనే పురుషార్ధాలను సాధించుకోవడానికి కావలసిన ఉపాయాలెన్నో చెబుతూ 'స్థితి నిబంధనం' అనే శాస్త్రాన్ని తయారుచేశాడు.

ఈ స్థితి నిబంధనం మూడు భాగాలుగా ఉండేది! మొదటి భాగం ధర్మం గురించి చెబుతుంది. దాన్ని మనువు ప్రజలందరికి తెలియజేస్తానని బ్రహ్మనుండి గ్రహించాడు. రెండో భాగం డబ్బు గురించి చెబుతుంది. దేవతల గురువు బృహస్పతి దీన్ని తాను వివరిస్తానని బ్రహ్మనుంచి గ్రహించాడు. ఇంక మూడోది, అతి ముఖ్యమైనది

కామశాస్త్రం. నందికేశుడు దీన్ని గ్రహించి, వెయ్యి అధ్యాయాలు కల్గిన శాస్త్రంగా తయారుచేశాడు. ఇది మొట్టమొదటి కామశాస్త్ర గ్రంథం.

**త్రేతాయుగానికి లైంగికనీతి**

వెయ్యి అధ్యాయాలున్న ఇంత పుస్తకం మరీ పండితులకు తప్ప సామాన్య జనానికి ఎక్కువగా వున్నదని, నందికేశ్వరుడు రూపొందించిన కామశాస్త్రాన్ని సంక్షిప్తీకరించి 500 అధ్యాయాలతో కొంచెం క్లుప్తంగా మరో గ్రంథాన్ని రూపొందించాడు శ్వేతకేతువు. ఈయన ఉద్దాలక మహర్షిపుత్రుడు. ఆ రోజుల్లో ఇంటికొచ్చిన అతిథిని గౌరవించడంకోసం స్వంత భార్యని ఆయనదగ్గరకు పంపడం వంటి కొన్ని దురాచారాలుండేవి. శ్వేతకేతువు వాటినన్నింటినీ ఖండించి, 'లైంగిక నీతి' ఎలావుండాలో చక్కగా బోధించాడు ఈ గ్రంథంలో ! అది త్రేతాయుగంనాటి ప్రజలకోసం రాసిన గ్రంథం.

**ద్వాపరయుగంలో కామశాస్త్రం**

మళ్ళీ యుగం మారింది. మనుషుల్లో పెద్దపెద్ద తలగడల్లాంటి గ్రంథాలు చదువుకునే ఓపికలు తగ్గిపోసాగాయి. అందుకని బాభ్రవ్యుడనే మహర్షి పూనుకొని 150 అధ్యాయాలతో బాగా క్లుప్తీకరించిన కామశాస్త్రం గ్రంథాన్ని రచించాడు. అది ద్వాపరయుగం నాటి ప్రజలకోసం ఉద్దేశించింది.

ఈ గ్రంథంలో "వైశికం" అనే అధ్యాయం ఉందిట. ఆ అధ్యాయం వరకూ తీసుకొని పాటలీపుత్రంలో వున్న వేశ్యల ఉపయోగార్థం మరింత విస్తృతపరచి, దత్తకుడనే రచయిత ఒక చిన్న గ్రంథాన్ని ప్రత్యేకంగా తయారుచేశాడట. వ్యభిచారం చేసే స్త్రీలు విటులతో ఎలా ప్రవర్తించాలో విడమరిచిన అధ్యాయం అది! ఆరోగ్యవంతమై, సురక్షితమైన శృంగారానికి వేశ్యల వలన కలిగే అపకారం ఆ యుగంలోకన్నా ఈ యుగంలో ఎక్కువ కాబట్టి ఆ గ్రంథం ఈ కాలానికి చేటు చేయవచ్చు.

ఈ దత్తకుడి గురించి ఒక చక్కని కథవుంది. పాటలీపుత్రంలో ఓ వృద్ధ బ్రాహ్మణుడికి ఒక కొడుకు పుట్టాడు. కొడుకును కని తల్లి చనిపోయింది. అనతి కాలంలోనే తండ్రి కూడా మంచానపడి, పిల్లవాణ్ణి పెంచే బాధ్యత ఇంకో ఆవిడకి అప్పగించి కాలంచేశాడు. వాడికి దత్తకుడని పేరుపెట్టి ముద్దుగా పెంచుకోవడం మొదలుపెట్టింది ఆ ఇల్లాలు. దత్తకుడు వేదవేదాంగాలతో పాటు సకల కళల్లోనూ ఆరితేరాడు. మంచి వక్త. మంచి గ్రంథసాంగుడుకూడా! పాటలీపుత్రం వేశ్యల దగ్గర "లోకయాత్ర" అనే విద్యకు సంబంధించిన రహస్యాలేవో ఉన్నాయని తెలిసి, వాళ్ళని మంచిచేసుకుని, అవి తెలుసుకొని, పరిశోధించి, అందులోని రహస్యాల్ని తిరిగి

వాళ్ళకే నేర్పాడట. స్త్రీ రూపం పొంది పురుషుడితో కలిగే సుఖాన్ని, పురుషరూపంలో స్త్రీతో కలిగే సుఖాన్ని రెండింటినీ అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడట. తన అనుభవాల్ని జోడించి పురుషుల్ని రంజింపచేసే ఉపాయాల్ని స్త్రీలకు బోధించడం కోసం 'వైశికం' గ్రంథాన్ని విస్తరించి రాశాడట.

**కామానికి నిర్వచనం**

ముందుగా కామం అంటే ఏమిటో తెలుసుకోవాలి. ఇది చాలా ముఖ్యమైన నిర్వచనం. కొంచెం శ్రద్ధగా చదవండి.

కళ్ళు ఈ ప్రపంచాన్ని చూపిస్తున్నాయి. చెవులు విన్పింపచేస్తున్నాయి. నాలుక రుచిని తెలిసేలా చేస్తోంది. ముక్కు వాసన తెలిసేలా చేస్తోంది. చర్మం స్పర్శని తెలుపుతోంది. ఇలా మన పంచ జ్ఞానేంద్రియాలు మన మనసు పరిపాలనలో వుండి మన శరీరానికి అనుకూలంగా ప్రవర్తించడాన్ని 'కామం' అంటారని కామశాస్త్రం నిర్వచిస్తోంది.

ఆత్మ అంటే జీవుడు. ఈయన కంటితో ఒక విషయాన్ని చూసి ఆనందిస్తున్నాడు–అనుకుందాం!

ఇక్కడ ఆనందించింది జీవుడు. ఆనందం పొందేలా చేసింది మనసు. ఆనందం కల్గించింది వస్తువు. అందుకు తోడ్పడింది కన్ను. కన్ను అనే జ్ఞానేంద్రియంతో చూడడం అనే ఇంద్రియార్థం ద్వారా మనసులో సంతోషాన్ని ఆత్మ పొందుతోంది. ఆ సంతోషాన్ని పొందాలనే కోరికే కామం!

ఆత్మ, మనసు, ఇంద్రియం, ఇంద్రియార్థాల సంయోగం అనుకూలంగా వున్నప్పుడు అది 'కామం' అవుతుంది. ఇది సామాన్య కామం, ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతంలో ఈ సంతోష వాంఛనే 'సెక్సు' అని నిర్వచించాడు.

ఇంకో కామం ఉంది. అది విశేష కామం. స్త్రీ పురుషులు ఒంటరిగా దగ్గరయినప్పుడు పొందిన ఆనందాన్ని విశేషకామం అంటారు. దీన్ని 'అభిమానిక సుఖం' అని కూడా అంటారు. అవతలి వ్యక్తిద్వారా తాను ఫలానా సుఖానుభవాన్ని పొందుతున్నానని, ఇద్దరూ ఒకరినొకరు అభిమానించుకొనే సుఖాన్ని విశేషకామం అంటారు. ఇతర కోరికలూ తీరాలి - సెక్సుకోరికా తీరాలి - అని విడివిడిగా చెప్తున్నాడన్న మాట.

**ధర్మార్థకామాలలో ఏది ముందు?**

ధర్మార్థకామాలు మూడూ ఒక్కసారే సమకూరాయి అనుకుందాం. వీటిలో ముందు దేన్ని సాధించాలి అనేది ప్రశ్న. ఎవరైనా తడుముకోకుండా ధర్మం ముందు, అర్థం తర్వాత, ఆఖరికి అన్ని అవకాశాలూ కలిసొస్తే అప్పుడు కామం .... అంటారు కదా! ఇది నిజమే! కామంకన్నా అర్థం గొప్పది. అర్థం కన్నా ధర్మం గొప్పది.

కానీ, ఇది మనుషులందరికీ సమానంగా వర్తించే విషయమేనా! ఒక్కసారి ఆలోచించండి....!! వాత్స్యాయనుడు ఏమంటాడో తెలుసా... "అర్ధశ్యరాజ్ఞః" అని! రాజుకి ధర్మం కన్నా, కామం కన్నా, డబ్బు ముఖ్యం అని దీని అర్ధం. లోక సంరక్షణ చెయ్యాలంటే కోశం బలంగా ఉండాలి. దండబలం (సైనికశక్తి) మెండుగా ఉండాలి. అందుకు 'అర్ధం' (డబ్బు) ముఖ్యం కదా! రాజుదాకా దేనికీ ... వేశ్యను తీసుకోండి- దానికి ధర్మకామాల కన్నా డబ్బు ముఖ్యంకదా... అందుకని ధర్మార్ధకామాలలో ఏది ముఖ్యం అనేది అవి అందుబాటులోకి వచ్చి, సమకూరిన పరిస్థితి మీద, వాటి అవసరం మీద, అవకాశం మీద ఆధారపడిన అంశాలేగాని అందరినీ అన్నివేళలా ఒక గాటన కట్టిపడేయడం సాధ్యం కదాంటుంది కామశాస్త్రం! కొందరికి ధర్మమే ముఖ్యం కొందరికి కొన్ని పరిస్థితుల్లో డబ్బు ముఖ్యం! ఎక్కువ మందికి అన్ని పరిస్థితుల్లోనూ కామమే ముఖ్యం. ఒక స్త్రీ, ఒక పురుషుడు వ్యభిచరిస్తున్నప్పుడు ఆ పురుషుడికి కామం, ఆ స్త్రీకి అర్ధం ప్రదానంగా వుంటాయి. ఇద్దరికీ 'ధర్మం' అప్రధానమే!

**కామానికి శాస్త్రం అవసరమా?**

ఆవులూ, ఎద్దులూ కలుసుకొంటున్నాయి. చేపలూ, చేపలూ కలుసుకొంటున్నాయి. స్త్రీ, పురుష భేదం ఉన్న ప్రాణికోటిమొత్తం సంయోగ సుఖాన్ని పొందుతూనే ఉంది. ఇవన్నీ ఏ శాస్త్రంలో చదివి కామసేవన చేస్తున్నాయంటారూ...??

సృష్టి ఏర్పడినప్పుడే ఆత్మతోపాటే మనసు, కామక్రోధాదులు అన్నీ ఏర్పడ్డాయి. కామంకోసం ఒక శాస్త్రం కొత్తగా కావాలా?

1) పశువులూ, పక్షులూ తమ మానాన్ని బట్టతో కప్పి ఉంచుకోవట్లేదు. మనిషి మాత్రమే అలా చేస్తున్నాడు. అందువలన 'సిగ్గు' అనేది మనిషికి తెలిసినట్లు పశుపక్ష్యాదులకు తెలియదు. మానవ జననాంగాలు ఏ అరిచేతిలోనో వుంటే షేక్ హేండిచ్చుకున్నంత తేలికగా లైంగిక కార్యం జరిగిపోతుంది. ప్రేమ, పెళ్ళి, శృంగారంతో దానికి నిమిత్తం వుండదుకదా!

2) పశుపక్ష్యాదుల్లో ఎక్కువ జాతులు ఋతుకాలంలో మాత్రమే సంయోగ సుఖాన్ని పొందుతున్నాయి. అదికూడా సంతాన ప్రాప్తిని కల్గించేదే అయినా, కోరిక మేరకే సంగమిస్తున్నాయిగాని, సంతానాన్ని కనాలనే స్పృహతో కాదు.

3) మానవ స్త్రీలలో ఋతుకాలం నెలకొకసారి వుంటుంది. అత్యధిక జీవరాసుల్లో మాత్రం ఎప్పుడో ఒకసారే ఉంటుంది. ఋతువు లేనప్పుడు జంతు ప్రాణులు సంయోగ సుఖాన్ని కోరుకోవడంలేదు. ఋతుకాలంతో నిమిత్తం లేకుండా మనుషులు నిరంతరం "సెక్సుయావ"లోనే జీవిస్తున్నారు. కాబట్టి వాళ్ళకి

ధర్మార్థకామ భావన కావాలి. పశువులకు అవసరం లేదు. వాటి కామం నూరుశాతం ధర్మబద్ధం.

4) పశువులు క్షీరధారలిస్తున్నాయి. పక్షులు గుడ్లు ఇస్తున్నాయి. అంతేకాక ఆహారానికి మాంసాన్నిస్తున్నాయి. అందుకోసం తమ సంతతిని వృద్ధి చేసుకుంటున్నాయి. కానీ, ఇవి ఏవీ బుద్ధిపూర్వకంగా "ఇవ్వాళ మన అయ్యగారికి పది లీటర్ల పాలు ఇవ్వాలి" అనుకొని అవి మనకు ఇవ్వడం లేదు. రోజుకొక గుడ్డు జాగ్రత్తగా పెట్టి తన యజమానికి అప్పగించాలని ఏ కోడీ కోరుకోదు. కాబట్టి ధర్మార్థకామాల సాధన అనే ప్రస్తావన పశుపక్ష్యాదులకు ఉండదు. మనుషులకు కావాలి.

5) మనుషులు సిగ్గు తెలుసుకొని తమ తమ మానాల్ని గుడ్డలతోనో, ఆకులతోనో, జంతుచర్మాలతోనో కప్పుకోవడం మొదలుపెట్టిన రోజే ధర్మార్థకామాలు కూడా మానవజాతిలో మొదలయ్యాయి. అవి అవసరం. వాటికి శాస్త్రాలు కూడా అవసరమే!

6) ఆకులు కట్టుకు తిరిగిన పాత కోతిరోజులే నయం, మానాన్ని దాచుకునేవాళ్ళు, నూలు బట్టలొచ్చాకే కోతి చేష్టలు పెరిగాయి.

**అందినప్పుడే అందినంత!**

యజ్ఞాలు చేస్తే వచ్చే జన్మలో ఫలితం కనిపిస్తుందిట! ఇన్ని కష్టాలూ సహించి అన్ని కోర్కెలూ చంపుకొని చచ్చిన తర్వాత ఏమౌతామో ఎవరికీ తెలియదు. తెలివైనవాడు చేతికి చిక్కినదాన్ని వదిలి వచ్చే జన్మలో ఈ సుఖాన్ని అనుభవిస్తాను... అంటాడా???

రేపు దొరికే నెమలి కంటే, ఇవ్వాళ దొరికిన కోడి మేలు కదా! వెనకటికి ఇలానే ఓ పెద్దాయన చందాకోసం వచ్చాడు. సదరు దాతగారు అన్నాడు కదా... "ఇప్పుడు చేతిలో పెద్దగా డబ్బులేదు. పాతికో పరకో ఇవ్వగలను. రేపు డబ్బు వస్తుంది. రేపు వస్తే ఇంకాస్త ఎక్కువిస్తాను" అని! అది విని, చందాలాయన నవ్వి, రేపు వస్తుందనుకున్న డబ్బుమూట సంశయాత్మకం కదా... ఇప్పుడు తమ చేతుల్లో ఉన్నదంటున్నదేదో అదే నిజం... కాబట్టి, ఆ నిజమేదో దాన్నే దయచేయించండి... అని కామం కూడా అంతే. రేపటికి వాయిదా వేసే విశేషాలు కావివి. అయితే, ఆ అందిన కామం ఆరోగ్యవంతంగానూ, సురక్షితంగానూ ఉండేలా జాగ్రత్తపడాలి. అప్పుడే ధర్మ అర్థ కామాలు సమానంగా సిద్ధించినట్టు!

**శాస్త్రోక్తంగా కామకలాపాలు**

శాస్త్రం చదవకపోయినా అనుభవం మీద చాలా విషయాలు తెలుస్తాయి. గుర్రం మీద స్వారీ చేసేవాడికి అశ్వశాస్త్రం అంతా తెలియవలసిన పనిలేదు. కారు

నడిపే డ్రైవర్‌కి కారు మెకానిజం రాకపోతే, కారు నడపలేడా...? వాత్స్యాయనుడు అంటాడూ... కారణం దూరంగా వున్నా జరిగే కార్యం జరుగుతూనే ఉంటుంది. రాజు గారు ఊళ్లో లేకపోయినా రాజ్యం నడుస్తూనే ఉంటుంది. కామశాస్త్రాన్ని ప్రత్యక్షంగా చదవకపోయినా కామకలాపాలు ఏమీ ఆగవు. కానీ, పోలీసు ఉన్నప్పుడు సిగ్నల్‌లైట్‌ల దగ్గర గీతదాటకుండా ఎంత జాగ్రత్తగా ఉంటామో, అలాగే, కామశాస్త్రం తెలుసుకున్నప్పుడు, కామకలాపాల్లోనూ శాస్త్రోక్తంగా ప్రవర్తిస్తామంటాడు వాత్స్యాయనుడు. అదీ కామశాస్త్ర ప్రయోజనం!!

శాస్త్రోక్తంగా ప్రవర్తించడం అంటే, శృంగారంలో ఎలాంటి మనోవికారాలకు అవకాశం లేకుండా, శారీరకంగా, మానసికంగా కూడా ఆరోగ్యకరంగానూ, సురక్షితంగానూ, సమర్థవంతంగానూ ప్రవర్తించడం అని.

**కామశాస్త్రం తెలిశాకే పెళ్ళి!**

ఆ రోజుల్లోనే కాదు, ఈ రోజుల్లో కూడా ఆడపిల్లలకు మగపిల్లలకు అన్ని విషయాలూ తెలిసుండాలి అనే సిద్ధాంతం ప్రముఖమైనదే! ఎన్ని మనం తెలిసేలా చెయ్యగలుగుతున్నాం అనేది ప్రశ్న!

వంట చేయడం, భారత, భాగవతాలు చదవగలగడం వస్తేచాలు అనుకునే స్థితినుంచి ఆడపిల్లలు ఎంతమంది ఇంకా బయటపడలేక పోతున్నారో లెక్కించడం కష్టమే! మునుపు 'వరవీణా' వస్తే సంగీతం వచ్చినట్టేనని, హార్మోనీ పెట్టె ముందు కూర్చోబెట్టి ఫొటోలు తీయించేవాళ్ళు. రోజులు మారాయి. ఇప్పుడు ఆడపిల్లలు ఇంజనీర్లు, డాక్టర్లు అవుతున్నారు. ఆఫీసర్లు, కలెక్టర్‌లు కూడా అవుతున్నారు. వాత్స్యాయనుడు అలా ఆడపిల్లలు ఎదగాలని కోరుకున్నాడు.

పెళ్ళినాటికి ఆడపిల్ల - ఏ పరిస్థితుల్లో ఏ మార్పులు వచ్చినా - తన కాళ్ళమీద తాను బతికే విధంగా ఆడపిల్లల్ని పెంచాలని తల్లిదండ్రులకు సూచించాడు. "దేశాంతరే஽పి విద్యాభిస్సా సుఖేనైవ జీవతి" అన్నాడు. అంటే "ఆడవారు విద్యావంతులైతే దేశాంతరాల్లో కూడా సౌభాగ్యం వాళ్ళ స్వంతం అవుతుంది" అని.

సకలశాస్త్రాలూ చదివి, కామసూత్రాల్ని కూడా పఠించిన తర్వాతే పెళ్ళి చేసుకోవడం అవసరం. అప్పుడు కామానికీ, ధర్మానికి ఉన్న సంబంధం అర్థం అవుతుంది. బతకడానికి డబ్బు కావాలి. భార్యతో సుఖంగా కాపురం చెయ్యడానికి డబ్బు కావాలి. డబ్బెలా సంపాదించాలి?

ఈ రోజుల్లో ఇలా ఫలానా కులంవాడు అని చెప్పడం సాధ్యం కాకపోవచ్చు. తాను నేర్చిన విద్యల్ని ఆచరణలో పెట్టి గృహస్థుగా మారడం గురించి ఆలోచించమంటాడు వాత్స్యాయనుడు.

అక్రమ సంబంధాలు - కారణాలు

పరాయి వాడి భార్యతో అక్రమ సంబంధాలు పెట్టుకునే మనుషులంతా కేవలం కామం కోసమే ఈ పని చేస్తున్నారనుకోనవసరం లేదు. దీని వెనక చాలా కథ ఉంది.

1) తన గర్భశత్రువు ఎవరో ఆడదానితో అక్రమ సంబంధం పెట్టుకొంటే, దాన్ని చెడగొట్టి తనే ఆ సంబంధాన్ని ఆమెతో కొనసాగించాలని ఒకడు ప్రయత్నించవచ్చు.

2) ఆమెతో సంబంధం ద్వారా ఆమె భర్తని మంచి చేసుకోవచ్చునని ఈ విధంగా అతనికోసం ఆమెతో సంబంధం పెట్టుకొనేవాడొకడు.

3) తనకు అపకారం చేసే ఉద్దేశం వున్నవాడి భార్య మనసుని ఎలాగోలా జయించగలిగితే, ఆమె ద్వారా ఆమె భర్త ధ్యాసని మళ్ళింపచేయవచ్చుననుకొనేవాడు మరొకడు.

4) ఆమెను పొందడం ద్వారా, ఆమె భర్త రహస్యాల్ని పొందవచ్చుననే ధ్యాసతో ప్రయత్నిస్తాడొకడు.

5) బాగా డబ్బున్నవాడి పెళ్ళాన్ని పట్టుకుంటే, ఎంతో కొంత ధనలాభం పొందవచ్చునని ఆశించేవాడొకడు.

6) తనను కోరి ఆమె స్వయంగా వచ్చినప్పుడు అంగీకరించకపోతే, తన భర్తకు లేనిపోనివన్నీ చెప్పి తనకు అపకారం కల్గించవచ్చునని భావించే వాడింకొకడు. కొందరు ఆఫీసర్ల పెళ్ళాలతో ఇలాంటి ఇబ్బందులు ఒక్కోసారి కలగవచ్చు. అనూహ్యమైన సౌఖ్యమూ పొందే అవకాశం కూడా కలగవచ్చు.

7) ఇప్పుడు తను కాదంటే, ఆవిడ తన శత్రువులతో సంబంధం పెట్టుకొనే ప్రమాదం వుందని భయపడి కూడా ఇలాంటి సంబంధాలకు తలపడుతూ ఉంటారు.

8) ఆమెతో సంబంధం పెట్టుకొని, ఆమె భర్తమీద పరోక్షంగా కక్ష తీర్చుకోవాలని చూసేవాడు మరొకడు.

9) రాజుగారి వేగులు సాధారణంగా శత్రు రాజుల రాణివాసం వైపునుంచి కథను నడపడానికి ప్రయత్నిస్తారు.

10) ఈమెతో సంబంధం వలన ఈమె ద్వారా తను కోరుకునే స్త్రీని పరిచయం చేసుకోవడానికి అవకాశం ఉంటుందని ఆలోచించేవాడు మరొకడు.

ఇలా దుష్ట తలంపులు చేసేవాళ్ళు చాలామంది ఉంటారు. లైంగిక సంబంధాలు గది నాలుగు గోడల మధ్య జరిగే వ్యవహారాలు కాబట్టి, బైటకు తెలిసే రహస్యాలు పరిమితంగా ఉంటాయి. అనుమానాలు, ఊహలు, పుకార్లు తప్ప అక్రమ సంబంధాలు

బహిరంగంగా పట్టుబడేవి తక్కువ ఉంటాయి. ఈ అక్రమ సంబంధాలన్నీ "న కేవలం రాగా దేవేతి పరపరిగ్రహ గమన కారణాని" అంటే, కేవలం "అనురాగం"తోనే జరుగుతున్నాయనుకోవడం పొరబాటనీ, ఎవరి ప్రయోజనాలు వారికి ఉంటాయని, కానీ, అక్రమం సంబంధీకులు సంగమించిన ప్రతిసారీ ఒక సాహస కార్యం లాంటిదేననవలసి ఉంటుందనీ అంటాడు వాత్స్యాయన మహర్షి. మూడో కంటికి తెలియకుండా గోప్యంగా జరిపే చర్య కదా!

**"దుష్ట" స్త్రీ పురుషులు**

ఇవ్వాళ ఎయిడ్స్ పెనుభూతం. నిన్నటిదాకా సిఫిలిస్ వంటి సుఖవ్యాధులు ఏర్పడ్డాయి కాబట్టి అక్రమ సంబంధాలు పెట్టుకునే వాళ్ళని బహిరంగంగానే హెచ్చరించవలసి వస్తోంది. ఈ వ్యాధులేవీ లేని రోజుల్లో కూడా వాత్స్యాయనుడు "దుష్టస్త్రీ"ని పొందవద్దని చెప్పాడు.

దుష్ట స్త్రీ – అంటే ఎవరు? పొందదగని ఆడదాని గురించి వాత్స్యాయనుడు చెప్పింది పరిశీలిద్దాం. ఆడవాళ్ళకేనా ఈ నియమాలన్నీ అని అడిగితే, ఇవే విషయాలు మగవాళ్ళకూ వర్తిస్తాయనే అర్థం చేసుకోవాలి. దుష్ట స్త్రీ ఎంతో దుష్ట పురుషుడూ అంతే!!

1) **చర్మవ్యాధులున్న** వ్యక్తులతో సంబంధం పెట్టుకోకండి.
2) **'ఉన్మత్తా'** పిచ్చివాళ్ళ జోలికి వెళ్ళకండి. సుఖం ఏదీ దొరక్కపోగా ప్రమాదం జరిగే అవకాశం ఉంది.
3) **పతిత :** కులభ్రష్టురాలు అంటే నడవడిక బాగోలేదని ఇంట్లోంచి అందరూ వెళ్ళగొట్టిన స్త్రీని లేదా పురుషుడికి దూరంగా ఉంచాలి.
4) **భిన్నరహస్యా :** ఆ వ్యక్తితో సంబంధం పెట్టుకుంటే తన రహస్యాన్ని దాచిపెట్టలేని వ్యక్తితో ఏ విధంగానూ సన్నిహితంగా వ్యవహరించకూడదు. ఊరంతా టాంటాం చేసిపారేస్తారు. పరువు బజార్న పడ్తుంది!
5) **ప్రకాశ ప్రార్థినీ :** అంటే, ముందు తియ్యగా మాట్లాడి వెనకాల గోతులు తీసే మనస్తత్వం వున్న వ్యక్తుల్ని నమ్మి దగ్గర అవకూడదు. ఆడవారికైనా, మగవారికైనా ఇలాంటి వాళ్ళు నమ్మితే చాలు కాటువేస్తారు.
6) **గతప్రాయయౌవనా :** వయసుడిగిపోయిన వ్యక్తులతో అక్రమ లైంగిక సంబంధాలు ఉపయోగం లేకపోగా అల్లరయ్యేందుకు ఎక్కువ అవకాశాలుంటాయి.
7) **అతిశ్వేతా :** బాగా తెల్లగా వుండే వ్యక్తులతోనూ

8) **అతికృష్ణా :** అతినల్లగా వుండే వ్యక్తులతోనూ లైంగిక సంబంధాలు వద్దని చెప్పాడు వాత్స్యాయనుడు. బహుశా అతితెలుపు, అతి నలుపు అనే పదాలు జాతి వాచకంగా వాడి వుంటాయి.

9) **దుర్గంధా :** దగ్గరకు వెళితే కంపుకొట్టే వాళ్ళతో సంబంధం పెట్టుకుంటే ఏం సుఖం వుంటుందీ? అందుకే వద్దన్నాడు. పైగా ఈ దుర్గంధం ఏ వ్యాధులు కల్గిస్తుందో తెలియదు కదా!!

10) **సంబంధినీ :** దగ్గర చుట్టాల్లో ఎవ్వరితోనూ అక్రమ సంబంధాల గురించి ప్రయత్నం చెయ్యడం మంచిది కాదంటాడు. ఒకవేళ వ్యవహారం బెడిసికొడితే, మర్నాటి నుంచి ఒకరినొకరు ముఖం ముఖం చూసుకోవాలంటే ఇబ్బందిగా వుంటుంది కదా!!

11) **సఖి :** భార్యకు సన్నిహితురాలిగా వుండే వ్యక్తితోగాని, భర్తకు స్నేహితుడైన వ్యక్తితోగాని స్త్రీ పురుషులు అక్రమ సంబంధాలు పెట్టుకోకూడదు. ఏ బలహీన క్షణంలోనో విషయం ఇంట్లో వాళ్ళకు చేరవేసే ప్రమాదం ఉంటుంది.

12) **ప్రవ్రజితా :** సన్యాసులు, దేవుళ్ళుగా చెలామణి అయ్యే వ్యక్తులు, పురాణాలు చెప్పుకు బ్రతికే వాళ్ళతో అక్రమ సంబంధాలు కూడా అనర్థ హేతువేనంటాడు వాత్స్యాయనుడు. పాపభీతి వెన్నాడుతుందని కావచ్చు.

13) **శ్రోత్రియ :** బ్రాహ్మణుడు, పురోహితుడు, పూజారి - వీరి భార్యలతో కూడా సంబంధం వద్ద గట్టిగా చెప్పాడు.

14) **సంబంధినీ సఖీ :** తనతో వ్యాపారంలో భాగస్వాములు, తోటి ఉద్యోగులు- ఒకరితో నొకరు అక్రమ లైంగిక సంబంధం కోసం ప్రయత్నించడం మంచిదికాదు. ఎందుకంటే, అందుకోసం ఒకరు చేసే ప్రయత్నాన్ని రెండో వ్యక్తి అంగీకరించకపోతే అసలుకే మోసం వచ్చి వృత్తి వ్యాపారాలు దెబ్బతింటాయి. అలాగే తమ వ్యాపారంలో వచ్చే ఖాతాదార్లు కూడా ఇలాంటి సంబంధ సఖులే అవుతారు. కష్టమర్లను మంచి చేసుకొని వ్యాపారం పెంచుకోవడం తెలివైనవాడి లక్షణం. ఈ మంచి చేసుకోవడంతో మరో అడుగు ముందుకెళ్ళి ఏకంగా ఆ వ్యక్తులతో అక్రమ సంబంధం పెట్టుకోదలిస్తే మాత్రం, ఆ తర్వాత వ్యాపారం గుండు గీకినట్లయిపోతుంది.

15) **రాజదార :** రాజుగారి భార్యమీద మాత్రం కన్నెయ్యకండి. కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలని దుస్సాహసాలు చేసి జై పాతాళభైరవి అనేద్దామని చూడకండి. సినిమాలు వేరు - జీవితం వేరు. ఆఫీసర్ గారి పెళ్ళానికే "లైన్" వేస్తే ఎప్పటికైనా ప్రమాదమే!

ఎలాంటి మగవాణ్ణి పెళ్ళాడాలి?

1) ఎవడు తనని సుఖపెడతాడో వాణ్ణి పెళ్ళాడాలి. కామశాస్త్రం అంతా తెలిసి, అన్ని రకాలుగానూ సుఖపెట్టగలవాడే తనకు తగినవాడు.

2) ఎవడు తన మనసెరిగి తనకు అనుకూలంగా వుంటాడో వాడు ఆమెకు తగిన మొగుడు.

3) ఎవడు తనకు వశుడై తన కోరికలకనుగుణంగా నడుచుకుంటాడో వాడు తగిన మొగుడు.

4) అంతేగాని, అందాన్ని చూసి, ఆస్తుల్ని చూసి మాత్రమే వరించేవాడు తగనివాడే!

5) యోగ్యుడు, గుణవంతుడు, అనుకూలుడూ, సమస్త కార్యాలలో సమర్థుడు, ఏకాంతంగా తనను కోరేవాడు, రకరకాల ఉపాయాలతో తనను ఆనందపరిచేవాడు వరుడుగా దొరికినప్పుడు ఆ సంబంధాన్ని వదులుకోకూడదు.

6) అనేకమంది స్త్రీలతో సంబంధాలున్న ధనికుడు మొగుడుగా దొరికితే తిండిపెడతాడు, డబ్బిస్తాడు, ఇల్లిస్తాడు. అన్నీ ఇస్తాడు – ఒక్క 'విస్రంభసుఖం" తప్ప! అలాంటప్పుడు ఆ సుఖం కోసం అడ్డదారులు తొక్కి కుతి తీర్చుకోవాల్సి వస్తుంది. ఇలాంటి నిష్క్రియా పరుడైన కాముకుడితో, తిరుగుబోతుతో సంసారం చేసేకన్నా, తనకు అనుకూలుడిగా వుండి, వున్నంతలో కుటుంబాన్ని సమర్థంగా పోషించుకోగలిగే పేదవాడే "మేలు"!

7) తనకన్నా తక్కువ జాతికి చెందినవాడు, తనకన్నా వయసులో చాలా పెద్దవాడు, విదేశాల్లో వుండేవాడు... ఇలాంటి వాళ్ళని భర్త స్థానంలోకి తేవద్దని వాత్స్యాయనుడు చెప్తున్నాడు.

8) ఘోషాబండిలో ముసలమ్మ కూర్చున్నా తొంగిచూసే మనస్తత్వం వున్నవాడు, పమిట కొంగు కనిపిస్తేచాలు వెంపర్లాడి పోయేవాడు, నిగ్రహించుకోవడం అలవాటు లేనివాడు, అతిగర్వి, తాగుబోతు, జూదం ఆడేవాడు... వీళ్లంతా మైథునం చెయ్యడానికి ఏమీ మిగిలి వుండనివారనీ, ఇలాంటి వారిని జాగ్రత్తగా పరిశీలించాకే సంబంధం కలుపుకోవాలనీ మహర్షి హెచ్చరించాడు.

9) సమాన గుణాలున్న రెండు సంబంధాలు ఒకేసారి వచ్చినప్పుడు ఆ ఇద్దరిలో ఎవరు తనను స్వయంగా వరించేలా ప్రేరేపించగలుగుతాడో వాడే శ్రేష్ఠుడు. అంటే గుణగణాలన్నీ వున్నా, చొరవ కూడా వున్నవాణ్ణి పెళ్ళాడితే మంచిదని మహర్షి సూచన!!

**ఎలాంటి పెళ్ళిళ్ళు విజయవంతం అవుతాయి?**

పెళ్ళికి తలపడబోయే యువతీయువకులు ఎలాంటి వాళ్ళుగా వుంటే మంచిదో వాత్స్యాయన మహర్షి వివరిస్తున్నాడు.

1) **సవర్ణాయ** : ఒకే కులానికి చెందిన వారైతే ఆహారపు అలవాట్లు, జీవన విధానం, కులాచారాలు, మతాచారాలు, పూజావిధానాలు అన్నీ ఒకేలా వుంటాయి కాబట్టి ఎలాంటి ఇబ్బందులూ కలుగకుండా వుంటాయి. వేర్వేరు కులమతాలవారైతే ఆహార, ఆచారపు విషయంలో సర్దుకుపోగలగాలి.

2) **అనన్య పూర్వాయాం** : ఇంతకు మునుపు ఏ వ్యక్తితోనూ శారీరకంగా గాని, మానసికంగా గాని ఎలాంటి లైంగిక సంబంధాలు లేనివారై వుండాలి.

3) **శాస్త్రతో అధిగతాయాం** : శాస్త్రోక్తంగా కుటుంబ పెద్దల సమక్షంలో అందరి ఆమోదంతో పెళ్ళి జరగాలి. అది కళ్యాణమయంగా వుంటుంది!

4) **ధర్మాఽర్థః** : పెద్దల ఆమోదంతో పెళ్లి జరిగితే అది ధర్మబద్ధంగా వుంటుంది. అందువలన అందరి సహకారమూ లభిస్తుంది. తనకు ఎవరూ అక్కరలేదనుకునే వాళ్ళు స్వతంత్రంగా రిస్క్ తీసుకొని పెళ్ళిళ్ళకు తలపడతారు. అందరూ కావాలని, అందరి ఆమోదంతోనే ఇదంతా జరగాలనీ కోరుకునే వారు ప్రశాంత జీవనాన్ని పొందగలుగుతారు.

5) **పుత్రాః** : అలాంటి పెద్దల ఆమోదం వలన పుట్టే సంతానం విషయంలో కూడా ఎలాంటి ఇబ్బందులూ కలగకుంటాయి. కుల మతాలకు అధిక ప్రాధాన్యత ఇస్తున్న ఈనాటి సామాజిక వ్యవస్థలో పుట్టబోయే పిల్లల భవిష్యత గురించి కూడా ఆలోచించిన తర్వాతనే పెద్దల్ని ఎదిరించే నిర్ణయాన్ని చెయ్యగలగాలి!

6) **సంబంధం** : ఇలాంటి వాళ్ళకి సమాజంతో సత్సంబంధాలు నెలకొంటాయి.

7) **పక్ష వృద్ధి** : ఇలా దంపతులైన వారివలన వంశవృద్ధి కలుగుతుంది.

8) **అనుపస్కృతా రతిశ్చ** : ఇలాంటి ఆమోదయోగ్యులైన దంపతుల మధ్య జరిగే రతిని "కల్మషంలేని రతి"గా చెప్తాడు వాత్స్యాయనుడు.

ఇలా అనంగానే పూర్తిగా వాత్స్యాయనుడి భావాల్ని అర్థం చేసుకోకుండా ఆయన్నొక ఛాందసవాదిగా, ప్రేమ వివాహాలకు వ్యతిరేకిగా ముద్రవేయకండి. ఆయన చాలా స్పష్టంగా కొన్ని విషయాలు వేల సంవత్సరాలనాడే పేర్కొన్నాడు....

1) మనుషులు ప్రేమించిన వివాహాలు చేసుకోరాదని ఆయన ఎక్కడా నిర్దేశించలేదు.

2) ప్రేమను నివారించలేనంత బంధం స్త్రీ పురుషులిద్దరి మధ్య ఏర్పడితే, ఆ ఇద్దరినీ పెళ్ళి చేసుకోవద్దని కూడా వాత్స్యాయనుడు వారించలేదు.

3) పెద్దలు కుదిర్చిన వివాహంలో కన్నా, స్వయంగా ఎంచుకొని, అందరిని ఎదిరించి చేసుకున్న వివాహాల్లో "రిస్క్" ఎలా వుంటుందో సూచించాడు.

4) అలా రిస్క్ తీసుకోవడానికి సిద్ధపడ్డవాళ్ళే ప్రేమవివాహాలు చేసుకోవాలి గానీ, అనాలోచితంగా నిర్ణయాలు తీసుకొని, ఆ తర్వాత "పశ్చాత్తాపాలు", "విచారించడాలు" రాకూడదన్నాడు. సమస్యల్ని ఎలా ఎదుర్కోవాలో స్పష్టంగా నిర్ణయించుకున్నాకే తల్లిదండ్రుల్నీ పెద్దల్నీ ఎదిరించడానికి సాహసించమంటాడు.

5) ప్రేమ వివాహం అయినంత మాత్రాన పెద్దలు గుడ్డిగా వ్యతిరేకించవలసిన అవసరం లేదు. ఇరుపక్షాల పెద్దల్ని అంగీకరింపచేసుకొని కోరుకున్న వ్యక్తిని పెళ్ళాడగలగడంలో వున్న నేర్పు, చాకచక్యం గుడ్డిగా ఎదిరించే వారిలో వుండదు! అలాంటి చాకచక్యమే వుంటే, సామాజికంగానూ శారీరకంగా కూడా ఎక్కువ సుఖాన్ని పొందగలుగారు.

**వివాహేతర సంబంధాలు**

స్త్రీ గానీ, పురుషుడు గానీ పరాయి వ్యక్తులతో సంబంధాలు ఏర్పరచుకోవడానికి అన్ని సందర్భాల్లోనూ ఇంట్లో సుఖం తక్కువగా వుండడమే కారణం కావాలని లేదు. ఎవరైనా ఎవరితోనైనా లైంగిక సంబంధం కలుపుకోన్నారంటే, ఆ పరిస్థితులు, అందుకు అనుకూలతలూ, ఆ యిద్దరి మానసిక స్థితి, వాళ్ళ స్వభావం... ఇలాంటి కారణాలెన్నో కన్పిస్తాయి.

స్త్రీ పురుషులు - ఇది ధర్మం, అధర్మం అని ఆలోచించకుండా, అజ్ఞాన స్వభావం చేత ఒంటరిగా పొందతగిన వ్యక్తి తారసపడ్డప్పుడు సంగమింప గోరతారు. ఇది మానవ సహజ లక్షణం. ఎవరు ఎవరితో ఎంత తిరిగారో తెలియజెప్పే స్పీడోమీటర్లుండవు. ఎవరికి వారికి వారి అంతరాత్మే సాక్షి! ఇందుకు ఆడవారు మినహాయింపేమీ కాదు. అక్రమ సంబంధాలు మగాళ్ళు మాత్రమే పెట్టుకొంటారనడం తప్పు. ఆ అక్రమ సంబంధాలు పెట్టుకొనేది స్త్రీలతోనే కదా... కాబట్టి ఇద్దరూ సమాన బాధ్యులే!

స్త్రీల విషయం గురించి వాత్స్యాయన మహర్షి ముందుగా కొన్ని వివరాలు చెప్తున్నాడు -

వంటరిగా, అన్ని విధాలా అనుకూలంగా వున్న సందర్భాల్లో మనసుకు నచ్చిన వ్యక్తి తారసపడ్డప్పుడు సంగమించాలనే కోరిక స్త్రీలకూ కలగవచ్చు. కానీ, ఆ మగవాడి

మానసిక స్థితి తెలుసుకోకుండా తొందరపడితే తనమీద నిందపడ్తుంది. కాబట్టి సాధారణంగా ఆమె బైటకు తన కోర్కెని వ్యక్తం కానివ్వకపోవచ్చు. ఇలాంటి స్థితి నిజానికి మానసిక దోషమే! కానీ, "శీలం" అనే భావన స్త్రీని బాగా కట్టిపడేస్తుంది మన దేశంలో! ఈ భావనే లేకపోతే ఈ దేశంలో వివాహ వ్యవస్థ ఎప్పుడో కుప్పకూలి వుండేది.

అందుకనే ఆ పురుషుడితో సంగమించాలనే కోరిక ఎంత బలంగా వున్నా, అతను అందుకు ఎంత ప్రేరేపించినా ఒక్కోసారి ఆమె విముఖురాలు అవుతుంది! అలాంటప్పుడు స్వాధీనం చేసుకోవడానికి చేసే ప్రయత్నాలన్నీ చేస్తూ ఆమెను ప్రేరేపించి, నమ్మించి, ఒప్పించగలగాలి. అప్పుడు గానీ, ఆమె అంగీకారం తెలపకపోవచ్చు.

ఇటువంటి భావనే పురుషులకూ వుంటుంది. వనిత తనంత తావలచివచ్చిన అవకాశాలుకూడా అనేకసార్లు అతనికి కలగవచ్చు. కానీ, ధర్మానికీ, పెద్దల ఆచారానికి, ఒక్కోసారి ఎయిడ్స్ వంటి వ్యాధులకు భయపడి కూడా పురుషుడు ఆ పరాయి స్త్రీతో సంగమించడానికి ఇష్టపడకపోవచ్చు.

ఒక్కో మగాడు తన ఇంట్లో సుఖం తగినంత దొరక్కపోతే కదా బైట స్త్రీతో ఈ సంబంధం పెట్టుకోవాలి... అనుకొని ఆ పరాయి స్త్రీతో సంబంధాన్ని తిరస్కరించవచ్చు.

మగాడిలో వరూధిని అన్నట్లు సులభంగా తనంతతాను సిద్ధం అయిన స్త్రీని నిర్లక్ష్యం చెయ్యడం, తేలికగా లభ్యం కాని స్త్రీ కోసం వెంపర్లాడడం అనే లక్షణాలు సహజంగా వుంటాయి. అందుకు అనుగుణంగా స్త్రీ ప్రవర్తించవలసి వుంటుంది.

స్త్రీలు పరాయి మగాడితో సంబంధాన్ని పెట్టుకోకుండా నీతిగా వుండటానికి అనేక కారణాలు చెప్పాడు మహర్షి.

1) వ్యభిచార మనస్తత్వం లేకపోవడం.
2) తన భర్తమీద గాఢమైన అనురాగం, నమ్మకం.
3) తన పిల్లలు పవిత్రంగా వుండాలనే భావన.
4) తన శీలం మీద ఎలాంటి మచ్చ పడకూడదనే గట్టి నిర్ణయం.
5) ఇంతకాలం సుఖాన్ని బాగానే పొందాను... ఇప్పుడెందుకీ తుచ్ఛ వ్యవహారాలనే విరక్తి.
6) తను నమ్మిన వారంతా వదిలిపోయారనే దుఃఖం.
7) మగవాళ్ళ మీద సహజంగా వుండే ఏహ్యాభావం, మగాళ్ళంతా దుర్మార్గులేననే పురుష ద్వేషం.
8) తన భర్తతో ఏనాడూ ఎడబాటు లేకుండా కలిసి జీవించడం.
9) తన వంటి నిజాయితీ పరురాల్ని ఇంత హీనంగా కోరుకొంటాడా ... అనే కోపం.

10) ఇలాంటి వాడితో సంబంధం ఎప్పటికైనా ప్రమాదం అనే భయం.
11) పెద్దగా ఆ పరాయి మగాడిమీద మోజు కలగకపోవడం.
12) వీడు తన రహస్యాన్ని దాచిపెట్టలేడనే అనుమానం
13) ఇవ్వాళ వుండి రేపు వెళ్ళిపోయేవాడితో సంబంధం వలన ఉపయోగం లేదనే భావన.
14) స్నేహితుల ప్రేరణ వలన వచ్చినవాడు కావడం.
15) అతను హింసా స్వభావం కల్గిన వ్యక్తి కావడం.
16) అతను తిరుగుబోతు కావడం.
17) తనకన్నా ఎక్కువ సమర్థుడు, తాను అతన్ని తగినంతగా సంతోషపెట్టలేకపోవచ్చు - అంతటి సమర్థుడి జోలికి దేనికీ - అనుకోవడం.
18) ఊళ్ళో పెద్దమనిషి - నలుగురిలో "పెద్ద"గా తిరిగేవాడు. ఈ రెండు నిమిషాల భాగ్యానికి అతని చరిత్రకు మచ్చతేవడం దేనికనుకోవడం.
19) శత్రురూపంలోని వాణ్ణి నమ్మి దగ్గరకు తీయకూడదనే భావన.
20) తనకు తగిన జోడికాదని ఈసడింపు.
21) తాగి పడుకోవడమే తప్ప చేసేదేమీ వుండదని అతనిపైన చులకన భావం.
22) సమీప బంధువు కావడం.
23) బైటపడితే జీవితమే నరకం అవుతుందునే భయం.
24) తన శీలాన్ని పరీక్షించుకోవడం కోసం భర్తే ఇతన్ని ఈ విధంగా పంపివుండవచ్చనే అనుమానం.
25) పవిత్రమైన తన చరిత్రని ఈ తుచ్ఛుడికోసం భస్మం చేసుకోవడం దేనికీ ... అనే ధర్మబుద్ధి.

ఇలాంటి అనేక కారణాలు స్త్రీలను పతివ్రతలుగా నిలుపుతున్నాయి.

### ఆడవాళ్ళ మెప్పు పొందగలగటం

కామశాస్త్ర రహస్యం బాగా ఎరిగినవాడు ఎలాంటి స్త్రీనైనా వశం చేసుకోగలుగుతాడు. ఎక్కువగా కథలు, జోకులూ హాస్య ప్రసంగాలు చెయ్యగలవాడు ఆడవాళ్ళని తేలికగా నమ్మించి బురిడీ కొట్టించగల్గుతాడు. తరచూ ఆ యింటికి రాకపోకలు జరపగలిగే వాడికి ఈ అవకాశం ఎక్కువగా వుంటుంది.

ఆ స్త్రీ చెప్పే పనులు చేసిపెడుతూ అవసరానికి సాయపడేలా ప్రవర్తించేవాడికి ఎప్పుడైనా ఆ స్త్రీ వశం అయ్యే అవకాశం వుంది.

ఔచిత్యం గమనించి మాట్లాడేవాణ్ణి స్త్రీ త్వరగా నమ్ముతుంది. ఆమె ఇష్టాలు తెలుసుకొని తదనుగుణంగా నడుచుకునే వాణ్ణి త్వరగా స్త్రీ ఇష్టపడ్తుంది. తనకిష్టమైన

వస్తువుని, చాలా కాలంగా కావాలనుకుంటున్నదాన్ని అతను ఆమెకు సమకూర్చిపెట్టినప్పుడు ఆమె సహజంగానే మనసులోనైనా ఇష్టపడే అవకాశం వుంది.

అందగాడికి పరాయి స్త్రీలతో పొందు అవకాశాలు ఎక్కువగా వుంటాయి. ఎక్కువమంది తేలికగా దొరుకుతారు.

పొరుగువంతులు, రచయితలు, కళాకారులకు స్త్రీలు త్వరగా వశం అవుతారు.

చేతి సాయంగా వున్నంత మాత్రాన ఒక ఆడది ఆ మగవాణ్ణి అనుమతిస్తుందనుకోనవసరంలేదు. "వాడు చెంచాగాడు" అనుకొంటే మాత్రం అలాంటి చెంచాగిరీ చేసే బానిస మనస్తత్వం వున్నవాణ్ణి ఎలాంటి స్త్రీ అయినా, మూటలు మోసేవాడిగానే చూస్తుంది గానీ, తన పక్కన చోటివ్వలేదు.

**స్త్రీల మనసెరిగి నడుచుకోవాలి ... ఇలా!**

పురుషుడు ఎన్నోరకాలుగా ప్రయత్నిస్తుంటాడు. ఎక్కడెక్కడికో చేతులు పోనిచ్చి ఏవేవో తడుముతుంటాడు. అయినా కొందరు స్త్రీలు తొణకరు. ఏమాత్రం ప్రతిస్పందించరు.

అంతమాత్రాన ఆమెకు స్త్రీ సహజమైన స్పందన లేదనో, ఆమెకు ఈ పనులంటే ఇష్టంలేదనో, ఆమెకు తనమీద విశ్వాసం కలగలేదనో అనుకొంటే తొందరబాటే అవుతుంది. అలాగని తొందరపడి ఏదో చేసెయ్యాలనుకోవడం గ్రహపాటే అవుతుంది.

తాను సంగమిస్తున్న స్త్రీ మానసిక ప్రవృత్తి ఎలాంటిదో పరీక్షించి సరిగ్గా అంచనా వేయగలగాలి. కొందరు ఆడవాళ్ళు పురుషుడు చేసే చేష్టలన్నింటినీ సహిస్తాను. చెయ్యనిస్తారు. కానీ ఏమీ ప్రతిస్పందిచరు. అనుకూలతన చూపించరు. అన్నీ దూరంగా నిలబడి పైపైన చేయడమే నన్నట్లుంటారు. నడుం నుంచి పై భాగం వరకే... అన్నట్లు ప్రవర్తిస్తారు. ఇలాంటి వాళ్ళ పట్ల చాలా సహనం వహించాలి.

ఇంక లాభంలేదని ఆమెను వదిలేసి దూరంగా వచ్చేశాడనుకోండి... అలాంటప్పుడు ఒక్కోస్త్రీ స్వాధీనం అయ్యే అవకాశం వుంది. ఎలాగంటే, మనుషులకు సహజమైన చంచలత్వం వుంటుంది కదా... అందువలన పరిచయం దూరం అయ్యేకొద్దీ మళ్ళీ పరిచయం పెంచుకోవడం కోసం వాళ్ళే ప్రయత్నిస్తుంటారు. "ఎక్కడా కన్పించడంలేదే ఈ మధ్య" అని పలకరిస్తారు. ఈ పలకరింపులో చుట్టూ వినేవారికి ఏ అర్థమూ కన్పించకపోయినా అతనికి మాత్రం ఒక సందేశం వెడ్తుంది... ఈ సారి స్వాధీనం అవుతానని!

ఒక్కో స్త్రీ కౌగిలింతకు ఒప్పుకొంటుంది. ముద్దూ మురిపాలన్నింటికీ ఒప్పుకొంటుంది. కానీ, భగ లింగ సంయోగానికి మాత్రం ఒప్పుకోదు. అలాగని అతని మీద నమ్మకం, ప్రేమ లేవనికాదు. ఏకాంతంలో కలుసుకొంటుంది. అన్ని

రకాలుగానూ అతన్ని రెచ్చగొట్టి తాను రెచ్చిపోతుంది. సంభోగం పట్ల ఆమెకు కొన్ని అనుమానాలుండి ఉండవచ్చు. వాటివలన ఆమె సంభోగాన్ని తప్ప తక్కిన వాటినన్నింటినీ కోరుకొంటోందన్నమాట. ఆమె అనుమానాలు, భయాల్ని అతను పోగొట్టి స్వాధీనం చేసుకోగలగాలి. మనసెరిగి ప్రవర్తించడం అంటే అది!

అన్నింటినీ అంగీకరించి తీరా చివరికి సంభోగం దాకా వచ్చేసరికి ఒక్కసారి కోపంగానూ, కఠినంగానూ ప్రవర్తిస్తారు. అలాంటప్పుడు మగవాడు కూడా కోపాన్ని ప్రదర్శించకుండా సహనం పట్టి అనునయించడం, ఆమె ప్రేమను తిరిగి పొందేందుకు ప్రయత్నించడం చేసి అప్పుడు వశం చేసుకోగలగాలి.

కొంతమంది స్త్రీలు ఒక్కోసారి ఎంతో దగ్గరగానూ, ఒక్కోసారి ఎంతో దూరంగానూ ప్రవర్తిస్తారు. ఒక్కోసారి అతనెవరో తెలియదన్నట్టే వుంటారు. ఒక్కోసారి అతను కన్పించకపోతే వుండలేనంతగా ప్రవర్తిస్తారు. వాళ్ళ మనసు ఊగిసలాటలో వుందనీ, మనసులో కోరికని బలంగా అణచిపెట్టుకోవడానికే ఇలా ప్రవర్తిస్తుంటారనీ అర్థం చేసుకోవాలి. ఆమె "దూరం"గా ప్రవర్తించినా విడవకుండా ఏదో వంకతో ఆమెను పలకరిస్తూ సాధ్యమైనంత దగ్గరగా వుండేందుకు ప్రయత్నించాలి. ఏదో ఒక రోజుకు ఆమె మనస్ఫూర్తిగా అతనికి వశం అయి తీరుతుంది!

అతనికోసం ఆమె ప్రయత్నించినప్పుడు ఆమె మొదటి సైగకే అతని స్వాధీనం అవుతుంది. ఆమెకోసం అతను ప్రయత్నించినప్పుడు ఆమె మానసికంగా పూర్తిగా సిద్ధపడే వరకూ సహనం వహిస్తుంది. ఈ సహనాన్ని ఆమెను కోరుతున్న మగవాడు అంచనా వేయగలగాలి. అందుకనుగుణంగా ప్రవర్తించాలి. స్త్రీల మనసెరిగి ప్రవర్తించడం అంటే ఇది!

**ఒక్కడే భర్త - ఒక్కతే భార్య**

భార్యాభర్తలు ఒకరికొకరు ఎలా ప్రవర్తించాలి...?

స్త్రీ పురుషుడి పట్ల వ్యవహరించవలసిన తీరు - పురుషుడు స్త్రీ పట్ల వ్యవహరించవలసిన తీరు... ఇవి నిశితంగా చర్చించవలసిన విషయాలే.

వాత్స్యాయనుడు ఈ విషయాల్ని సీరియస్‌గానే ప్రస్తావించాడు.

పెళ్ళయిన ఆడవాళ్ళు రెండురకాలుగా వుంటారు. 1) ఏకచారిణి : మనసా, వాచా, కర్మణా ఒక్కరినే భర్తగా భావించుకొని అతనితోటే జీవితం అనుకొని భర్తతో కలిసి జీవించే స్త్రీ ఏకచారిణి. 2) ఏక పత్నిక : తన భర్తకు తానొక్కతే భార్య అయివుండి సవితిపోరు లేకుండా అనురాగంతో భర్తతో కలిసి జీవించే స్త్రీ.

బహుచారిణులు, సపత్నికలూ వీరికి వ్యతిరేకంగా మసలుకొంటూ వుంటారు. అనేక మంది పురుషులతో సంబంధాలున్న స్త్రీ గురించి అలా వుంచితే, అనేక మంది

స్త్రీలతో సంబంధం వున్న పురుషుడి భార్య ఎలా ప్రవర్తించాలో కూడా వాత్స్యాయనుడు ప్రస్తావించాడు. చిన్న ఇల్లు, ఉంపుడుగత్తె, రెండోభార్య ఇలాంటి భార్య కాని భార్య హోదాలకు కొందరు స్త్రీలు అంగీకరించడం ధర్మకామాలను వదిలి "అర్థం" కోసమేననేది స్పష్టం!

19వ శతాబ్దం వరకూ కొద్దిపాటి స్థితిమంతులైన పురుషులు అనేక పెళ్ళిళ్ళు చేసుకోవడం మనవాళ్ళకు అలవాటుగా వున్న విషయమే! బహుభార్యాత్వాన్ని హిందూ చట్టాలు వ్యతిరేకిస్తున్నా, ఇప్పటికీ చిన్నిల్లు, పెద్దిల్లు సాంప్రదాయాలు చాలా మంది విషయంలో మనం చూస్తూనే వున్నాం. చాలామంది ఆడవాళ్ళు తమ భర్తలకు రెండో పెళ్ళాలని తెలిసి ఆశ్చర్యపోతుంటాం!

"భార్యా ఏకచారిణీ గూఢ విస్రంభాదేవ వత్పతి మానుకూల్యేన వర్తేత!" అని వాత్స్యాయనుడు పేర్కొన్న సూత్రానికి అర్థం భర్తపైన నిర్మలమైన ప్రేమ గల్గిన స్త్రీ అతనికి అనుకూలమైన రీతిలో వర్తిస్తుందనీ, అతనిమీద ఆమెది "గూఢ విస్రంభం" అంటే రహస్య ప్రేమగా వుంటుందని అన్నాడు. అదే విషయం ఏకచారుడైన భర్తకీ వర్తిస్తుంది. నీతి నియమాలు, కట్టుబాట్లు స్త్రీలకు మాత్రమే వుంటాయని అర్థం కాదు. అనేకమంది స్త్రీలతో సంబంధాలున్న భర్త పట్ల ఇలాంటి నిగూఢ ప్రేమ స్త్రీకి వుండాల్సిన అవసరం లేదు. వుండదు కూడా!

స్త్రీ పురుషులిద్దరూ ఒకరిపట్ల ఒకరు ప్రేమను పరస్పరం పెంపొందించుకునేలా ప్రవర్తించాలనేదే వాత్సాయనుడు చెప్పిన దాని సారాంశం!

నీతి, నిజాయితి అనేవి స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా వుండాలి! – కామశాస్త్రం చెప్పే నీతి ఇదే. ధర్మార్థ కామాలు మూడింటికి దణ్ణం పెట్టి సంసార జీవితంలోకి ప్రవేశించాలి ఎవరైనా!

# లైంగికావసరాలు : పురుషాధిక్యత

**- శాస్త్రి (జహీరాబాద్)**

**ప్ర : సెక్సులో మగాళ్ళదే పై చేయి అంతేనంటారా?**

మనసు లోపల్లోపల్లో కెళ్ళి తరచి చూస్తే, లైంగికపరమైన దృష్టి మగవాళ్ళలోనూ ఆడవాళ్ళలోనూ వేర్వేరుగా ఉండటాన్ని గమనించవచ్చు. మగాళ్ళ ఆలోచనలు తేనె పుచ్చుకునే తుమ్మెదలాగానూ, ఆడవాళ్ల ఆలోచనలు తేనె నిచ్చే పువ్వులాగానూ ఉంటాయి. పశుపక్ష్యాదుల్లోనైనా అంతే! మనుషుల్లోనైనా అంతే! మీరన్నది పూర్తి వాస్తవం కాదు. ఆడది ఇచ్చేది, మగాడు పుచ్చుకునేవాడు అనే అభిప్రాయం చాలామందిలో వుంది.

లైంగికత విషయంలో ప్రదాతగా వ్యవహరిస్తుంది స్త్రీ! ఆమెది ఇచ్చే చెయ్యి!

పురుషుడు తాను విధాతననుకుంటాడు. కాని ఆచరణలో అతనిది పుచ్చుకునే చెయ్యే! పురుషుల సెక్సు దృష్టి స్త్రీలకన్నా చాలా బలంగా ఉంటుంది. కానీ స్త్రీల దృక్పథం సూది పెట్టి గుచ్చినా దిగనంత గట్టిగా ఉంటుంది. స్త్రీల లైంగికతలో ఉద్వేగ సంబంధాలు (emotional connections) సామాజిక సాంస్కృతిక పరమైన అంశాల (social and cultural factors) ప్రాబల్యం పురుషుడికన్నా ఎక్కువగా ఉంటుంది.

సంబంధం ఉన్నా లేకున్నా పురుషుడి ఆలోచనల్లో సెక్సు పాలు ఎక్కువగా ఉంటుంది. అరవై యేళ్ళ లోపు మగాళ్లలో సెక్సు ఆలోచన రోజుకు ఒకట్రెండు సార్లయినా ఉంటుంది. మహిళల్లో ఇంత తరచూ సెక్సు గురించిన ఆలోచన రాదని ఎనభైశాతం మంది ఆడవాళ్ళు చెప్పినట్టు ఒక సర్వే నివేదిస్తోంది.

సినిమాల్లో డ్రీమ్ సీన్, లగాయిత్తు వేసుకోవటం లాంటి పేర్లతో చూపించే ఫాంటసీలు స్త్రీలకు తక్కువగా కలుగుతుంటాయని కూడా ఈ సర్వే చెప్తోంది. Roy Baumeister అనే సామాజిక మానసవేత్త ఫ్లోరిడా విశ్వవిద్యాలయం ద్వారా నిర్వహించిన ఈ సర్వేలో పురుషుడు చాలా త్వరగా లైంగిక ఉద్వేగానికి లోనౌతాడనీ స్త్రీలు ఎంతో ఉద్రేకపరిస్తే గానీ అంత ఉద్వేగాన్ని పొందరనీ తేలింది. ఎక్కువ సెక్సు భాగస్వామ్యం కోసం, ఎక్కువ సెక్సు భాగస్వాముల కోసం మగాడి మనసు ఎక్కువ ఆరాటపడుతుందని ఈ సర్వేలో ఉటంకించారు. స్త్రీలు సాధారణ రతి (casual sex) కి ప్రాధాన్యత నిస్తారట! రతికోసం ఎంతదాకానైనా వెళ్ళటం చట్ట వ్యతిరేకమైనదని తెల్సినా తెగించటం మగాళ్లలో ఎక్కువగా ఉంటుందట!

వందమంది సాధు సన్యాసుల్లో 62% పురోహితులు అమెరికన్ వ్యవస్థలో తమకు రహస్య లైంగిక జీవితం ఉన్నదని అంగీకరించారట. సన్యాసినులుగా మారిన స్త్రీలలో (nuns) 49% కూడా ఇదే విషయాన్ని అంగీకరించారట! కృత్రిమ పద్ధతుల్లో స్వీయ సుఖానుభవాన్ని నలభై శాతం స్త్రీలు తాము ఆచరిస్తున్నట్టు తెలియ చేశారంటుంది ఈ సర్వే! బహుశా ఈ సంఖ్య భారతదేశంలో స్వల్పంగా ఉండవచ్చు. స్త్రీలకు మడుగు, మరుగు, ఏకాంతము మన కుటుంబ వ్యవస్థలో తక్కువ కాబట్టి!

పుంశ్చలీ అంటే చవకబారు వ్యభిచారిణి స్త్రీలలో కొందరు జారవృత్తి (Prostitution) మీద జీవించటానికి పురుషుడే కారకుడౌతున్నాడు. అతి కాముకతని తీర్చుకోవటానికి, మగాళ్ళు ఎందరైనా చాలని స్త్రీలే వ్యభిచారిణులుగా మారారనటం నిజం కాదు. పెళ్ళి చేసుకోరా అంటే కట్నం అడిగే మగాడు ఎదురు డబ్బిచ్చి వేశ్యా సంపర్కం పొందుతున్నాడు. పెళ్ళనేది కేవలం తన అవసరమే అన్నట్టు డబ్బిచ్చి మగాడి చేత పెళ్ళాడబడుతోంది స్త్రీ! సెక్సనేది తన అవసరం కాబట్టి, డబ్బిచ్చి వేశ్య ద్వారా సుఖానుభవం పొందాలనుకుంటాడు మగాడు. బహుశా భారత దేశంలోని

ఈ విచిత్ర పరిస్థితి 'రాయ్ బామీష్టర్' గారి సర్వే పరిధిలోకి వచ్చి ఉండదు.

మగాళ్లలో ఇంత సెక్సు యావ ఎక్కువగా ఉండటానికి దారితీస్తున్న శారీరక, మానసిక కారణాలను అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది. ఈతకు సిద్ధమైనప్పుడే స్త్రీ పశువులు యదౌతాయి. పశుబుతువు వచ్చినప్పుడే వాటికి మొగుడు అవసరం ఉంటుంది. ఎదకొచ్చిన ఆవులకు సెక్సనేది సత్సంతానార్థమే గానీ సుఖానుభవం కోసం కాదు. పరిణామ క్రమంలో స్త్రీ జీవులలోని ఈ మౌలిక లక్షణం స్త్రీలలో అంతో ఇంతో ఇంకా కొనసాగుతూనే ఉంది. కావాలనుకున్నప్పుడల్లా కేంద్రీకృతమైన సెక్సురంథి పురుషుల్లో ఉన్నంతగా స్త్రీలలో ఉండదు. ఇలా ఆలోచన రాగానే అలా కోరుకున్న స్త్రీ కౌగిట్లో తాను వాలిపోవాలనే దురాశ మగాళ్లకే ఎక్కువ! స్త్రీ త్వరగా తనను తాను ఉపసంహరించుకోగలుగుతుంది!

ప్రేమించనన్నాడని క్లాసు రూములో ఒక మగాడి పీకని ఎవరైనా ఆడపిల్ల కోసిన సంఘటన జరిగితే, లేదా యాసిడ్ పోసిన సంఘటన జరిగితే సెక్సు రంథి స్త్రీ పురుషుల్లో ఎవరికి ఎక్కువన్నది ఖచ్చితంగా తేల్తుంది. అయినా సెక్సు యావని కొలిచే పరికరాలేం ఉన్నాయి గనక!

మృదువుగా వ్యవహరిస్తే తనను మగాడు కాదంటుందనే అపనమ్మకం, తనకు ఆ ధ్యాస ఎక్కువని చెప్పుకోవాలనే తాపత్రయం, తనదే గెలుపనే ఆధిక్యతా భావం మగాళ్లను ఎక్కువ సెక్సోన్ముఖుల్ని చేస్తుంది. సినిమాలు కూడా అలా ఆలోచించే వాడే మగాడనే అభిప్రాయం కలిగేలా చేస్తున్నాయి. దీని ప్రభావం నూనూగు మీసాలనాడే మగపిల్లల మీద ఉంటోంది. వాళ్ల మనస్తత్వం కూడా అలానే మూసపోసినట్టవుతోంది.

దుష్ట కార్యాలు హీరోలు చేస్తే సరదా అనీ విలన్ చేస్తే నేరం అనీ, తాము చేస్తే తప్పులేదనే భావన పెంచుకుంటున్నారు ఈ కాలపు కుర్రాళ్ళు!

సెక్సనేది సమాన స్థాయిలో ఇచ్చిపుచ్చుకునే ఆట!

ఇద్దరిదీ గెలుపే అయిన యుద్ధమే అసలు యుద్ధం అనే సూక్తి సెక్సుకి పూర్తిగా వర్తిస్తుంది.

సమజోడిని చూడాలనేది అందుకే!

# ఆకర్షణ ప్రేమలూ - అంతలోనే విడాకులు

**ప్ర: కోట్లు ఖర్చు చేసి పెళ్ళి జరుపుతున్నారు. ఏడాదికే విడాకుల కోసం కోర్టులెక్కుతున్నారు. ఈ పరిస్థితికి మనుషుల ఆలోచనా విధానంలో మార్పులు కారణమా?**

ఈ కర్మ భూమిలో, ఈ పుణ్యభూమిలో దేవుడి బొమ్మలకన్నా బూతుబొమ్మ లెక్కువ వ్యాప్తిలో ఉన్నాయి. ఇంకా చాలక భారతమాతను కూడా బూతు బొమ్మను

చేయగలరు. అదేమంటే మనకు కలాపోసన లేదని, మనకీ గొడ్డుకీ తేడా లేదని కూడా అంటారు.

అందం అంటే సెక్సీగా కనిపించటం అనే అర్థం స్థిరపడి పోయింది. అందానికి తూనిక రాళ్ళు చాలా మారిపోయాయి. మగాళ్లకి మోచేతి పైన కండలు తిరిగి ఉండటం, సిక్సుప్యాకులూ, ఆడవాళ్లకి నదుం నుండి కింది భాగం బలిష్టంగా ఉండటం అందం అంటున్నారు. మగాళ్ళు దాదాపుగా స్లీవ్'లెస్ చొక్కాలు ఈ కండల్ని ప్రదర్శించటానికేననీ, ఆడవాళ్ళు మోగాలు పైనుండీ శరీరం కనిపించేలా వస్త్ర ధారణ చేసేది కూడా ఆకర్షింప చేసుకోవటానికే ననే అపప్రథ కలుగుతోంది. ఇందువలన ఆరోగ్యం కోసం అని పైకి అంటారు గానీ జిమ్ముల్లో యువతరం ఎక్కువగా గడిపేది ఈ Visual experience (దృశ్యానందానుభవం) ప్రేరేపించటానికే ననేది బహిరంగ రహస్యమే! ఆ వ్యక్తి Visually attractive అవునా కాదా అనే ముఖ్యంగా చూస్తున్నారిప్పుడు. అదే అందానికి ముఖ్యం కావటంతో కళ్లతోనే ప్రేమలో పడుతున్నారంతా!

అందం, ఆకర్షణలు కేవలం కంటికి సంబంధించిన వ్యవహారం అనుకుంటూన్నారివ్వాళ! ఆ పిల్ల ఎలా నచ్చిందిరా అంటే నా కళ్ళతో చూడమన్నట్టే ఉంటుంది ఇది. ఏ కళ్ళతో చూసిన ఆకళ్ళే (ఆకలికి బహువచనం) కనిపిస్తాయి. ఒకరికి నచ్చకుండా పోయింది వేరొకరికి నచ్చవచ్చు. ఎవరి 'నచ్చటాలు' వారివి!

మనిషికి ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, ఒక ఉభయేంద్రియమైన 'మనసు' - మొత్తం 11 అంగాలున్నాయి. ఇందులో కళ్ళు అనే జ్ఞానేంద్రియంతో మాత్రమే అందాన్ని కొలుస్తున్నారు. మిగిలిన నాలుగు జ్ఞానేంద్రియాలతోనూ, మనసుతోనూ అందానికి ఏమీ సంబంధం లేకపోవటం ఆశ్చర్యం. ప్రేమకు అందం, ఆకర్షణీయతలు పునాది ఈ రోజున!

గాఢంగా ప్రేమించుకుని, అందరినీ ఎదిరించి పెళ్ళి చేసుకుని ఏడాది తిరక్కుండానే విడాకులకు సిద్ధం అయ్యే ప్రేమికులు మన చుట్టూ వేల సంఖ్యలోనే ఉన్నారు. విడిపోక పోయినా పెళ్ళికి ముందున్న గాఢత పెళ్ళయిన కొద్దికాలం తర్వాత మిగిలి ఉండేది కూడా అనుమానమే! ఎందుకని? ప్రేమకు కళ్ళు మాత్రమే కొలబద్ద కావటమా? "ప్రేమజ్ఞానం" పొందటానికి కళ్ళను మాత్రమే ఉపయోగించి తక్కిన జ్ఞానాలన్నింటినీ విస్మరించటమా? అన్ని జ్ఞానాలనూ ఉపయోగించుకుని నిర్మితమైన ప్రేమకీ ఈ "ఏకేంద్రియప్రేమ"కీ తేడా ఉందా?

దాంపత్య జీవితం గురించి మాట్లాడుకునేప్పుడు స్వచ్ఛమైన ప్రేమ, అమలిన శృంగారం, ప్లేటో ప్రేమల్లాంటి సిద్ధాంతాలను తెచ్చి విశ్లేషించనవసరం లేదు. అవి ప్రేమ గీతాలు రాసుకునే కాలంలో పనికొస్తాయి. కానీ, దాంపత్య ప్రేమ కేవలం సెక్సుతో ముడిపడే నడుస్తుంది. ఇది రతి ముందు, రతి చివర అని రెండు దశల్లో ఉంటుంది. తీవ్రమైన ఉత్తేజం కలిగేందుకు కావలసిన క్రియలన్నీ ఇందులోకి వస్తాయి. రతి కార్యం, దాని ముగింపు, రెండో దశలో ఉంటాయి.

అన్ని జ్ఞానాలనూ ఉపయోగించుకున్న ప్రేమ "రతి ముందు దశ"లో గాఢమైన ఉత్తేజాన్ని కలిగిస్తుంది. పంచ జ్ఞానేంద్రియాలూ, పంచకర్మేంద్రియాలూ మనసూ మొత్తం పదకొండు ఇంద్రియాలూ కలిసి రతి కార్యాన్ని విజయవంతం చేస్తాయి. ఏకేంద్రియ ప్రేమలో ఈ గాఢత, ఈ చిక్కదనం, ఈ లోతు, ఈ ఉన్నతి లేకపోవటం వలన అది "రతి ఉత్తేజాన్ని" పొందటంలోనూ, ఉత్తేజాన్ని ఇవ్వటంలోనూ పూర్తిగా విఫలమౌతుంది. ఇంకో అంశం కూడా ఉంది. గాఢమైన ప్రేమ రతి అనంతరం బలపడి మరింత గాఢతరం అవుతుంది. కానీ, ఏకేంద్రియ ప్రేమ ఆ పూట రతితోనే ముగిసిపోతుంది. దాని వలన ఆ ప్రేమలో శాశ్వతత్వం క్రమేణా తగ్గిపోతూ వస్తుంది. తాత్కాలికత్వం పెరిగిపోతుంటుంది. ప్రేమ పెళ్ళిళ్లు కూడా చాలా వరకూ ప్రథమ వివాహ వార్షికోత్సవాలకు నోచుకోవటం లేదంటే ప్రేమ గాఢత లోపించిందనే అర్థం.

పెద్దలు చేసిన పెళ్ళిళ్లలో కూడా ఇలా జరగదనే హామీ ఏమీ లేదు. పెళ్ళిచూపుల్లో కూచోబెట్టగానే అమ్మాయిలూ అబ్బాయిలూ ఒకరిని చూసి ఒకరు ఫ్లాట్ అయిపోతారని పెద్దల ఆశ. 'మా అమ్మాయి ఒకే చేసిందండీ, మీకు ఒకే అయితే ముహూర్తాలు పెట్టుకుందాం రండీ' అని కబురు చేస్తాడు పిల్లతండ్రి. ఆ ఒక్కమాటతో పెళ్ళనే 'నూరేళ్ల పంట' చేతికందివ రావాలని పెద్దలు కోరుకుంటారు. ఏది నచ్చటం వలన ఆ ఇద్దరూ ఫ్లాట్ అయ్యారో, ఒకే చెప్పటానికి కారణమయిన అంశం ఏమిటో చాలా సందర్భాలలో విశ్లేషణ జరగదు. విడాకులు పొందుతున్న చాలా దాంపత్యాలలో పిల్ల తల్లిదండ్రులో పిల్లవాడి తల్లిదండ్రులో ప్రోత్సహించటం ముఖ్య కారణంగా కనిపిస్తుంది. నచ్చ చెప్పే ప్రయత్నాలు తక్కువగా ఉన్నాయి.

"మా అల్లుడు సంసారానికి పనికి రాడండి... అది కప్పి పుచ్చుకోవటానికి ఏదో రకంగా హింస పెట్టి ఏడిపిస్తున్నారు" అనే మాట ఎక్కువ విడాకుల కేసుల్లో వినిపిస్తుంది. విడాకులకు వెళ్లబోయే ముందు మగవాళ్ళు ఈ విషయాన్ని గట్టిగా గుర్తు పెట్టుకోవాలి. వాడికి మగతనం లేదన్నంత తేలిక కాదు, ఆ అమ్మాయికి ఆడతనం లేదనటం! కాబట్టి, విడాకుల వలన ఎక్కువగా నష్టపోయేది మగవాళ్ళే! మొగుడొదిలేశాడనే మాట, పెళ్ళాం వదిలేసిందనే మాట రెండూ అవమానకరమే

కదా! విడాకుల్నే మొదటి అడుగుగా భావించటం ఈ కొత్త యుగంలో ఒక ఫ్యాషన్ అయ్యింది. మితిమీరిన స్వాతిశయం, ఆర్థిక సాధికారికతలు కూడా ఇందుకు కారణాలే! తాత్కాలిక అంశాలను భూతద్దంలోంచి చూసే తత్వాన్ని వదులుకుని ఒక్కక్షణం సర్దుకోగలిగితే సంసార విచ్ఛిత్తి జరగదు.

పెళ్ళికి ఓకే చెప్పబోయే ముందు, ప్రేమలో పడబోయే ముందూ, వివాహానంతర జీవితం గురించి ఆలోచించలేనంత పసితనం ఏమీ కాదుకదా! దేనికైనా వ్యక్తిగత బాధ్యత వహించటానికి సిద్ధపడ్డాకే నిర్ణయాలు తీసుకోవాలి... అది అమ్మానాన్నలు చేసే పెళ్లయినా సరే! పెద్దలు పెళ్ళిళ్ళు చేయగలరు గాని, ఇష్టాయిష్టాలు చెప్తోంది పెళ్ళి చేసుకోమోయే వారే కదా!

"మా అబ్బాయికి సెలవల్లేవండి. వచ్చేవారం వస్తాడు. నాలుగైదు సంబంధాలు పెండింగులో ఉన్నాయి. ఏదో ఒకటి వాడు ఓకే చేస్తే వెంటనే పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతాడు" అనే తల్లితండ్రులు ఎక్కువమంది కనిపిస్తున్నారు. ఇలాంటి హడావిడి పెళ్ళిళ్ళు. హడావిడి శోభనాలు, హడావిడి హనీమూన్లూ, ఆఖరికి హడావిడి విడాకులూ ఇలా గడిచిపోతోంది ఆధునిక దాంపత్య జీవనం.

ఇందులో తల్లిదండ్రుల బాధ్యత కూడా ఉంది. తమ పిల్లల సంసారాలను నిలబెట్టటానికి అన్ని ప్రయత్నాలూ చేయాల్సిన పెద్దవాళ్ళు ఒకింత తమ ధోరణుల్ని పునరాలోచించుకోవాల్సిన అవసరం ఉంది. హడావిడి నిర్ణయాలు నూరేళ్ళ పంటని చేతికి రాకుండానే కోసినట్టవుతుంది.

# పెటాకుల పెళ్ళిళ్ళు

- ఎస్.ఆర్.ఆర్. (నంద్యాల)

**ప్ర : డాక్టరుగారూ! అందరికీ ఆరోగ్యవంతమైన సెక్సు గురించి మీరు వ్రాస్తున్నారు. అది అందుబాటులోకి రావటానికి ప్రజలు, ప్రభుత్వం పూనుకోవాలంటున్నారు. పెళ్ళైన ఏడాదికే విడాకులకు పోతున్న ఈ తరంతో అది సాధ్యం అంటారా?**

సెక్సంటే అన్నీ చేతలే గానీ, మాట్లాడుకోవాలసింది ఏం ఉంటుందని చాలా మంది అనుకుంటారు. వంటయ్యిందా వదినగారూ... అని ఇంటి పక్కనావిడ అడిగినంత తేలిగ్గా సెక్సు గురించి కూడా స్వేచ్ఛగా మాట్లాడుకోగలిగితే సెక్సుపరమైన అనారోగ్యం కలక్కుండా ఉంటుంది. కష్ట సుఖాలు చెప్పుకుని, పరిష్కారాలు పొందే అవకాశం కూడా ఉంటుంది. మీరన్నట్టు పెళ్ళయిన ఏడాదికే విడాకులు కోరాల్సిన పరిస్థితి మన సమాజంలో రావటానికి మితిమీరిన ఆర్థిక స్వేచ్ఛ ఒక కారణంగా

చెప్పారు. కానీ, విడాకులు కోరిన ఆడపిల్లల తరఫువాళ్ళు "వాడసలు మగాడే కాదుటండి..." అనటాన్ని గమనిస్తే, లైంగిక పరమైన అవగాహనా రాహిత్యమే ఎక్కువమందిని విడాకులకు మళ్ళిస్తోందేమోననిపిస్తోంది. నవదంపతుల విడాకులు వ్యక్తిగత అంశం కాకుండా, ఒక సామాజిక సమస్యగా మారుతోందని మేధావులు గమనించాలి. దానికి పరిష్కారాలు వెదకాలి. తల్లిదండ్రుల ప్రవర్తన కూడా కొంతవరకూ కారణమే! "నీకు ఏ మాత్రం నచ్చకపోయినా వెంటనే వచ్చేయమ్మా! మేం చూసుకుంటాం" అంటున్నారు గానీ, సర్దిచెప్పి, తగిన సూచనలిచ్చి సంసారాన్ని కుదుటపరచాలని చూడట్లేదు.

లైంగికపరమైన అసంతృప్తి మనిషిని అధఃపాతాళానికి తీసుకెడుతుంది. అసంతృప్తిని తొలగించేందుకు కావలసిన శాస్త్రీయమైన యంత్రాంగం వైద్యపరంగా అందుబాటులోకి రావాలి. సెక్సు బాధల్ని మనుషులు నోరు తెరిచి అతి సన్నిహితులకు కూడా చెప్పుకోలేరు. పూర్వం రోజుల్లో స్త్రీలు గుడ్లనీళ్ళు కుక్కుకుని మౌనంగా భరించేవాళ్ళు. ఇప్పుడు బరస్టై, విడాకులంటున్నారు. సమస్యని పరిష్కరించాలని కోరుకోకపోవటం ప్రధాన సమస్య అయ్యింది.

అందరికీ సెక్సు ఆరోగ్యం ఒక ప్రాథమిక హక్కు అయినప్పుడే కొన్ని సమస్యలకు పరిష్కారాలు దొరుకుతాయని భావిస్తాను. ఇది నాలుగు పొడిమాటల్లో తేల్చేది కాదు. మనం మరింత లోతుగా చర్చ చేయాల్సి ఉంది.

# నడివయసు దంపతుల లైంగిక సమస్యలు

- సిద్ధ రామయ్య (ఖమ్మం)

**ప్ర : మిడిల్ ఏజ్‌లో సెక్సు ధ్యాస ఎక్కువ - ఓపిక తక్కువగా వ్ఁటుందా? పరిష్కారాలు చెప్పండి సారు?**

మగాళ్ళు కొందరు మృగాళ్ళుగా వ్యవహరించటం వలన మగాళ్ళకు సెక్సు యావ ఎక్కువనే ఒక ముద్ర పడిపోయింది. కానీ వాస్తవం అందుకు భిన్నంగా ఉంది. ప్రతి ఐదుగురు మగాళ్ళలోనూ ఒకరికి సెక్సు కుతి చాలా తక్కువగా ఉంటుందని పరిశోధనలు చెప్తున్నాయి. అంటే రమారమీ 20% మంది మగాళ్ళు లైంగిక పరమైన ఆసక్తి, శక్తి తక్కువగా ఉండటం అనే ఒక సమస్యతో బాధపడ్తున్నారన్నమాట! ఎన్నో ప్రాపంచిక విషయాలలో ఎంతో చలాకీగా ఉండే మగాళ్ళు కూడా సెక్సు విషయానికొచ్చే సరికి అనాసక్తిని ప్రదర్శించేవాళ్ళున్నారు.

లైంగిక ఆసక్తిని లిబిడో అంటారు. లిబిడో స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా ఉన్నప్పుడే అది సమరతి అవుతుంది. ఇంట్లో వాతావరణం, పిల్లలకు ప్రత్యేకమైన

పడకగది లేకపోవటం, భార్యా భర్తల్లో ఒకరికి అనారోగ్యం, కంట్రోల్లో లేని షుగరు వ్యాధి, గుండె జబ్బా, సరిగ్గా మూడ్ తెచ్చుకునే సమయానికి ఇంట్లో ఎవరో ఒకరు ఒంట్లో బాగోక మూలగటం, ఆర్థిక సమస్యలు త్వరగా పూర్తి చేయాల్సిన పనుల వత్తిడి, ఆఫీసులో వ్యతిరేక పరిస్థితులు, చుట్టూ అనుకూలత లేని మనుషులు, ప్రణాళికలేని జీవిత విధానం. ఎక్కువగా కారాలూ, పచ్చళ్ళు తిని భుక్తాయాసంతో బాధపడటం... ఇవన్నీ నడివయసు దంపతుల్లో లైంగిక ఆసక్తిని తగ్గించే అంశాలౌతాయి.

లిబిడో పుష్కలంగా ఉన్నప్పుడు ఆ మనిషి మనసు సంతృప్తితో నిండిపోయి ఉంటుంది. లిబిడో అనేది వ్యక్తి కార్యదక్షత. పనితీరుల్ని మెరుగు పరుస్తుంది. ఫలితంగా వ్యక్తుల కెరీరు పెరుగుతుంది. స్త్రీ పురుషులిద్దరికీ వర్తించే సూత్రం ఇది.

అలాగని బ్రహ్మచర్యం పాటించేవారికి నిర్వహణా సామర్థ్యం ఉండదనుకోకూడదు. మనో నిగ్రహం వలన కోరికలు అణచి వేయబడి, అది మానసిక శక్తిగా పరిణామం చెందుతుంది. అంటే, ఆరోగ్యవంతమైన రీతిలో కోరికను సంతృప్తి పరచుకున్నా మానసిక శక్తి పెరుగుతుంది. లేదా జితేంద్రియతతో కోరికను నిగ్రహించుకున్నా మనసు శక్తివంతమైనదౌతుంది.

కోరికను తీర్చుకోనూ లేక, ఆపుకోనూ లేక మానసిక ఘర్షణకు లోనైన వారిలో లైంగిక సమర్థత దెబ్బ తింటుంది. పాతికేళ్ళ నవ యువతీ యువకులైనా, నడివయసు దంపతులకైనా ఇదే సూత్రం వర్తిస్తుంది. నిగ్రహించుకోనటం అణచుకోవటం కూడా ఆరోగ్యవంతంగా ఉండాలనేదే ఇందులో సారాంశం.

సెక్సు సమర్థత దానికదే పుట్టుకొచ్చే అంశం కాదు. అది మనసు వలన ప్రేరేపించబడ్తోంది. ఆ మనసు ఆరోగ్యవంతంగా ఉన్నప్పుడు ఆరోగ్యవంతమైన సెక్సు ప్రేరణలు కలుగుతాయి. లిబిడో బలంగా ఉండాలంటే ఈ పరిస్థితులన్నీ అనుకూలించాలి.

దాదాపు 30% మంది భార్యలు తమ భర్తలకన్నా తమకు లైంగిక ఆసక్తి - లిబిడో ఎక్కువని భావిస్తున్నారని ఒక పరిశీలనలో తేలింది. దంపతుల్లో పురుషుల వయసు ఎక్కువగా ఉండటం మన సామాజిక వ్యవస్థలో సహజం కాబట్టి, త్వరగా లైంగిక జీవితంలోంచి రిటైరయ్యే పరిస్థితి భార్యలకన్నా భర్తలకు ఎక్కువగా ఉంటుంది. వయోధర్మం ఇందుకు ఒక కారణం. దీన్ని హైపో యాక్టివ్ సెక్సువల్ డిజైర్ (HASD) అంటారు. హైపో అంటే తక్కువగా ఉంటం. లైంగికోత్తేజనం తక్కువగా ఉండే స్థితి ఇది. కొంతమందికి ఒక్కోసారి అత్యంత ఎక్కువ లైంగికోత్తేజం కలగటం. ఒక్కోసారి తక్కువగా కలగటం కూడా ఉంటూ ఉంటుంది. అమావాస్య, పౌర్ణమీలాగా

వ్యవహరిస్తూ ఉంటారు. దానికి మానసిక కారణాలే ముఖ్యమైనవిగా చెప్పుకోవచ్చు. షుగరూ, బీపీ, స్థూలకాయం, కొన్ని రకాల మందుల వాడకం కూడా ఈ పరిస్థితి తీసుకురావచ్చు. అమావాస్య, పౌర్ణమీ లాగా వ్యవహరించటానిక్కూడా శరీరంలో హార్మోన్ల ప్రభావం కారణం అవుతూ ఉండొచ్చు.

టెస్టోస్టిరోన్ అనే హార్మోను స్త్రీ పురుషులిద్దరిలోనూ లైంగిక వాంఛను కలిగించే ఒక ప్రేరకం! తక్కువ స్థాయిలో టెస్టోస్టిరోన్ ఉత్పత్తి జరుగుతున్నప్పుడు లిబిడో కూడా తక్కువ స్థాయిలోనే ఉంటుంది. కొన్ని రకాల దీర్ఘవ్యాధులకు వాడే మందులు కూడా ఈ పరిస్థితికి కారణం కావచ్చు. థైరాయిడ్ గ్రంధి లోపం ఉన్న వారిలోనూ, ప్రొలాక్టిన్ అనే హార్మోను అధికంగా ఉత్పత్తి అవుతున్న వారిలోనూ లైంగికోత్తేజం పాలు తక్కువగానే ఉంటుంది ఎప్పుడో ఒకరోజు, తన శక్తులన్నీ కూడా గట్టుకున్నట్టుగా సెక్సులో విజయం సాధిస్తూ ఉంటారు. లేనప్పుడు ఇవ్వాళ కాదులే అన్నట్టుగా అటు తిరిగి పడుకుంటూ ఉంటారు. నడివయసు దంపతుల లైంగిక జీవితంలో ఇలాంటి సన్నివేశాలే ఎక్కువగా ఉంటాయి.

పార్కిన్సోనిజం అనే వణుకు వ్యాధిలో డోపమైన్ రసాయనాన్ని వాడిస్తారు. ఈ డొపమైన్ మెదడు నుండి జననాంగాలకు లైంగికోత్తేజకర సమాచారాన్ని చేరవేస్తున్నట్టు గమనించారు. డోపమైన్ లిబిడోని పెంచేదిగా పనిచేస్తుంది. ఆయుర్వేద శాస్త్రంలో ఈ డోపమైన్ రసాయనం మెదడులో తయారు అయ్యేలా చేసేందుకు దూలగొండి మొక్క విత్తనాలతో చేసిన ఔషధాలను వాడిస్తారు. ఈ దూలగొండి విత్తనాలకు అటు డోపమైన్'ని ఉత్తేజం చేసే గుణంతో పాటు, లైంగికోత్తేజాన్ని కలిగించే గుణం కూడా ఉందని ఆయుర్వేద గ్రంథాల్లో ఉంది. వానరీ కల్పం అనేది లిబిడోను పెంచే గొప్ప ఔషధంగా చెప్పడం జరిగింది. ఇది ఆయుర్వేద మందులషాపుల్లో దొరుకుతుంది. పార్కిన్'సోనిజం వ్యాధి ఉన్నవారు మాత్రమే కాదు, నడి వయసుకు చేరిన దంపతులు అందరూ ఈ వానరీ కల్పాన్ని వాడుకుంటూ ఉంటే లైంగికోత్తేజం సమస్యలు ఉత్పన్నం కాకుండా ఉంటాయి.

అల్ప లైంగిక వాంఛ (Low sexual desire) అనేది అనేక కారణాల వలన నడివయసులో ఏర్పడే ఒక దాంపత్య సమస్య దీన్ని యుక్తిగా పరిష్కరించుకోవాలి. మనసు లోంచి ఆందోళనలను పక్కకు తప్పించగలగాలి, అనుకూల వాతావరణాన్ని ఇంట్లో సృష్టించుకునే ప్రయత్నం చెయ్యాలి. పిల్లల కోసం పడక గది విడిగా ఉండాలి. తమ పడకగది అలంకారం కూడా ఉత్తేజకరంగా తీర్చిదిద్దాలి. మనసా వాచా కర్మణా నిర్మలంగా ఉన్నప్పుడు విజయవంతమైన కార్యంగా అది ముగుస్తుంది.

డిప్రెషన్, టెన్షన్ లాంటి వ్యాధుల్లో వ్యాధి సగం లైంగిక శక్తిని చంపేదయితే దానికి వాడే మందులు ఆ మిగతా సగాన్నీ చంపేవిగా ఉంటాయి. అధిక రక్తపోటుకు వాడే మందులు, పేగుపూతకు వాడే మందులు కూడా లైంగిక ఆసక్తిని చంపుతాయి. నడివయసు మగాళ్లలో లైంగిక శక్తి తగ్గిపోవటానికి ఆల్కహాల్ ముఖ్య కారణం కూడా!

లైంగిక ఆసక్తి వేరు, ఆసక్తి కలిగినప్పుడు అంగస్తంభనాదులు కలగటం వేరు. అంగస్తంభనాదులు బాగానే ఉన్నాయి కానీ, అసలైన ఆ ఆసక్తి (లిబిడో) అనేదే కలగటం లేదనే వాళ్ళు ఎక్కువ. "బలమైన కోరిక కలిగితే చాలు, ఆ తరువాత నాకు ఎలాంటి సమస్యా రావటం లేదు. చక్కగా స్తంభన కలుగుతోంది. సంతృప్తి కలుగుతోంది. స్ఖలనం కూడా సక్రమంగానే అవుతోంది" అంటుంటారు మరి కొంతమంది అనాసక్తి అనేది నపుంసకత్వం కాదు. 'ఇప్పుడు కాదులే...' అనే నిర్లప్త ధోరణి ఏర్పడటానికి మానసిక అంశాలే ప్రముఖంగా కారణం అవుతున్నాయి. మనసుని దిటవు పరచుకోవటానికి వ్యక్తి ప్రయత్నించటమే ఇందుకు పరిష్కారం.

నడివయసు దంపతులు అనుకూల వాతావరణాన్ని కుటుంబంలో కల్పించుకుంటూ, నొవ్వక నొప్పించక అన్నట్టుగా వ్యవహరిస్తూ, మనసుని లైంగికత మీదే నిలుపుకుని రతికి తలపడితే స్త్రీకైనా పురుషుడికైనా దాంపత్య సుఖం అవలీలగా దక్కుతుంది.

"ఓపిక లేదు" అనే మాట అన్ని కార్యాలకూ వర్తిస్తుంది. లైంగిక కార్యాలకూ మరీ వర్తిస్తుంది. ఓపిక అంటే ఓపగలిగే శక్తి. అది పుష్కలంగా ఉన్నప్పుడే లైంగిక పరమైన ఆసక్తి బలంగా ఉంటుంది. ఆసక్తి అంటేనే లైంగికశక్తి బలంగా ఉండేది.

యవ్వనంలో ఉన్నంత శక్తి వయసు పెరుగుతున్న కొద్దీ ఉండకపోవచ్చు. కానీ వయసు పెరిగినప్పటి అనుభూతి యవ్వన కాలంలో ఉండదేమో... కొత్తగా పనిలో చేరినవాడు బండరాయిని అమాంతం ఎత్తేయాలని చూస్తాడు, బాగా పనిమంతుడయ్యాక సులువుగా దాన్ని పైకి లేపటం గురించి ఆలోచిస్తాడు, ఓపిక ఉండటం ఒక్కటే సరిపోదు, దాన్నీ ఉపయోగించుకునే చాకచక్యం కూడా కావాలి. లైంగిక శ్రమ విషయంలో ఇది మరీ వర్తిస్తుంది.

పదహారేళ్ళ పడుచుకన్నా ముప్పయ్యేళ్ళ ప్రౌఢకు లైంగిక ఆసక్తి, శక్తీ, అనురక్తీ, ఆనందం, అనుభూతి ఎక్కువగా ఉంటాయి. కానీ, యవ్వన కాలంలో ధ్యాస, యావ ఉన్నంతగా క్రియ ఉండదు. పడుచు దనం రైలుబండికి ఇంధనం ఇస్తోంది వయసు కాదు, మనసు, అది బలంగా ఉండాలి. మనో ఇంధనం పుష్కలంగా ఉంటే పాత రైలు కూడా ఉరుకులు పరుగులు తీస్తుంది.

సెక్సుపరమైన ఓపిక అనేది శరీరపరమైన, మానసికమైన ఓపికలు రెండింటికీ సంబంధించింది. ఒంట్లో ఓపిక ఘనంగా ఉంటే మనసు కూడా తగ్గట్టుగా వ్యవహరిస్తుంది. ఒంట్లో ఓపిక పెంచుకుంటే సెక్సు ఓపిక దానికదే వస్తుందనేది తాత్పర్యం.

ఓపికని నిర్ధారించే పరీక్షలేవీ లేవు. ఎవరి మనస్సాక్షి వారికి తెలియ చెప్పాల్సిందే! నాకిప్పుడు ఓపిక లేదని భార్యగానీ భర్తగానీ అన్నప్పుడు నిరూపించే యంత్రాంగం ఏదీ లేదు. ఓపికని తెచ్చిపెట్టి చర్యలు తీసుకోవటం ఒక్కటే పరిష్కారం. ఓపిక శరీరంలోంచి పుట్టేది కాదు, మనసులోంచే పుడుతుంది. శరీరంతో ఏ శ్రమా చెయ్యకపోయినా మానసిక శ్రమ ఎక్కువగా ఉంటే, ఓపిక లేకుండా పోతుంటుంది.

గ్లూకోజు కణం ఆక్సిజన్‌తో జరిపే రసాయన చర్యని ఆక్సిడేషన్ అంటారు. ఆక్సిడేషన్ వలన గ్లూకోజులోంచి శక్తిపుడుతోంది. ఈ ఆక్సిడేషన్ ప్రక్రియ మందగించటం (Slow oxidation) వలన శక్తి ఉత్పత్తి మదగిస్తుంది. గుండుసూది మొన మోపినంత మేరక్కూడా శరీరానికి శక్తి సరఫరా జరగాలి. ఉత్పత్తి మందగిస్తే సరఫరా కూడా మందగిస్తుంది. దాని ప్రభావం జననాంగాల పైనా, వాటిని ప్రేరేపించే మనసు మీద కూడా ప్రసరిస్తుంది.

ఒక్కోసారి ఈ ఆక్సిడేషన్ మరీ ఎక్కువ వేగంగా జరుగుతుంది. అలాంటప్పుడు సెక్సు యావ మితిమీరిపోతుంది. పెచ్చు మీరిన ఈ స్థితిని 'రిరంస' అంటారు. ఈ అతి, మితుల్ని కూడా సరిచెయ్యాల్సి ఉంటుంది.

శరీరానికి కావలసిన ఖనిజాలు, లవణాలు కూడా తగినంతగా అందనప్పుడు మనిషికి శోష వస్తుంది. పొటాషియం సోడియం సమతుల్యత తగ్గిపోవటం లాంటి కారణాల వలన శోష వచ్చినప్పుడు రంబా, ఊర్వశులో, నలకూబరులో వచ్చినా ప్రయోజనం లేకపోవచ్చు. ఎలెక్ట్రాల్ లాంటి సమీకృత ద్రావణం ఓ గ్లాసుడు తాగితే సరిపోయే దానికి రంభా ఊర్వసులు దిగి రావాల్సిన అవసరంలేదు.

ఆహారంలో రంగులు, సీసం, ఇంకా అనేక రకాల కల్తీలు కలిసిన విషపదార్థాలు ఎక్కువగా తిన్నప్పుడు మొదటగా దెబ్బ తగిలేది లైంగికతపైనే! రంగులు కలిసిన బూందీలు, కేకులు, అప్పడాలు, వడియాలు, వగైరా ద్రవ్యాలను మోజుకొద్దీ తింటూ లైంగిక సుఖం కావాలంటే కుదరదు.

స్త్రీలలో గర్భాశయ దోషాలు, మూత్రంలో మంట, జననాంగ వ్యాధులు, ఫైబ్రాయిడ్లవంటివి, అలాగే పురుషుల్లో ప్రోస్టేట్ గ్రంథిలో వాపుల్లాంటివీ అతిగా ఏర్పడుతున్నాయంటే, ఈ రంగు తిళ్ళూ, కల్తీలు కల్సిన ఆహార పదార్థాల వలన కలిగే విషదోషాలే ముఖ్యకారణం. జాగ్రత్త పడకపోవటం వలన అసలుకే మోసం వస్తుంది కదా!

ఆయుర్వేద శాస్త్రంలో స్వర్ణవంగం, వంగం, నాగం అభ్రకం, తామ్రం లాంటి ఖనిజాలు కలిసిన రసౌషధాలు లైంగిక శక్తిని పెంపొందించేవి వాటిని అనేకం పేర్కొన్నారు. ఆధునిక వైద్యం కూడా జింకు, కాపర్, మెర్క్యురీలకు లైంగిక శక్తిని పెంచే గుణం ఉందని చెప్తోంది. క్యాల్షియం నిలవలు శరీరంలో తక్కువగా ఉన్నప్పుడు ఎముకలు గుల్ల అవటమే కాదు, లైంగికత కూడా డొల్ల అవుతుంది, వయసు పెరుగుతున్న కొద్దీ శరీరంలో ఈ విధమైన లోపాలు పెరిగిపోతుంటాయి. అందువలన లైంగికత మందగిస్తుంది. ఆయుర్వేద శాస్త్రం ఈ విషయంలో ఆధునిక వైద్యానికన్నా ఎంతో ముందుంది. ఇప్పుడు ఉన్నన్ని రోగ నిర్ధారణ పరీక్షలేవీ లేకపోయినా, సెక్సు సమర్థత పెంపు గురించి ఇప్పటికన్నా ఎక్కువే చర్చిందని చెప్పవచ్చు. ఆయుర్వేదం మీద వ్యతిరేకతని వదిలేసి, శాస్త్ర పరమైన విషయాలను ఆకళింపు చేసుకున్నందు వలన లోకానికి మేలు కలుగుతుంది.

మెనోపాజ్ వచ్చే సమయానికి హార్మోన్ల ప్రభావం వలన ఎక్కువమంది ఆడవాళ్లలో లైంగిక ఆసక్తి తగ్గిపోతుంటుంది. పురుషుల్లో తెలియకుండానే ప్రోస్టేట్ గ్రంథి దెబ్బతినటం ప్రారంభం అవుతుంది. దాని ప్రభావం లైంగికతను కూడా దెబ్బతీస్తుంది. షుగరూ, బీపీ, గుండెజబ్బులే కాదు, వాటికి వాడే చాలా ఔషధాలు కూడా లైంగికతని దెబ్బతీసేవి ఉన్నాయి.

ఓపిక అంటే ఇన్ని విషయాలు పరిశీలించవలసి ఉంటుంది.

వైద్యుణ్ణి సంప్రదించినప్పుడు ఓపిక తగ్గిపోతోందండీ అని ఒకే మాటలో అనేక సమస్యల్ని చెప్పుకోవాలనుకుంటాడు రోగి. ఓపిక అనేది అన్నింటికీ సంబంధించిన విషయం. అన్ని శక్తులూ, అన్ని ఆసక్తులూ కలిస్తేనే సెక్సు పరమైన ఓపిక సిద్ధిస్తుంది.

# సంసార బలం

- ప్రసాద్ జె.కె (ధర్మవరం)

**ప్ర : సెక్సు లేకపోతే అది సంసారం కాదా? సంసారంలో సంతోషం కేవలం సెక్సుతోనే ముడిపడి వున్నదా?**

“రైతు తన పొలానికి పోయి తన పని చేసుకోవటం ఎవరో మెచ్చుకుని బహుమతులిస్తారని కాదు. అలాగే ఇంకెవరికో మేలు చేయటానికి తానొక్కణ్ణే కష్టపడ్తున్నానని కూడా అనుకోడు. శ్రమించి పండించటం అతని సహజ ప్రవృత్తి అందుకు తగ్గట్టుగా తన అవసరం కొద్దీ తన పని తాను చేసుకుంటాడు. ఒక నావికుడు సముద్రయానానికి బయలు దేరేది కూడా తన వృత్తి ధర్మాన్ని, తన ప్రవృత్తి ధర్మాన్నీ, తన వ్యావృత్తి ధర్మాన్నీ తాను నెరవేర్చుకోవటానికే గానీ, వేరొకరి మెప్పు కోసం కాదు...” అంటాడు లియో టాల్‌స్టాయ్

ఒక కుటుంబీకుడు కూడా అంతే! ఎవరి మెచ్చుకోళ్ళ కోసమో సంసారం చేయడం లేదు. ఎవరో ఉత్తమసంసారి పురస్కారం ఇస్తారని పోటీపడి, అష్టకష్టాలు పడి సంసార బాధ్యతలు నెత్తిన వేసుకోవటం లేదు. సంఘంలో ఒక జీవి సంఘానికి అనుగుణంగా నడుచుకోవటం సంఘజీవి అయిన మనిషి సహజ ప్రవృత్తి! పెళ్ళి కోసం ఆరాటపడేది, సెక్సు కోసం మాత్రమే కాదు. ఆ తరువాత తగిలే సమస్త సంసార లంపటాలన్నింటికీ సిద్ధపడే పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. కాబట్టి, ఎవరి సంసారం వాళ్ళు చేసుకోవటం ఎవరి ఊపిరి వాళ్ళు తీసుకోవటంలా, ఎవరి ఆకలి వాళ్ళు తీర్చుకోవటంలా భావించాలే గానీ, అందులో లోకం కోసం చేసే త్యాగం ఏమీ లేదు.

సంసార జీవనం అంటే, తన తాతముత్తాతలు చేసింది తానూ చేయటమే! రేపు తన బిడ్డలూ ఇలానే చేయాలని కోరుకుంటాడు. అదే మానవ సహజ ప్రవృత్తి. ఆ ప్రవృత్తిని కలిగించింది సమాజమే! మనుషులు సమాజంగా ఏర్పడిన నాటి నుండీ ఈ సహజ ప్రవృత్తి అనేది ఉంది. స్త్రీ పురుషులు వంటరిగా కాకుండా సమూహంగా జీవించటానికే ఈ సృష్టి జరిగింది. స్త్రీ పురుష జంటల సమూహమే సమాజం. ప్రేమతో కూడిన సెక్సు ఆ జంటల్ని సంసారం వైపు నడుపుతుంది. సంసారం, సమాజం వైపు నడుపుతుంది. ఇవన్నీ వాటికవిగా జరిగిపోయే అంశాలు. ప్రేమ అనేది కేవలం సెక్సు పిలుపు కాదు. ప్రేమనేది వంటరి తనం నుండి తనను తాను బయట పడేసుకోవటానికి మనిషి పడే తాపత్రయంగా చెప్పుకోవచ్చు. ప్రకృతి మనిషిని వంటరిగా జీవించాలని సృష్టించలేదు. కలిసి జీవించటం అనేది మనిషి ప్రకృతి. అందుకు ప్రేమతో కూడిన సెక్సు ఒక ప్రేరకం.

సెక్సు ఉన్నంత మాత్రాన సంసారం ఉన్నట్టు కాదు. సంసారం ఉన్నంత మాత్రాన సెక్సు ఉండే తీరాలని లేదు. భార్యాభర్తలు వేర్వేరు ఊళ్ళలో ఉంటున్నప్పుడు సెక్సు లేదు. సంసారం ఉంది. భార్యాభర్తలు వయో ధర్మం రీత్యా సెక్సు ఆపేసినా సంసారం ఉంది. సెక్సనేది సంసారానికి పునాదే గానీ, అదే అసలైన భవనం కాదు. స్త్రీ పురుషుల్ని కలిపి ఉంచేది సంసారమే గానీ సెక్సు కాదు. సంసార బంధాన్ని పెంచటానికి సెక్సు అనేది పులిహారలో జీడిపప్పులాంటి ఒక ఆకర్షణ మాత్రమే! ఆకర్షణ కోసం ప్రేమని కోల్పోతే, బహుశా అంతకన్నా విలువైనది కోల్పోయేందుకు ఇంకొకటి ఉండదు.

సంసారానికి వ్యతిరేక పదం వ్యభిచారం. రెండింటికీ సెక్సే ప్రధానం. రెండూ స్వకీయ ఆనందానికే గానీ, వేరొకరి మెప్పు కోసం జరిపేవి కాదు. నూరుగురు స్త్రీలను ఏకకాలంలో రమించగల దిట్ట అని ఎవరూ బిరుదులు ఇవ్వరు. కాబట్టి,

స్వచ్ఛమైన సెక్సు స్వచ్ఛమైన సామాజిక బంధానికి గుర్తుగా నిలబడుతుంది. దాన్ని నీచంగా ఆచరించటం నీచంగానీ, సెక్సు నీచం కాదు. మగాడు ఎలాగైనా బతికేయగలడు కాబట్టి పెళ్ళి అవసరం, సెక్సు అవసరం ఆడాళ్లకే ఉన్నదనే భావన ప్రపంచ వ్యాప్తంగా ఉన్నదే! పెళ్ళి చేసుకోవటం ద్వారా భార్య కోసం తాను చాలా ఉదారంగా వ్యవహరిస్తున్నాననే భావన మగాళ్ళలో బాగా ఉంటుంది. కొందరు స్త్రీల క్కూడా ఇలా ఉండొచ్చు. ఇటీవలి కాలంలో ఈ ధోరణి కొంచెం పెరిగినట్టే కనిపిస్తోంది. సంసార సంబంధాలను తుచ్ఛమైన విషయాలంటూ టీవీల్లో ప్రవచనాలు చెప్పె వారిలో హాయిగా సంసారం చేసుకుంటున్న వాళ్ళే ఎక్కువ మంది. దాంపత్య పవిత్రతకు వ్యతిరేక ప్రచారం సమాజ ప్రవృత్తులను వ్యతిరేకించటమే అవుతుంది.

సెక్సు వ్యతిరేకతను ఎవరో కొందరు సన్యాసులకు పరిమితం చేయకుండా మొత్తం సమాజపరం చేయటానికి ప్రయత్నించి నందువలన బౌద్ధం తన మూల స్వరూపాన్ని కోల్పోవలసి వచ్చిందని విశ్లేషకులు చెప్తారు. చివరికి బౌద్ధ స్తూపాలు, బౌద్ధ కేంద్రాలూ పాడుబడి, 'లంజలదిబ్బలు'గా ముద్రపడ్డాయి. కాబట్టి, సృష్టి సహజ ప్రవృత్తికి వ్యతిరేకంగా మనిషిని మార్చాలనుకోవటం కన్నా, ఆ సహజ ప్రవృత్తిలో గౌరవనీయతను పెంపొందించేందుకు ప్రయత్నిస్తే, సమాజానికి మేలు కలుగుతుంది.

సెక్సుకు పరమావధి సత్సంతానమే నని ఆయుర్వేద శాస్త్రం చెప్తుంది. ఇప్పుడు జపాన్ వాళ్ళు ఈ సిద్ధాంతాన్ని పాటిస్తున్నారు. బహుశా బౌద్ధ ప్రభావం ఇందుకు కొంత కారణం కావచ్చు. ఈ వార్త వెలువడిన వెంటనే అమెరికన్ మీడియా "జపానులో పెరుగుతున్న నపుంసకుల సంఖ్య" అని ప్రచారం ప్రారంభించింది. తూర్పు దేశాలసంస్కృతిని వక్రీకరించి ప్రచారం చేయటమే అమెరికన్ మేధావుల లక్ష్యం. దాని ప్రభావం నేటి తెలుగు ఇళ్ళలో బాగా కనిపిస్తోంది. ఆర్థిక స్వేచ్ఛ ఉన్న యువతీ యువకులు స్వచ్ఛ సంసారాన్ని ఇష్టపడకపోవటం వలనే దాంపత్య విచ్ఛిత్తి ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

కోట్లు ఖర్చు పెట్టి పెళ్ళిళ్లు చేసుకుని, ఏడాది తిరక్కుండానే, విడాకులకు పోతున్న నవదంపతులు ఈ రోజుల్లో దాదాపు 30-40% కనిపిస్తున్నారు. వాళ్ళలో కొందరితో మాట్లాడితే ఒకరికోసం ఒకరు అనవసర త్యాగాలు చేస్తున్నామనే భావన బాగా కనిపించింది. ఇదే రీతిలో వీళ్ళని కన్న అమ్మానాన్నలు కూడా అనుకుని ఉంటే, వీళ్ళకు ఈ హోదా ఎక్కడి నుండి వచ్చేది? రానున్నది యువతరం నిండిన భారతదేశం అంటున్నారు. యువతలో పెడ ఆలోచనల గురించి చర్చించి దారిన పెట్టకపోతే, దేశానికి చెడు జరుగుతుంది.

అహంకార పూరితంగా, ఆవేశ కావేషాలకు లోనై సంసార బంధాలను చేజేతులా చెడగొట్టుకునే యువతీ యువకుల వలన రేపటి నవభారత నిర్మాణానికి కలిగే మేలు ఏమీ ఉండదు. బలమైన సంసార బంధం ఉన్న సమాజం దేశానికి పనికొచ్చే సంతతిని ఇస్తుంది.

# సంసారాలు కుదట పరిచే సహాకర సంఘాలు

- వై.కె.దేవి (సికిందరాబాద్)

**ప్ర : దాంపత్య జీవితం కుదురుగా లేని వాళ్ళకు మంచి చెప్పి సరిచేసే సంఘాలున్నాయా?**

"మీ భార్యాభర్త లిద్దరూ విడిపోవాలని భావిస్తున్నారా? మా సహాయం తీసుకోండి!"

"విడిపోబోయే ముందు ఒక్కక్షణం ఆగి మమ్మల్ని సంప్రదించండి!"

"మీ సంబంధాలు చెడిపోయాయనే నిర్ణయానికి మీరువచ్చేశారా? మా సంస్థసహకారం మీకు అవసరంకావచ్చు"

"మీ సంబంధాలు మెరుగు పరుచుకునే విషయంలో మా సహకారం కావాలంటే సంప్రదించండి" ఇలాంటివాణిజ్య ప్రకటనలు చూశారా? మన దేశంలో కూడా వీటి అవసరం రాబోతోంది. ముత్యాలముగ్గు సినిమాలో కాంట్రాక్టరు లాగా కొంపలు కూల్చే వ్యక్తులు, వ్యవస్థలు మన చుట్టూ బాగానే ఉన్నాయి. అలాంటివి కాకుండా కాపురాలను నిలబెట్టే బలమైన వ్యవస్థ ఒకటి మానసిక సామాజిక శాస్త్రాల సమన్వయంగా ఏర్పడవలసిన అవసరం ఉంది.

సంసారంలో లుకలుక లొచ్చి, విడివిడిగా జీవించాలనో, లేదా విడాకులు పొందాలనో ఆలోచనలు వస్తున్నప్పుడు, నిజంగా తల్లిలా అండగా నిలబడి కాపురాలను నిలబెట్టే ఒక ఆత్మీయ వ్యవస్థ లేకపోతే, ఆ దంపతులకు కలిగిన పిల్లలు మనోదౌర్భల్యవంతులుగా మారేప్రమాదం గురించి కూడా మనం దృష్టి సారించవలసిన అవసరం ఉంది. రానున్న కాలంలో భారతదేశంలో యువతరం సంఖ్య అధికంగా ఉంటుందన్న నేపథ్యంలో వ్యక్తిత్వం వికసించిన తరం దేశానికి కావలసి ఉంది. కుటుంబ వ్యవస్థని పటిష్టపరచకుండా బలమైన యువత ఎలావస్తుందో ఆలోచించండి!

సంసారాన్ని విడగొట్టుకోవటం అనేది 'నా ఇష్టం' అని అహంకరించి అనవలసింది కాదు! అది కుటుంబవేత్తల సలహాపైన జరగటం ఒక తప్పనిసరి అంశంగా చేస్తే, చిన్న చిన్న విషయాలు చిలికిచిలికి 'హుద్ హుద్' గాలివాన కాకుండా

ఉంటాయి. పదో పాతికో పారేస్తే ఇచ్చే సర్టిఫికేట్ల మీద ఆధారపడకుండా, స్పష్టమైన కౌన్సిలింగ్ తర్వాతే, అన్ని మార్గాల్లోనూ ప్రయత్నించాకే కుటుంబవేత్త విడాకులు తప్ప మార్గాంతరం లేదని తేల్చిన తరువాతే కోర్టులు ఆ విడాకుల కేసును పరిశీలించచే పరిస్థితి రావాలి!

సంసార సంబంధాల సమీక్ష, సమాలోచన, సలహా, సహకారం అన్ని రకాలుగా అందించటం, కుటుంబాన్ని నిలబెట్టటం, పిల్లల భవిష్యత్తు దెబ్బ తినకుండా జాగ్రత్తలు తీసుకోవటం, ఇవన్నీ చేయగలిగిన ఒక సహకారవ్యవస్థని మనం నిర్మంచవల్సిన సమయం ఇది. గ్రామాల స్థాయిలో సహకార ఉద్యమం ఎలా పనిచేస్తుందో ఈ సంసార సహకార వ్యవస్థ కూడా అదే పద్ధతిలో నిర్మితం కావాలి. దంపతులంతా ఇందులో సభ్యులుగాఉండాలి. సంసార సమస్యల్ని సంస్థ పరంగా పరిష్కరించుకోవాలి. ఇది అసాధ్యమైన అంశం ఏమీ కాదు.

పెళ్ళి సమయంలో పెళ్ళి కొడుకుని ఊరేగించటం అంటే దర్పం ప్రదర్శించటానికి కాదు. అది, ఊరెరిగించటానికి! వ్యక్తిగత కుటుంబాలు ఎల్లకాలం వ్యక్తిగతం అనటం సరికాదు! అవి సామాజిక వ్యవస్థలో భాగాలే! తల్లిదండ్రుల నిరాదరణలో పెరిగిన ఒక పిల్లవాడు లోకకంటకుడిగా మారితే, లేదా యాసిడ్ ప్రేమికుడైతే అది సామాజిక సమస్యే అవుతుంది కదా! అతనలా తయారవటానికి బలమైన కుటుంబ వ్యవస్థలో అతను పెరగకపోవటం కారణమైతే ఆ బాధ్యత సమాజానిదే అవుతుంది. నా పెళ్ళాం, నా ఇష్టం, తిడతాను, కొడతాను, అడగటానికి మీరెవరని దబాయించే రోజులకు కాలంచెల్లాలి! అడిగే హక్కున్న వ్యవస్థని మనం నిర్మించాలి!

పరస్పరం గొడవలు పడే భార్యాభర్త లిరువురూ నేరం ఎదుటి వారిదిగానే భావిస్తారు. మొగుడూ పెళ్ళాల విషయంలో తలదూర్చి తీర్పులు ఇవ్వటానికి ఎవరూ సాహిసించరు. అందుకనే, నిపుణులతోనూ, పెద్దలతోనూ, సంసార సలహా కేంద్రాలు నెలకొల్పి, వారి సలహాకు కట్టుబడి ఉండేలా గట్టి ఉత్తర్వులు ఉన్నప్పుడు కుటుంబ వ్యవస్థలో స్వచ్ఛభారతం వికసిస్తుంది.

ఇద్దర్నీ ఎదురూబొదురూ కూర్చోబెట్టి స్వేచ్ఛగా సమస్యల్ని చెప్పుకోమంటే రెండుమూడు సార్లు మాట్లాడాక ఆ ఇద్దరి స్వరాల్లోనూ కాఠిన్యం క్రమేణా తగ్గుతుంది. ఒక దశలో ఈ తప్పులు సవరించుకుంటామని వారంత వారే అనే పరిస్థితి వస్తుంది. వడ్లగింజలో బియ్యపుగింజల్లాంటి విషయాలను భూతద్దంలోంచి చూసే మనస్తత్వం వలన ఎక్కువ సంసార సమస్యలు ఏర్పడుతున్నాయి. ఒక్కోసారి మానసిక వైద్యుల సహాసంప్రదింపులు, గట్టి కౌన్సిలింగ్ కూడా అవసరం కావచ్చు!

ఏమైనా ఆ సంసారాన్ని నిలబెట్టటం, అపోహలు తొలగించటం, అనుమానాలు నివృత్తిచేయటం, బాధ్యతలు గుర్తుచేయటం చేసేందుకు "సంసార సహకార కేంద్రాలు" ఏర్పడాల్సిన అవసరం ఉందన్నది వాస్తవం.

భార్యాభర్తలిద్దరూ ఒకరంటే ఒకరు అన్యోన్యంగా, ప్రేమగా ఎందుకుండాలంటే, పుట్టేపిల్లలకు ప్రేమనుపంచటానికి! తల్లిదండ్రుల ప్రేమను పంచుకుని ఎదిగే హక్కు పిల్లలకుంది. తల్లిదండ్రులు విడిపోయినప్పటికీ వారిద్దరి ఉమ్మడి ప్రేమపిల్లలకు దక్కాల్సిన అవసరం ఉంది. గాంధీగిరి లాగే దీన్ని కూడా 'అమ్మానాన్నగిరి' అనాలి.

'Shared parenting', 'equal parenting', 'involved parenting', 'co-operative parenting', 'parallel parenting' ఇలా రకరకాల పేర్లతో 'అమ్మానాన్నగిరి'ని పిలుస్తుంటారు. విడాకులు పొందినంతమాత్రాన ఆ బిడ్డకు అమ్మానాన్నల ప్రేమ దక్కకపోవటాన్ని శిక్షార్హంగా పరిగణించాల్సి ఉంది. బిడ్డల సంరక్షణలో అమ్మానాన్నల సమాన పాత్రగురించి మనం మాట్లాడుకోవాల్సి ఉంది. ఇలాంటివి ఎక్కడైనా ఒకటో అరో పట్టణాల్లో వుండొచ్చు. మీరన్నట్లు ప్రతి వూళ్లోనూ ఈ సంసార సహకార సంఘాలు ఏర్పడటం అవసరం.

# గృహహింసకు ఎడంకాలి దెబ్బ!

**జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన**
**ర్చు లతాంతాయుధు కన్న తండ్రి శిరమచ్చో, వామ పాదంబునన్**
**దొలగం దోచె లతాంగి యట్లె యగు నాథుల్ నేరముల్ సేయ, బే**
**రలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే?**

ఒకప్పుడు, భార్యలకు కోపం వస్తే, తలగడ మంత్రం చదివేవాళ్ళట! అంటె, మంచం ఎక్కి పడుకుని ముఖం మీద తలగడ అడ్డపెట్టుకుని తనకి జరిగిన అన్యాయాన్ని ఏకరువు పెడ్తూ ప్రదర్శించే అలుక. సాధారణంగా పడగ్గది ఇందుకు అనుకూలంగా ఉంటుంది. ప్రేమనైనా కోపాన్నైనా ఈ గదిలోనే ప్రదర్శించాల్సి ఉంటుంది. కోపం ప్రదర్శిమ్పుతానికైతా ఇదే కోపగృహం. ప్రేమకైతే ఇదే శృంగార మందిరం. కోపం కూడా శృంగారంలో ఒక భాగమేనని కదా వాత్స్యాయనుడు చెప్పింది...!

కృష్ణుడు సత్యభామని వెదుక్కొంటూ పడగ్గదిలోకి వెళ్ళినప్పుడు అతనికి అయిపోయింది, జరగ బోయేది రాగుంజు పోగుంజులాట అని! భార్యాభర్తల మధ్య కీచులాట వచ్చినప్పుడు భార్యలు తలగడ మంత్రం చదివితే, దాన్ని భర్తలు పెద్దగా పట్టించుకోక పోవచ్చు. కానీ, భర్తలు తప్పు చేసి ఆ రహస్యాలన్నీ భార్యలకు తెలిసిపోయి దొరికిపోయినప్పుడు, ఆ భర్త ఎంతటి వాడైనా పాదాక్రాంతుడు కాక తప్పదు.

పారిజాతాపహరణం కథలో ప్రత్యేకత ఇది! భార్య తప్పుచేసిందనే అనుమానంతో అగ్నిప్రవేశం చేయించటం, శిలవైపోమ్మని శపించటం లాంటి కథలు పురాణాల్లో చాలా చదివాం. కానీ, ఇలా తప్పు చేసిన భర్త తన భార్యకు దొరికిపోయి నానా అగచాట్లు పడటం ఎక్కడా కనిపించదు. పారిజాతాపహరణం కావ్యం సాక్షాత్తూ కృష్ణుడికే ఆ పరిస్థితి కల్పించి, మగ పండితులెవ్వరూ నోరెత్తకుండా చేసింది. మగాడు తప్పుచేస్తే, వాడు మగాడిదే ననే సిద్ధాంతాన్ని ప్రకటించిందా కావ్యం. ఇంత గొప్ప ఊహ చేసింది నందితిమ్మన. ప్రథమాశ్వాసంలోనే ఈ పద్యం ఉంది.

**'జలజాతాసనుదు అంటే నీటిలో పుట్టిన పువ్వు(పద్మం)మీద కూర్చుని ప్రకాశించే బ్రహ్మ దేవుడు లాంటి**

**"వాసవాది సురపూజా భాజనంబై తనర్చు" దేవతలుఎప్పుడూ కొలిచేటి**

**"లతాంతాయుధు కన్న తండ్రి"మొక్కల తీగలనే విల్లుగా చేసుకున్న మన్మధుడి కన్నతండ్రి యొక్క**

**"శిరమచ్చో..." అలాంటి మహనీయుడి తలకాయి అయ్యయ్యో..**

**"వామ పాదంబునన్దొలగం దోచె లతాంగి" తన ఎడమకాలితో తొలగేలా పక్కకి తోసిందట ఆ లతాంగి.**

ఎవరా లతాంగీ...? సాక్షాత్తూ సత్యభామ! చూస్తూ చూస్తూ మొగుణ్ణి ముఖం పక్కకు తిరిగేలాగా తోసిందని ఎంతో మర్యాదగా చెప్పాడు తిమ్మన కవి. అంతేగానీ, కాలితో చాచి తన్నిందని వ్రాయలేదు. మగపక్షపాతులైన కవులూ, సినిమా వాళ్ళు జమున లాంటి నటీమణులతో చాచి తన్నినట్టే చూపించారు. తన్నినా, నెట్టినా రెంటికీ పెద్ద తేడా లేకపోయినప్పటికీ ఆ పని చేసింది. తన్నింది ఎడమకాలితో కాబట్టి, అది పెద్ద చర్చనీయాంశం అయ్యింది. నిజానికి చేత్తో కొట్టినా, కాలితో తన్నినా ఒకటే! కానీ, భారతీయులకు కాలు అపవిత్రమైనది. అందులో ఎడమకాలు మరీ అపవిత్రమైంది. ఆ దెబ్బేదో చేత్తో ఒక్కటిస్తే జన్మజన్మాలకూ బుద్ధొచ్చేదేమో. కానీ, ఎడం కాలి ప్రయోగం అనే సరికి మగాళ్ళ మనసు గాయపడింది. మనోభావాలు దెబ్బతిన్నాయి. ఇదా దాంపత్యం అంటే...? ఇదా ప్రేమంటే...? అని కసికొద్దీ తిట్టుకున్నారు నంది తిమ్మనగార్ని! ఒళ్ళు మండితే పదగ్గదులన్నీ నక్సల్'బరీ లౌతాయన్నది హెచ్చరిక!

నందితిమ్మనగారు ఇలాంటి ప్రతిస్పందనలను పట్టించుకోలేదు. సాక్షాత్తూ శ్రీ కృష్ణభగవానుడు ఒక తప్పు చేసి ఏ అర్థరాత్రో పిల్లలా ఇంట్లోకి జొరబడ్డి మెల్లగా నక్కినక్కి వస్తే ఏ ఆడదైనా ఊరుకుంటుందా...? మర్యాదస్తురాలైతే, ఛడామడా కడిగి పారేస్తుంది. చండీరాణి లాంటి దైతే, చేతికి పని చెబుతుంది. కానీ, సత్యభామ రెండూడు చెయ్యదు. ఆవిడ రూటే సెపరేటు.

మంచం మీద బాపూ గారి బొమ్మలాగా వయ్యారంగా పడుకుని ఉన్న ఆ సత్యభామను చూసి, కృష్ణుడు ఆమె కాళ్ళు పుచ్చుకుని ప్రాథేయ పడుతూ 'సత్యా' అని పిలిచాడు. సత్య ఆ గొంతు విని కోపంగా తన కాళ్ళ మీద తలను ఉంచిన కృష్ణుణ్ణి ఆ తలతో సహా ఎడం కాలితో అవతలకు నెట్టేసింది.

"యట్లె యగు నాథుల్ నేరముల్ సేయ" ఇట్లాగే తిక్క కుదరాలి, తప్పుడు పనులు చేసి కొంపకు వచ్చిన మగాళ్లందరికీ... అంటాడు కవి. " బేరలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే?" అలుక బూనిన స్త్రీలు ఉచితానుచితాలు మరిచిపోయి ఆ కోపం మీద ఎవరూ ఏవిటీ అని చూడకుండా చాచి తన్నేస్తారంటాడు. నంది తిమ్మన పూర్తిగా సత్యభామ పక్షమే వహించినట్టు ఈ పద్యంలో కనిపిస్తోంది. కవి ధర్మం కూడా అంతే! "తప్పు చేసినవాడు పరమాత్మ అయితే ఏంటటా...?" అన్నట్టు వ్యవహరించాడు తిమ్మన!

ఇది 16వ శతాబ్దినాటి కథ. దీని వెనుక మహిళా తీవ్రవాదం ఉంది. సమస్యకు పరిష్కారం ఉంది. ఆచరణీయ యోగ్యత ఉంది. లతగారి నవలల్లో ఇలాంటి ముగింపులు చాలా వున్నాయ్యి. వినాయకరావు అనే శాడిస్టు మొగుణ్ణి వీధిలో పడేసి కాళ్ళతో తన్నుకుంటూ వెళ్ళినట్టు 'ఇది తులసివనం' అనే నవలలో వ్రాస్తుందామె! నందితిమ్మన కాలానికే ప్రారంభమైన ఈ మహిళా ఉద్యమాన్ని తరువాతి కాలంలో ఎవ్వరూ కొనసాగించక పోయినా లతగారు చాలా చొరవని ప్రదర్శించింది.

గృహహింసని అదుపు చేయటం చాలా కష్టం. ఎందుకంటే దాని గురించి రిపోర్టు చేయటానికి ఎవరూ ముందుకు రారు కాబట్టి అని ఒక అమెరికన్ రచయిత్రి అమెరికాలో గృహహింస చట్టం అమలుపైన ఒక వ్యాసంలో (difficult to control because difficult to report) వ్రాసింది. భారతదేశంలో ఏ భార్య అయినా పోలీసు స్టేషనులో రిపోర్టిచ్చే సన్నివేశాలు అరుదుగా కనిపిస్తాయి. ఇచ్చినా చర్యలు తీసుకున్న దాఖలాలు కూడా తక్కువే! అందుకే, ఎడంకాలి దెబ్బని మించింది లేదంటాడు నంది తిమ్మన.

## ఫెమినిజమా? ఫెమెనిజమా?

మనది సెక్సిస్ట్ సమాజం! సెక్సిస్ట్ సమాజంలో స్త్రీ ఒక శారీరక వికలాంగి. Female is passive, అనీ, తనకు తానుగా ఏదీ చేయగలిగేది కాదని లోకం భావిస్తుంది. మానవ సంబంధాల పరిధిలో కాకుండా సెక్సుదృష్టితో స్త్రీ పురుష సంబంధాలను పితృస్వామ్య భావజాలం లెక్క కడుతుంది. తరతరాల సంస్కృతిలో భాగంగా సంక్రమిస్తూ వచ్చిన వారసత్వం ఇది మనకి!

స్త్రీకి 'శరీర స్పృహ' కలిగిన క్షణానే, తన శరీరాన్ని మగాడు స్వార్థానికి దుర్వినియోగం చేస్తున్నాడనే ఎరుక కలిగింది. పురుష వ్యతిరేకత, పితృస్వామిక సంస్కృతీ ధిక్కారాలతో కూడిన సాహిత్యానికి అలా బీజాలు పడ్డాయి. స్త్రీవాద సాహిత్యం సమాజ జాగృతిని సాధించ గలిగింది. అది చాప కింద నీరులా కాదు, ఒక వెల్లువెత్తిన సముద్రంలా పురుషాధిక్యత పైన విరుచుకు పడింది. ఉద్యమ స్థాయిలో వ్యాప్తి కావటాన 'స్త్రీవాద ఉద్యమం' బలంగా వ్రేళ్ళునుకుని, మహావృక్షమై ఎదిగింది. ఫలాలు మహిళ లందరికీ దక్కాయి. అన్ని రంగాల్లోనూ స్త్రీలు ఆధిక్యత నిలుపుకో గలుగుతున్నారు. స్త్రీ పురుష వివాదాల్లో మగాడి పక్షాన, చట్టమూ, న్యాయమూ, ధర్మం కూడా నిలబడటం లేదు. ఇది గణనీయమైన మార్పు. తెలుగులో ఎన్నో సాహితీ విప్లవాలొచ్చాయి. కానీ, మహిళావాద సాహిత్యం తెచ్చిన మార్పుని తక్కిన సాహితీ విప్లవ రూపాలు తేలేక పోయాయి!

లైంగిక సమర్థతని పెంచే ఔషధాలను వాజీకరాలని (aphrodisiacs) పిలుస్తారు. 'గుర్రంతో సమానమైన లైంగిక సమర్థతని ఇచ్చేవి' అని దీని అర్థం. అన్నింటికన్నా ఎక్కువ ఉత్తమ 'వాజీకరం' ఏది? అని ఒక ప్రశ్న. మన శాస్త్రాలు 'స్త్రీ' అని ఠక్కున చెప్తున్నాయి. 'ఆడది అంటే లైంగిక కార్యానికి ఉపకరణం...' అనేది దీనిభావం. మగవాణ్ణి రెచ్చగొట్టేందుకూ, సంతృప్తి పరచేందుకు 'ఆమె' ఉపయోగ పడుతుంది. పుట్టిన నాటి నుండీ మగాడికి ఇదే చెప్తుంటారు... ఆడదంటే 'అందుకే' నని!

స్త్రీ వాదం పాశ్చాత్య ప్రభావం లోంచి తెచ్చిన అరువు భావజాలం కాదు. ఆడవాళ్ల కడుపు మంటల్లోంచి పుట్టింది. గదిలో బంధించి హింసిస్తే తిరగ బడేందుకు పిల్లికి పాశ్చాత్య అవగాహన అక్కర లేదు. స్త్రీవాదం అనేది మగదాష్టీకం పైన స్త్రీత్వం విసిరిన ఒక నిరసనాస్త్రం. అది సూటిగా 'గురి'ని తగిలింది. కానీ, ఎంత సూటిగా తగిలినా, బలిసిన పురుషాహంకారం పైన అది చిన్నగోటి గీతే! పురుష ప్రపంచంలో ఆధిపత్య భావజాలాన్ని స్త్రీవాదం పూర్తిగా తగ్గించ లేకపోయినప్పటికీ, మగాడు వదిలేస్తే నుయ్యో గొయ్యో చూసుకునే రోజులకు కాలం చెల్లింది కదా...! అది స్త్రీవాద విజయమే! స్త్రీవాద రచయిత్రులకే ఈ విజయం అంకితం కావాలి! ఇందులో పురుష రచయితలు తలదూర్చి ఆ ఘనతలో వాటాదారులు కాకూడదు.

'శరీర స్పృహ' పెంచుకో గలిగిన స్త్రీ 'తన దేహంపై తన హక్కు'ల గురించి ప్రారంభించిన పోరాటం ఇది. ఒక పునరుత్పత్తి కేంద్రంగా కాకుండా, అభివృద్ధికి నిలయంగా తనను తాను నిలుపు కోవాలనే చైతన్యాన్ని నేటి స్త్రీ గుండె నిండా నింపుకుంది. పురుషుణ్ణి ఆర్థిక వస్తువు గానూ, మాన ప్రాణ రక్షణకు కాచుకునే

బాడిగార్డు గానూ, తాను అతని ఆధీనంలో జీవించే బానిస గానూ ఆధారపడి బతకాల్సిన అవసరం లేదని స్త్రీ గ్రహించింది. కలిసి రావాలో లేక అహంకరించి వేరై పోవాలో తేల్చుకో వలసిన స్థితిలో ఇప్పుడు మగాడు పడ్డాడు. ఈ సామాజిక వాస్తవాన్ని గ్రహించ గలిగిన వాడే నిజమైన మగాడు. కానివాడు కాకుండా పోతున్నాడు. మగ పిల్లలకు పెళ్ళిళ్ళు చేయటమే గగనంగా ఉందని ఇప్పటికే తల్లితండ్రులు గోలపెడుతున్నారు. భవిష్యత్తులో భార్య వదిలేసిన వాళ్లకూ, భార్యని వదిలేసిన వాళ్లకూ పెళ్ళిళ్ళు కావటం అంత తేలికైన విషయం ఏమీ కాదు. దాష్టీకం ఎల్లకాలం చెల్లదని ఋజువయ్యింది. సీతను వదిలేశాక రాముడు శ్రీరాముడని అనిపించుకునే నైతిక హక్కు కోల్పోయాడు. గృహస్థు బిరుదాలు వదులుకున్నాడు. రాముడి పరిస్థితే అలా అయితే, ఇంక మామూలు మనిషి బికారులూ బేవార్సుల సంఘంలో చేరటం తప్ప వేరే ఉండదు కదా!

రామాయణాన్ని సీత కోణంలోంచి 'సీతాయణం'గా వ్రాస్తే, అందులో రాముణ్ణి కాపాడుకోవటానికి సీత చేసే సాహసాలు ప్రధానంగా ఉంటాయి. అంటే, స్త్రీ స్వామ్య వ్యవస్థని తిరిగి తేవటం కాదు, స్త్రీ పురుష సమాన వ్యవస్థకు శ్రీకారం చుట్టటం! మన సంస్కృతిని కాపాడుకోవటం అంటే స్త్రీ అణచివేతని కొనసాగించటంగా మతతత్వ వాదులు భావిస్తే అది తాలిబానిజం అవుతుంది. స్త్రీ వాదం ఒక మతానికి పరిమితమైన అంశం కాదు. స్త్రీకి స్వాతంత్ర్యం, పూజనీయ స్థానం ఇవ్వాలన్న ధర్మశాస్త్రాలే ఎక్కువ! అయితే, 'పతికి మారాడక–పలుమరు లేద్వక...' లాంటి నీతి పద్యాలతో సమాజ అభ్యున్నతి సాధ్యం కాదు.

ఆశ్చర్య రామాయణంలో జనకుడు సన్యాసం తీసుకుంటా నన్నప్పుడు "అతిథి దేవోభవ అనే అదృష్టం కోల్పోతావు. పితృ దేవోభవ అని పితృ దేవతలకు తర్పణాలు విడిచి పుణ్యలోకాలు కల్పించే అవకాశాన్నీ, దేవతల్ని, మహర్షుల్ని అర్చించే భాగ్యాలన్నింటినీ కోల్పోతావు. చివరికి నీ బతుకు కుక్కబతుకు అవుతుంది. సోమరి ఏనుగుని చీమలూ,ఈగలూ పురుగులే తినేస్తాయి. పురుషార్థాలేవీ లేని నిన్ను కూడా అంతే! అవే తినేస్తాయి" అని అతడి భార్య తిట్లదండకం ఎత్తుకుంటుంది. స్త్రీవాద సాహిత్యంలో ఈ మాత్రం పురుష నింద అవసరం, తిట్టి చెప్తేగానీ బుర్ర కెక్కించుకో లేని స్థితిలో మగాళ్ళు ఉన్నారు కాబట్టి.

"ఆడవాళ్ళు మంచిగా బట్టలు కట్టుకుంటే మగాళ్ళు రేప్ లెందుకు చేస్తారు?" అని ఒక స్వామీజీ కొలెస్టరాలెక్కువై ప్రకటిస్తే, ఒక కేంద్రమంత్రి దానికి వంతపాడితే తిట్టటం చాలదనీ, కొట్టి చెప్తేగానీ బుర్రలోకి వెళ్ళదనిపిస్తుంది. స్త్రీ వస్త్ర ధారణ పురురుషుల్ని ఆకర్షించటానికేనా? గుండు గీయించుకుని తెల్ల ముసుగు వేసుకుని

కూర్చున్న స్త్రీ ఆకర్షణీయురాలు కాదా? ఆమెను 'మగాడిదలు' రేప్ చేయరా? స్త్రీని సెక్సు దృష్టితో తప్ప మరో దృష్టితో చూడలేని తనం మగవాళ్ళదే! మగదాష్టీకాలలో (male-centric notions) ఇదికూడా ఒకటి!

హంసవింశతిలో "వాని ఇల్లాలు దొమ్మరివాని డోలు" అంటాడు. డోలుని రెండువైపులా ఎడాపెడా వాయిస్తారు ఒక వైపు ఎలపట, ఇంకొకవైపు దాపట. ఒకవైపు ఇంట్లో పతి, ఇంకోవైపు బయట ఉపపతి... తన భార్య శీలవతిగా ఇంట్లో పడి ఉండగా, పరాయి వాడి భార్య వచ్చి తనను రకరకాల చేష్టలతో ఉద్రూగించి వెళ్ళాలనే మగాడి కోరికలకు ఇది ఒక మచ్చుతునక.

'లేచిపోయింది', 'వాడితో వెళ్ళింది', 'కొంగు పరిచింది' ఇలా అసభ్యంగా మాట్లాడుతూ జార, వేశ్య, సాని, తిరుగుబోతు అంటూ స్త్రీనింద చేసే మగాళ్ళని కొరత వేసే చట్టం రావాల్సిందే. అనేకమంది స్త్రీలతో సంబంధాలున్నవాణ్ణి రసిక రాజు, రతిరాజ శేఖరుడు అని కీర్తించటాన్ని కూడా ఈ కొరత వేసే నేరంలో చేర్చాలి. విజయరాఘవ నాయకుడు తన రాణులందరినీ ఒకే సారి అనుభవిస్తుంటే ఆయన కూతుళ్ళూ, మనవళ్ళు, మనవరాళ్ళు కూడా వచ్చి గ్యాలరీలో కూర్చుని సినిమా చూసినట్టు ఆ ఛండాలం అంతా చూశారని వెర్రి మొర్రిగా రాసిన రంగాజమ్మని మహాకవయిత్రి అనే వాళ్ళ సంస్కారాన్ని ప్రశ్నించటం అవసరం కూడా! ఏ కావ్యం చూసినా ఏమున్నది గర్వకారణం...? ఉన్నదంతా ఇదే! స్త్రీల గురించి మాట్లాడటం అంటే స్త్రీ సంభోగం గురించి మాట్లాడటం తప్ప ఇంకొకటి లేదా?

సెక్సు పరమైన ఆరోగ్యము, శరీరపరమైన ఆరోగ్యమూ రెండూ ఒకదాని వలన ఒకటి బలసంపన్నమౌతుంటాయి. ఒకటి బాగుండి రెండోది బాగోక పోవటం అనేది ఉండదు. కేవలం బాగుండటానికే (pleasure only) అయితే, సెక్సుకి ఇంత ప్రాధాన్యత అక్కర లేదు. కోరుకున్న ఒక వస్తువుని పొందటానికీ, కోరుకున్న ఒక వ్యక్తిని పొందటానికీ మధ్య తేడా ఉన్నట్టే నిగ్రహానికీ, దాంపత్యానికీ మధ్య తేడా ఉంది. స్త్రీల విషయంలో బలవంతపు నిగ్రహం కొనసాగుతూనే ఉంది. ఆమె వచ్చి తన ఒళ్ళో వాలాలని కోరుకునే యాసిడ్ ప్రేమికుడు కూడా, ఆమె తనతో మాత్రమే అలా వ్యవహరించాలనీ, ఇతరుల విషయంలో పరమ పతివ్రతగా ఉండాలనీ వాదిస్తాడు. ఇది మగ గుణం. పాశ్చాత్య సంస్కృతిలో ఇది మనకన్నాఎక్కువ. ఇది నూరు శాతం సెక్సు వివక్షతే! ఇలా అనగానే స్త్రీలకు వ్యభిచార హక్కు ఇవ్వాలంటారా...? అని కొందరు వ్యంగ్యం ఆడవచ్చు. పురుషుడికి ఇచ్చారు కదా మరి? ఇస్తే ఇద్దరికీ సమానంగానే ఇవ్వాలి. లేదా సమానంగానే నిరాకరించాలి.

దాంపత్యంలో అన్యోన్యత స్త్రీ పాతివ్రత్యం మీద మాత్రమే ఆధారపడి లేదు. అది పురుషుడి జోరు ఎంత తగ్గితే అంత ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి అన్యోన్య దాంపత్యాన్ని 'పాజిటివ్ సెక్సు' అంటారు. వివక్షత లేని లైంగిక వ్యవస్థ వలన సంసారం బలపడుతుంది. స్త్రీలు తమ లైంగికతని తమ అంగీకారం తోనూ, తమ సంతృప్తి కొద్దీ, తమ ఆరోగ్య భద్రత కొద్దీ పొందే హక్కు ఇది. స్త్రీ పురుష లిద్దరూ పరస్పర అంగీకారంతో సుఖప్రదంగానూ, ఆరోగ్యదాయకంగానూ ఉండే లైంగిక కార్యానికి తలపడటాన్ని 'పాజిటివ్ సెక్సు' అని నిర్వచించుకోవచ్చు. మహిళావాదంలో కొన్ని కొత్త అడుగులు ఈ దిశలో నడుస్తున్నాయి.

పాజిటివ్ సెక్సు సిద్ధాంతంలో పురుష వ్యతిరేకత కన్నా, పురుషాధిక్య వ్యతిరేకతకు ప్రాధాన్యత కనిపిస్తుంది. ఉద్యమ కారణంగా పురుష వ్యతిరేక పదజాలం కొంత కనిపించి నప్పటికీ 'పాజిటివ్ సెక్సు' అనేది 'మేల్ నెగెటివ్' కాదు. అది జెండర్ సోషలైజేషన్'ను కోరుకుంటుంది. 'లైంగిక సానుకూలతా స్త్రీవాదం (పాజిటి సెక్సు ఫెమినిజం)' ఈ దిశలో మరో ముందడుగు.

పాజిటివ్ సెక్సు అనేమాట సెక్సుని పొందటానికి మాత్రమే కాదు, సెక్సుని అతిగా నిగ్రహించు కోవటం గురించి కూడా ఆలోచిస్తుంది. సెక్సుని పొందటంలో ఆనందంతో పాటు, ప్రమాదాలు, ప్రాణాపాయాలు అనేకం పొంచి ఉన్నట్టే, నిగ్రహం పాటించే విషయంలోనూ ఉన్నాయి. సాధారణ స్థితిలో నిగ్రహించిన ఒక కోరిక మానసిక శక్తిగా "సబ్లిమేట్" అవుతుందంటాడు ఫ్రాయిడ్. కానీ, వివక్ష కారణంగా బలవంతపు నిగ్రహానికి గురికావటం వలన నిగ్రహించుకున్న ఆ కోరిక సబ్లిమేట్ కాకుడా మనోవ్యాధిగా మారుతుంది. హిస్టీరియా లాంటి మానసిక వ్యాధులకు కారణం అతి నిగ్రహమే! యోగశ్చిత్తవృత్తి నిరోధకః అన్నారు. బ్రహ్మచర్యం అనేది మనోబల సంపన్నతతో జరిగితే 'యోగ'దాయకం! లేకపోతే 'అయోగ్యం' అయి మానసిక బలహీనతకు కారణమౌతుంది.

ముఖ్యంగా సెక్సు విషయంలో బలవంతపు నిగ్రహాలే నరాల బలహీనతకు కారణా లౌతున్నాయి.

సెక్సుని తుచ్ఛమైన లౌకిక వ్యవస్థగా భావించి మనుషు లందరూ సెక్సు హీనులుగా మారాలని టీవీల్లో హోరెత్తించే ప్రవచనకారులే మానసిక బలహీనతకు మొదటి కారకులు. యుద్ధ సైనికుడికి ఆయుధా ఆయుధ ప్రయోగ విద్యలూ ఇస్తే చాలదు, తగినంత మనోబలం కూడా ఇచ్చి పంపాలి. స్త్రీలలో ఇలాంటి మనోబలాన్ని పెంపొందించాలని పాజిటివ్ సెక్సు సిద్ధాంతం కోరుతోంది.

దాంపత్య అసమానతను ప్రశ్నించటం ఈ యుగం లక్షణం. ద్వంద్వ విలువల్ని నిరసించాల్సిందే! ఆడది అణగిమణగి ఉండటం కాదు, ఆడా, మగా ఇద్దరూ సంసారానికి సమానంగా బద్ధులుగా ఉండే సామాజిక వ్యవస్థ కావాలి! సెక్సు అనేది ప్రకృతి ధర్మం కాబట్టి, దాన్ని స్త్రీ పురుషుల మధ్య సమానంగా పంపకం చేయాల్సిన ధర్మ శాస్త్రకారుడు పురుష పక్షపాతిగా వ్యవహరించటం వలన ఈ అసమానతలు వచ్చాయి. సుప్రీం కోర్టు తీర్పుక్కూడా అప్పీలు ఉంటుంది. కానీ, ఇక్కడ పోరాటం తప్ప ఇంకో మార్గం లేదు.

ఆకలి వేయటం, దాహం వేయటం లాంటి నేచర్ కాల్స్ లాగానే లైంగికోత్తేజం (orgasm) కూడా! దానికి అంత ప్రాధాన్యత ఎందుకనేది సెక్స్ రాడికల్ ఫెమినిష్టుల ప్రశ్న. అసహజ సెక్సు (oral, anal sex) బారిన పడకుండా స్త్రీని కాపాడాలనేది సెక్సు పాజిటివ్ ఫెమినిష్టుల వాదన.

'లెస్బియాన్లు' 'గే' లు ఇంకా ఇలాంటి మనో వికారులు ఇదంతా మానవ సహజ ప్రవృత్తి అంటూ తమ అలవాట్లని అడ్డగించరాదని, తమ లైంగిక స్వేచ్ఛను హరించ కూడదనీ పాశ్చాత్య లోకాలలో గట్టిగానే అడుగుతున్నారు. ఈ ధోరణిని బారతదేశంలో కూడా అక్కడక్కడా చూస్తూనే ఉన్నాం.

లైంగిక స్వేచ్ఛని ఇలాంటి అసహజ విధానాలకు వర్తింప చేయటం సబబేనా? ఇద్దరు ఆడవాళ్ళో లేక ఇద్దరు మగాళ్ళో సెక్సుని అసహజ పద్ధతిలో అనుభవించటం సహజ ప్రవృత్తి అనీ, చికిత్స అవసరం లేని ఒక మనస్తత్వం అనీ భావించి వదిలేయాలని ఒక మానసిక వైద్యుడు వ్యాఖ్యానిస్తే చాలా ఆశ్చర్యం వేసింది. మనోవికారాలన్నీ ఒక పరిధి వరకూ మనుష లందరికీ సహజ ప్రవృత్తులే! కానీ, ఆ వికారాల్లో జీవించటమే వ్యాధి. 'గే' అయినా, లెస్బియాన్ అయినా ఇందుకు మినహాయింపు కాదు. ఇలా మినహాయించి మన్నించేట్లయితే, హింసించి ఆనందించే 'మగ'త్వం, యాసిడ్ పోసి లోగదీసుకోవా లనుకునే మృగత్వం, అసహజ రీతిలో సెక్సుని పొందాలనుకునే అమానుషత్వం ఇవన్నీ కూడా సహజ ప్రవృత్తుల ముసుగులో చెలామణిలోకొచ్చే ప్రమాదం ఉంటుంది. లోకం పోకడను గమనిస్తూ, ఇలాంటి అంశాలపైన స్త్రీవాదం ఇప్పుడు దృష్టిని సారించాల్సి ఉంది.

పిల్లల్లో యాసిడ్ సంస్కృతి, అసహజ లైంగిక ధోరణులు, సెక్సువెర్రి మితిమీరటానికి సినిమాలనూ టీవీలను తిట్టి ఊరుకుంటే ఉపయోగం లేదు. పిల్లలు బలమైన కుటుంబ వ్యవస్థలో పెరిగితేనే వారి మనో ప్రవృత్తుల్లోని వికారాల్ని అధిగమించ వచ్చని 'నియో ఫ్రాయిడియన్లు' చెప్పే విషయాల పైన కూడా అధ్యయనం జరగాలి.

Sex-positive feminism, pro-sex feminism, sex-radical feminism, sexually liberal feminism ఇలా స్త్రీవాదం చిలవలు పలవలుగా సాగుతోంది. అన్నీ మన సామాజిక పరిస్థితులకు వర్తించక పోవచ్చు. దేశీయ పరిస్థితులకు అవసరమైన, అనుగుణమైన రీతిలో స్త్రీవాదం తన రెండో దశని ప్రారంభించాల్సి ఉంది. ఇప్పటికే కొందరు రచయిత్రుల రచనల్లో ఆ ధోరణి కనిపిస్తోంది కూడా! స్త్రీ పురుషుల సమానత్వం పిల్లల బాగోగులను కాపాడేదిగా ఉండాలి. ఫెమినిజం అంటే దాంపత్య వ్యతిరేకం కాదు. సంసారాల ధ్వంసరచన దాని లక్ష్యం అంతకన్నాకాదు.

స్త్రీ పురుష సమానత ద్వారా బలమైన కుటుంబ వ్యవస్థ ఏర్పడాలని కోరుతో, ఫెమెన్ (FEMEN) ఉద్యమం ఒకటి పనిచేస్తోంది. స్త్రీ (Female) పురుష (men) సమన్వయంగా బలమైన కుటుంబ వ్యవస్థను ఫెమెనిజం కోరుతోంది.

మగాడు ఇంక తన రంగు తుడుచుకుని నిజమైన అర్ధాంగి భావనని పెంచుకోవాలి. పెళ్ళాన్నిహింసిస్తూ పార్వతిని కొలిస్తే భక్తి ఫలించక పోగా రక్తి కూడా కోల్పోతాడు. మదగజంలా 'మగిజం'తో అహంకరిస్తే, నష్టపోయేది తనే! అంకుశాలు,ముకుతాళ్ళూ ఈ మగిజాన్ని కట్టేయటానికి చాలవు. స్త్రీవాద ఉద్యమం గడ్డిపరకల్ని పేని గట్టి మోకులు తయారు చేయాలి! ఇంటి ఆరోగ్యం చక్కన కానప్పుడు ఇంట్లో పెరిగే సంతతి ఆరోగ్య వంతులు కాలేరని, బుద్ధిగా ఒదిగి ఉండి సంసారం చేసుకోవాలని మగాళ్ల బుర్రలో నాటగలిగే సాహిత్యం నేటి అవసరం. ఇది కూడా స్త్రీవాద రచయిత్రుల వలనే సాధ్యపడుతుంది. పురుషులు ఎంత రాసినా పొడిపొడిగానే ఉంటుంది. ఆనదు!

రేపటి భారత దేశం పూర్తిగా యువతరంతో నిండిపోతుందని అంటున్నారు. ఆ యువత మనో బల సంపన్నులుగా మనో వికార రహితులుగా, సమాజ హితులుగా ఉన్నప్పుడు దేశం బాగు పడుతుంది. ఇందుకు తల్లిదండ్రు లిద్దరూ సమాన బాధ్యత వహించేలా చూడాలని ఫెమెనిజం కోరుతోంది. 'ఫెమినిజం' లోంచి 'ఫెమెనిజం' లోకి ప్రయాణం సాగాలి!

# సుఖ సంసారంలో చిచ్చు 'స్ట్రెస్సు'

లైంగిక సుఖాన్ని పొందాలనే కోరిక ఎంత బలంగా ఉంటే లైంగిక కార్యం అంత బలంగా జరుగుతుంది. జీవితంలో అన్ని విషయాలకూ వర్తించే వ్యక్తిత్వవికాస సూత్రాలన్నీ లైంగిక శక్తిని పెంచుకునేందుకూ వర్తిస్తాయి.

ఏకాగ్రత (సి వ కాన్‌సన్‌ట్రేషన్), ఇష్టత ( ఐ వ ఇంట్రెస్ట్), దీక్ష, పట్టుదల ( డి వ డెడికేషన్), ఈ సి ఐ డీలు సక్రమంగా ఉంటే, పరీక్షల్లో డిష్టింక్షన్ సాధించ గలిగినట్టు, సెక్సు కార్యంలో కూడా స్త్రీ పురుషులు డిష్టింక్షన్ పొందటానికి ఈ సి. ఐ.

డీ.ల అవసరం ఉంటుంది. నిజానికి సెక్సులో విజయం అనేది ఒక పరీక్షే! ఇందులో ఉత్తీర్ణత పొందితే, అన్నింటా జయమే!

ఎలాంటి ఆందోళనలూ లేకుండా అనుకూల భావావేశంతో (పోజిటివ్ యాటిట్యూడ్) మనసు నిండి ఉన్నప్పుడు సుఖ సంసారం సాధ్యమౌతుంది. చింతా శోక భయ దుఃఖాదులన్నీ లైంగిక శక్తిని చంపేస్తాయి. ఆత్మవిశ్వాసం కోల్పోతే, లైంగిక శక్తీ, ఆసక్తీ అంతరించి పోతాయి. ఆత్మవిశ్వాసంతో రతిక్రీడకు తలపడినప్పుడు జీవిత భాగస్వామితో అనేక రెట్లు సుఖానుభవాన్ని పంచుకోవచ్చు!

వేలల్లో జీతాలు తీసుకునే చాలామంది స్త్రీ పురుషులు వృత్తి పరమైన మానసికవత్తిడికి (స్ట్రెస్) లోనవటం వలన నిజమైన లైంగిక సుఖానుభవానికి దూరం అయిపోతున్నారు. వాళ్ళలో వివాహ బంధాల విచ్ఛిన్నతా శాతం ఎక్కువగా ఉంటోంది. ఆర్థిక స్వాతంత్ర్యం పెరిగిపోయి, ధనమదాంధతతో వాళ్ళు సంసారాలను నాశనం చేసుకుంటూ న్నారని అనుకోవటం పూర్తి వాస్తవం కాదు. దీర్ఘకాలం పాటు వృత్తిపరమైన, సామాజిక పరమైన, కుటుంబ పరమైన 'స్ట్రెస్సు' లో నిరంతరంగా జీవించటం వలన మనుషులు లైంగిక అసమర్థతకు లోనౌతుంటారు. సంసారాలు విచ్ఛిన్నం కావటానికి ఇది ప్రధాన కారణం. డబ్బుతో దేన్నైనా కొనుక్కోవచ్చుగానీ, సెక్సు సమర్థతని కొనలేరు కదా!

నిజానికి లైంగిక కార్యం వలన మనసులోంచి వత్తిడి అనే దయ్యం పారిపోవాలి. ప్రియురాలి ఒడిలో ఒక్క క్షణం సేద తీరితే ఎంతవత్తిడి నుంచైనా బయట పడగలుగుతారు మనుషులు. కానీ, వాస్తవం అందుకు భిన్నంగా ఉంది. స్ట్రెస్సు లేని సమయాన్ని చూసుకుని సుఖంగా గడుపుదాం అనుకునేంతలో ఆఫీసునుండి సెల్లు పిలుపు వస్తుంది. అంతే! వెంటనే ల్యాప్'టాప్ తెరిచి దానికి అంకితం కావతం ఎక్కువసార్లు జరిగిపోతుంది. తనను ఒడిలోకి తీసు కోవాల్సిన తన జీవిత భాగస్వామి ఆ ల్యాప్'టాప్'ని ఒడిలోకి తీసుకోవటాన్ని ఎవరికైనా భరించలేని విషయమే! అది మానసిక వత్తిడికి దారి తీస్తుంది. ఫలితంగా విసుగులూ, కోప తాపాలు, చీదరింపులూ, మూతి విరుపులూ సహజంగా పెరిగి పోయి భార్యా భర్తలు తమ విధ్యుక్త ధర్మాలను నెరవేర్చుకో గలిగే సమయం చిక్కక, సతమతమౌతూ ఉంటారు. చివరికి మనసు విప్పి మాట్లాడుకునే సావకాశం కూడా వారికి చిక్కదు. సంసారాల్లో స్ట్రెస్స్ వలన సుఖజీవనం నాశనం అవుతోంది. క్రమేణా అది దాంపత్యాన్ని చీల్చే దాకా దారి తీస్తోంది.

ఇలాంటి పరిస్థితిని నివారించు కోవాల్సిన అవసరాన్ని గుర్తించాలి. దీన్ని సరి చేసుకోకుండా, లైంగిక శక్తిని పెంచే మందులను ఆశ్రయించటం వలన ధన మాన

ప్రాణాల దోపిడీ తప్ప ఒరిగేదేమీ ఉండదు. చిట్కా చికిత్సలు మన ప్రయత్నానికి ఉడత సాయం చేస్తాయే గానీ, అవే ప్రధానం ఎంతమాత్రం కాదని గ్రహించాలి. మనో బలం లేనివాడి దగ్గర వజ్రాయుధం ఉంటే మాత్రం ఒరిగేదేం ఉంటుంది...? సెక్సు విషయంలో ఈ సూక్తి ముఖ్యంగా వర్తిస్తుంది.

మొదట మనసుని చక్కగా అలంకరించుకోవాలి. అందులో స్ట్రెస్సు లాంటి అడ్డుభావనలేవీ లేకుండా చూసుకోవాలి. తరువాత శరీరాన్ని అలంకరించుకోవాలి. అందులో ఎలాంటి వికారాలూ కలగకుండా జాగ్రత్త పడాలి. ఉదాహరణకు మీ జీవిత భాగస్వామికి వెల్లుల్లి సరిపడదనుకోండి, మీ శరీరంలోంచి వెల్లుల్లి గవులు కంపు కొడుతుంటే అవతలి వ్యక్తి పూర్తిగా సెక్సు విముఖతకు లోనయ్యే ప్రమాదం ఉంటుంది! తాగి ఇంటికి వచ్చి సారాకంపుకొట్టే మొగుడితో భార్య పొందేది లైంగిక సుఖం కాబోదు కదా! యాంత్రికంగా ఆ తాగుబోతుకు ఒళ్ళప్పగించి అయిందన్నాక అటు తిరిగి పడుకునే భార్యలే ఎక్కువ మంది ఉన్నారని ఒక సర్వే చెప్తోంది.

ఇద్దరికీ లైంగికోత్తేజ కరంగా ఉండేలా పడక గది అలంకారం ఉండాలి. అందులో మంచం కింద ఆరబోసిన ఉల్లిపాయలూ, మంచం పక్కన మురికి గుడ్డలూ, చుట్టూ వ్యాపించిన బూజు, ఎక్కడో ఎలిక చచ్చిన వాసన...ఇలాంటి పడక గదిలో జరిగేది కక్కుర్తి వ్యవహారమే గానీ, అది నిజమైన దాంపత్య సుఖ ప్రేరకం ఎంతమాత్రమూ కాదు.

సెక్సనేది ఇచ్చి పుచ్చుకునే ఒక భావావేశం. అది, గది నాలుగు గోడలమధ్య ఇద్దరికి మాత్రమే పరిమితమైన వ్యవహారం. గెలుపోటములు నిర్ణయించే అంపైర్లెవరూ ఉండని ఒక రహస్య క్రీడ. దానికి నియమ నిబంధనలేవీ ఉండవు. ఇద్దరి అంగీకారంతో జరిగే ఒక 'రాగుంజు పోగుంజు'లాట. ఇందులో చేయటం చేయబడటం అనే రెండు వ్యవహారాలు అసలే ఉండవు. ఆడది సుఖపెట్టేది, మగాడు సుఖపడేవాడు అనే అభిప్రాయం తప్పు. సుఖ సంతోషాలను ఇచ్చి పుచ్చుకునే సమస్థితి ఉన్నప్పుడే అది ఆరోగ్యదాయక మైన దాంపత్య సుఖానుభూతి నిస్తుంది.

ఏవి ఎలా ఉన్నా మనసు అనేది సెక్సు విజయాన్ని ప్రసాదించే గొప్ప ఔషధం. అది నిర్మలంగా ఉండాలి. అన్నింటికన్నా ముందు మనిషికి సెక్సు పరమైన నిజాయితీ ఉండాలి. నిజాయితీ లేని వ్యక్తి సెక్సుకు తలపడినప్పుడు గిల్టీ కాన్షస్ అంటామే... . అపరాధ భావన... అది ఆ సమయంలో ప్రభావం చూపిస్తే ఆ వ్యక్తి సెక్సు పరమైన అపజయాన్ని చవి చూడవలసి వస్తుంది. ఇవన్నీ స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా వర్తించే విషయాలే! మానసిక వత్తిడి (స్ట్రెస్సు)ని తెచ్చే వాటిలో అపరాధ బావన కూడా ముఖ్యమైందే! పవిత్రమైన దాంపత్య సుఖానికి స్ట్రెస్సు చిచ్చు పెట్టేదేనని గుర్తించాలి.

# 'ఆలి'ని వదిలితే 'గాలి' బతుకే!

**ఆ యమ యున్నరోజులహహా! అనురాగఝరీ మరందవా:**
**పేయము లంగజేక్షుశరపీఠగుణశ్రుతిబద్ధ స్స్వధా**
**గేయము లాత్మశోకవినికృంతననిర్వృతికృద్వివిక్తి సం**
**ధ్యేయము లావృతిన్ వెలుగు లేచెదు రవ్వల పూలపొట్లముల్**

డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ తాజాగా వెలువరించిన 'ధర్మభిక్ష' ప్రబంధ కావ్యంలో పద్యం ఇది! శ్యామలానంద తెలుగు సంస్కృత భాషలలో పరిశోధనా పట్టాలు పొందిన కవి పండితుడు. ఇంకా ఈ రోజుల్లో కూడా అంత పాండిత్యం సాధ్యమా అని ఆశ్చర్య పోయేంత వచో వైభవం ఉన్నవాడు. శతావధానాలు చేశాడు. తొలిసారిగా అచ్చతెలుగులో అష్టావధానం చేశాడు. లండన్ పార్లమెంటులో ఇంగ్లీషు వాళ్లకి ఆశువుగా పద్యాలు పాడి వినిపించాడు.

డా. శ్యామలానంద సామాజిక దృష్టి అధికంగా ఉన్న కవి. ఆయన నూనూగు మీసాల రోజుల్లో వ్రాసిన కావ్యం ఈ ధర్మభిక్ష. అప్పట్లో విశ్వనాథవారికి చదివి వినిపించి ఆయన చేత తప్పొప్పులు సరి చేయించు కున్నాడు. కవిసమ్రాట్ మరణం తరువాత ఆ కావ్యం పూర్తి కాకుండానే మూలపడింది. తరువాత పరిపూర్ణ యవ్వనంలో తన మిత్రుడు సినీకవి జొన్నవిత్తుల రామలింగేశ్వర రావు ప్రేరణతో దాన్ని పూర్తి చేశాడు. అది ఇప్పటికి అచ్చులో వచ్చింది. దాన్ని రామలింగేశ్వర రావుకే అంకితం ఇచ్చాడు.

ఎర్రనగారి భారతానువాదంలో ధర్మవ్యాధో పాఖ్యానం ఘట్టాన్ని తీసుకుని తనదైన రీతిలో వ్యాఖ్యానిస్తూ ఈ ధర్మభిక్ష ప్రబంధాన్ని వ్రాశాడు శ్యామలానంద. చిన్న కావ్యం ఇది. కానీ ఇప్పటి తరానికి అవసరమైన సందేశం ఇస్తోంది.

భర్త ఎంత మొండివాడైనా భార్యతో ఉన్నంతసేపే అతని ఆటలు సాగుతాయి. ఆమె లేనప్పుడు ఆమె అవసరం ఏమిటో తెలిసొస్తుంది. భార్య లేకపోతే, ఆ భర్త జీవనం ఎంత దుర్భరంగా ఉంటుందో, భార్యలను వేధించే భర్తలకు తెలిసొచ్చే సరికి చాలా అపకారం జరిగి పోతుంది.

ఈ పద్యంలో ఒక భర్తగారు భార్యని పుట్టింటికి పంపించేసి, అంటే, ఇప్పటి

భాషలో వొదిలేసి, దేశ ద్రిమ్మరిలా తిరుగుతూ మనసులో అనుకుంటున్న మాటలివి: "ఆహహా...ఎంత గొప్పవీ... ఆవిడతో కలిసి ఉన్నరోజులు... అవి అనురాగ ఝరీ మరందవా: పేయూలు...అంటే ప్రేమ అనే తేనెల ప్రవాహాలు, అంగజేక్షుశరపీఠగుణశ్రుతిబద్ధ స్త్రథా గేయాలు: మన్మథుడి చెరకు వింటి నారిని శ్రుతి చేసి పాడుకున్న కథా గేయాలు, ఆత్మశోకవినికృంతననిర్వృతికృద్వివిక్తి సంధేయాలు: గుండ్రంగా శక్తికొలదీ తిప్పుతుంటే రాలిపడే మతాబాల పూలపొట్లాలు..." అని!. ఆ విషయాన్ని చాలా ఆలస్యంగా గ్రహించాడా భర్త గారు.

అహంకారం అనేది ఉంది చూశారూ...అది తన తప్పుని ఒప్పుకోనివ్వదు: "అవునండీ...ఆమె ఎంత మూర్ఖురాలు కాకపోతే అన్నం వడ్డించి నెయ్యి వెయ్యకుండా భోజనం పెడుతుందా? నేను మాత్రం ఏమన్నాను... నెయ్యి వెయ్యి లేదేవిటీ... అన్నాను... ఆవిడ వెంటనే, "మీకు చాలా సార్లు చెప్పాను...ఇంటికి వచ్చేప్పుడు నెయ్యి తెండీ...అని! మీరు తీసుకు రాకుండా వచ్చి నన్నదుగుతా రేవిటీ అని రెట్టించింది. నాకు చిర్రుమంది. ఆడది భర్తతో అలా మాట్లాడితే ఎవడికైనా కోపం రాదా...? అది నన్ను బైట పెట్టి నా శిష్యుల ముందు చులకన చేయటం కాదటండీ... నిజంగా అది తలుచుకుంటే, ఎన్నాళ్లనుండో ఆ ఊళ్ళోనే ఉంటున్నాం కదా...ఓ చిన్న గిన్నెడు నెయ్యి అప్పు దొరకదా...? నేను తేలేదని ఎత్తి చూపటానికి కాకపోతే, కమ్మగా మొగుడికి అన్నం వడ్డిద్దాం అనే ధ్యాసే లేకపోతే ఎట్లా...ఆడాళ్లకి మొగ్గుళ్ళని చులకన చేయటం అంటే మహా మోజు..." అనుకున్నాడా భర్త.

ఆయనేమీ సీదా సాదా మొగుడు కాదు. కౌశికుడనే ఒక మహర్షి. "మొగుడికి అన్నం వడ్డించాక నెయ్యి లేదని చెప్తుందా? కారణం చిన్నదే కావచ్చు...కానీ కార్యం (తప్పు) పెద్దది. అందుకే నాకు అంత కోపం వచ్చింది..."అనుకున్నాడు కౌశికుడు. ఏమైతేనేం, ఆ రోజునుండీ కౌశికుడు భార్య లేనివాడై పోయాడు. ఆ విధంగా మూర్ఖురాలైన భార్యని శిక్షించాడనే అనుకుందాం... కానీ, ఊళ్ళో ఇంటింటికీ వెళ్ళి, అమ్మా! తల్లీ! అని అడుక్కొంటున్నాడు కదా! కౌశికా శిక్షించావా? శిక్షించబడ్డావా?

ఆఫీసులో 'ఆడబాసు'తో తిట్లు తిని, ఇంటి కొచ్చి భార్యమీద ఆ కసినంత చూపించే అభినవ కౌశికులు చాలా మంది ఉన్నారు. భార్య అంటే తిట్లు పడాల్సిన ఒక వస్తువనే భావనలోంచి బయట పడకపోతే, ఉన్న ఇల్లాల్ని వదిలి, ఊరి ఇల్లాళ్ల దయమీద బతకాల్సివస్తుందని ఇందులో సారాంశం.

# మగ ఏడుపులు

*ఱెక్కలు రావు పిల్లలకు, ఱేపట నుండియు మేతగానమిం*
*బొక్కుచు గూటిలో నెగసి పోవగ నేరవు, మున్ను తల్లి యీ*
*దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కినిక్కి న*
*ల్దిక్కులు జూచుచున్న వతి దీనత, నెట్లు భరింతు నక్కటా! (శ్రీ మదాంధ్ర మహా భాగవతము- 7/63)*

భార్యలు ఊరెడితే భర్తలు ఎంజాయి చేస్తారని చాలా మంది కథలు, కార్టూన్లు సృష్టిస్తారు గానీ, పిల్లల్ని ఇంట్లో వదిలి వెడితే అప్పుడు తెలుస్తుంది అయ్యగార్ల సంగతి. ఈ దేశంలో భర్త లేకపోయినా స్త్రీ జీవించగలదు. కానీ భార్య లేకపోతే భర్తకు ఒక్క పూట కూడా గడవదు. భర్త పోతే తోడుమనిషి పోయాడని ఏడుస్తుంది భార్య. భార్య పోతే ఇల్లెలా నడుస్తుందని ఏడుస్తాడు భర్త. వంటెవరు చేస్తారు?ఇల్లెవరు ఊడుస్తారు? అంట్లెవరు కడుగుతారు? బట్టలెవరు ఉతుకుతారు? పిల్లల్నెవరు సాకుతారు?అందుకని భార్య లేదని మగాళ్ళు ఏడుస్తారు. భార్య ఉన్నంత సేపూ వేధించుకు తినటం, 'నుయ్యో గొయ్యో చూసుకుంటా'నని ఆమె ఏడవటం, 'చస్తే చావు, ఈడ్చి పారేస్తా'... అని అతను అరవటం...ఇవి చాలా ఇళ్ళలో నిత్య కృత్యాలే! కానీ, ఒక్క రోజు భార్య ఇంట్లో లేకపోతే తలకిందులై పోతాడు మగాడు.

ఇదేదో మహిళా ఉద్యమం ఉధృతంగా నడుస్తున్న ఈ నాటి సామాజిక పరిస్థితి కాదు. పోతనగారి నాటికే ఈ ధోరణి ఉంది. ఆయన తన భాగవతంలో ఇలాంటి కథే ఒకటి చెప్పాడు: ఉశీవర రాజ్యాన్ని పాలించే సుయ్యజ్ఞుడనే రాజు యుద్ధంలో మరణించాడు. శవం చుట్టూ చేరి భార్యలు, బంధువులూ ఏడుస్తున్నారు. అది చూసి సాక్షాత్తూ యముడు ఓ బ్రాహ్మణ బాలుడి రూపంలో అక్కడికి వచ్చాడు. ఆ ఏడ్చే వాళ్ళందరినీ ఊరడించేందుకోసం వాళ్లకు ఈశ్వర తత్వాన్ని బోధిస్తాడు. ఆ క్రమంలో ఈ 'కథ చెప్పాడు...

అడవిలో ఓ చెట్టు మీద అడవి పిచ్చుకల జంట సుఖంగా ఉన్నాయి. ఆ సమయంలో ఓ వేటగాడొచ్చి "భార్యపిచ్చుక"ని పట్టి రెక్కలు విరిచి సంచీలో వేసుకున్నాడు. అప్పుడు "భర్తపిచ్చుక" ఏడుస్తూ ఇలా అంది: "అయ్యయ్యో! మన పిల్లలకు ఇంకా రెక్కలు కూడా రాలేదు. అవి ఎగర లేవు. తెల్లవారిం దగ్గర్నుంచీ అవి ఆకలో మొర్రో అంటూ గోలచేస్తాయి, నువ్వెప్పుడొచ్చి అన్నం పెడతావా... అని నీకోసం నిక్కినిక్కి చూస్తాయి. వాటి ఏడుపు వినటానికే భరించ లేనంతగా ఉంటుంది. ఇంకనుండి చచ్చినట్టు వాటికి ఆహారం నేనే తెచ్చి పెట్టవలసి వస్తుంది కదా!" అని భర్త పిచ్చుక ఏడ్చినట్టు వ్రాశాడు పోతన గారు. "మగఏడుపులు" ఎలా ఉంటాయో ఈ పద్యం మనకు వివరిస్తోంది

బతికున్నంత కాలం భర్తలు అన్యాయం చేసినా, తన భర్త చనిపోయి తనకు అన్యాయం చేశాడనే అంటుంది భార్య. అనుకుంటుంది కూడా! కానీ, భర్తలు మాత్రం అలా అనుకోరు. అదే తేడా!

ఉశీవర దేశ రాజు పోయాడని అతని రాణులు ఏడ్చినప్పుడు యముడు వచ్చి, భార్య పోతే ఏడ్చినఈ భర్త కథ చెప్పినట్టు పోతనగారు వ్రాశాడు. ఇందులో విచిత్రం ఏమీ లేదు. లోకం తీరు చెప్పాడు యముడు. అదే ఈశ్వర తత్త్వం అంటే! లోకాన్ని నడిపించేది ఈశ్వరు డైనప్పుడు లోకం తీరు ఈశ్వర తీరే అవుతుంది కదా! దాన్నే చెప్తున్నాడు ఈ పద్యంలో పోతన.

అందరు మగాళ్ళు ఇలానూ, అందరు ఆడాళ్ళు అలానూ ఏడవాలనే రూలేమీ లేదు. ఏడవటానికి కారణాలు వేరుగా ఉంటాయనేది మాత్రం నిజం. సామాజిక వ్యవస్థ తీరే అంత! మనుషులందరూ పరస్పరం ఆధారపడి బతికితేనే అది సమాజం అనిపించుకుంటుంది. కానీ, భార్యా భర్తల విషయానికి వచ్చే సరికి మాత్రం భార్యని తాను పోషిస్తున్నానని, అందుకు కృతజ్ఞతగా భార్య ఆజన్మాంతం అణిగి ఉండాలనీ భర్తల్లో ఓ బలమైన భావం సర్వత్రా కనిపిస్తుంది. భార్య సంపాదన మీద ఆధారపడి బతికే వాడిక్కూడా ఇలాంటి ఆలోచనే ఉంటుంది...తన వలనే కదా ఆమె సుఖంగా వుందని! అసలు రహస్యం ఆమె పోయినప్పుడే తెలుస్తుంది... అందుకే మగజాతి అలా ఏడుస్తుంది!

# మండు వేసవిలో సుఖ సంసారం

**నలదమయంతు లిద్దఱు మనః ప్రభావానల బాధ్యమానులై**
**సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవ నందనమ్ములన్**
**నలిన దళంబులన్ మృదు మృణాళములన్ ఘనసార పాంసులం**
**దలిరుల శయ్యలన్ సలిలధారల( జందన చారు చర్చలన్**

ఇది నన్నయ గారి పద్యం. ఎలాంటి ఏసీలూ లేని ఆ రోజుల్లో ఎండామండిత కాలంలో సుఖంగా సరస సాంగత్యాలకు సౌకర్యవంతంగా ఉండేవి కావు. అందుకని, మండు వేసవిలో చల్లదనం కంటికి, వంటికీ, ఇంటికీ ఆనక, ఆ ఉక్కపోతలోనే కొత్త దంపతులైన నలదమయంతులు హనీమూన్ 'సలిపా'రని వర్ణిస్తాడు ఈ పద్యంలో నన్నయ గారు. సలపరింత అంటే, పుండు పోటెత్తడం. ఆ ఎండాకాలంలో నలదమయంతులు ఆనంద డోలికల్లో తేలియాడిందేమీ లేదనటానికి 'సలిపా'రనే పదం వాడి ఉంటాడు నన్నయ గారు. ఎంత ఏసీలో జీవించే వారికైనా, కరెంటు పోతే, 'ఏసీ' 'తీసీ'గా మారిపోయి, ఇదే దుస్థితి తప్పదు కదా!

పూర్వకవులు సాధారణంగా వసంత మాసాన్ని, శారద రాత్రుల్నీ సుఖవికాసాలకు అనువైన కాలంగా వర్ణిస్తారు. కానీ, నన్నయ గారు 'దీర్ఘవాసరనిశల్' అంటే, ఎప్పుడు క్యాలెండర్లో తేదీ మారుతుందా... అనిపించే సుదీర్ఘ దివారాత్రాల రోజుల్లో కొత్త దంపతులైన నల దమయంతుల్ని తెచ్చి కలిపాడు. మనః ప్రభావాన్ని అంటే, మన్మథ తాప బెడదని తప్పించు కోవటానికి ఆ నవదంపతులు పడిన అవస్థ ఊహించుకోవాల్సిందే!

ముప్పై వేల ఎకరాల రాజధాని ఊరింతలు ఏవీ లేని సత్తెకాలం కాబట్టి, ఆ రోజుల్లో పూలతోటలు, తామరకొలనులూ వగైరా 'ఉన్న' రోజులు కాబట్టి, తామర పూల రేకులు, తామర కాడలతో(మృదు మృణాళములన్ ), పన్నీటి జల్లులతో (సలిల ధారలన్) అక్కడ వేసవి కాలక్షేపం చేసారట. వాళ్లకు చల్ల దనం అనేది ఏ మాత్రం అయినా దొరికిందంటే గంధం చెక్కని కొద్దిగా పచ్చ కర్పూరం పలుకులతో (ఘనసార పాంసులన్) అరగదీసి గంధం తీసి అది వొంటికి రాసుకోవటం (చందన చారు చర్చ) వలన మాత్రమే! అది రాసుకున్నాక లేత ఆకులు (నలిన దళంబులన్) పరుపులా పరుచుకుని వాటిమీద 'వాళ్ళ తంటాలేవో వాళ్ళు పడ్డారు' అని చెప్పటం కోసం 'సలిపారు' అనే పదం వాడాడు నన్నయ గారు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధా లనే ఐదు గుణాల్లో శబ్దం తప్ప తక్కినవన్నీ అక్కడున్నట్టు నన్నయ్యగారి వర్ణన ధ్వనిస్తోంది.

సుఖజీవనానికి చల్లగాలిమర(ఏసీ మిషను) ఒకటి ఉండి ఉంటే వేసవిలో రతి వైభవాన్ని వర్ణించటానికి కలాలు, పేజీలు సరిపోయేవి కాదు. వేసవి శృంగారం గురించి చెప్పేదేముంటుందని, 'సలిపారు' అనేసి ఊరుకున్నాడు నన్నయ గారు. అప్పో సొప్పో చేసి ఏసీ పెట్టించుకున్నప్పటికీ కరెంటు సమస్య 'సలపరింత' పెట్టేది ఖాయం కదా!

అందుకని, 30వేల ఎకరాల కొత్త రాజధానిలో 'బృందావనం ఫౌంటైన్లూ, నందనవనాలూ, తామర కొలనులూ, కాసిని మంచిగంధం చెక్కలూ, పచ్చకర్పూరం పలుకులూ వగైరా శీతల ఉపచర్య సామగ్రి జనసామాన్యానికి అందుబాటులో ఉండటం అవసరం' అని కొత్త ప్రభువులకు నన్నయగారి ఈ పద్యం సూచిస్తోందన్నమాట! చెరువుల్నీ, తోటల్నీ తొలగించి, భవనాలు కడుతున్నందున ఈ శీతల సామగ్రిని జనసామాన్యం కోసం ప్రభుత్వమే సమకూర్చాలని నన్నయ గారి భావన!

వేసవిలో వడ కొట్టకుండా, విరేచనాలు కాకుండా, ఒళ్ళు పేలకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకుంటారు గానీ, నన్నయ చెప్పిన 'సలప'రింతని తప్పించుకోవటానికి

ముందుసరి ఏర్పాట్లు చేసుకునే ధ్యాస చాలా తక్కువ మందికి ఉంటుంది. దీర్ఘవాసర నిశల్లో సుఖ సంసారానికి సులువైన మార్గాలు నన్నయగారి ఈ పద్యంలోనే ఉన్నాయి. ఆయన పచ్చకర్పూరం గంధం మిశ్రమాన్ని వంటికి పూసుకుని శీతలోపచారాలు చేసుకోవాలన్నాడు. కానీ, ఈ మిశ్రమాన్నే కడుపులోకి తీసుకుంటే మరిన్ని ప్రయోజనాలు కలుగుతాయి.

మంచి గంధం చెక్కని సంపాదించండి. సానమీద ఒకటి రెండు పచ్చకర్పూరం పలుకులతో ఈ గంధం చెక్కని అరగ దీయండి. అలా వచ్చిన సానగంధాన్ని ఒక పళ్ళెంలో వేసి పావుగంట సేపు ఆరనిస్తే, అది మాత్ర కట్టుకునేందుకు వీలుగా గట్టి పడుతుంది. బఠాణి గింజలంత ఉండలు చేసుకుని రోజూ ఒకటి లేక రెండు మాత్రలు కడుపులోకి తీసుకుని పాలు తాగండి. ఈ గంధంఃపచ్చకర్పూర మిశ్రమం శరీరంలో ఊష్మాన్ని తగ్గిస్తుంది. పై పూతగా వంటికి రాసుకుంటే ఎంత చల్లదనాన్నిస్తుందో, కడుపు లోకి తీసుకున్నా అంత చలవనిస్తుంది. లైంగిక శక్తినీ, ఆసక్తినీ పెంచుతుంది. తక్కువ మోతాదులో తీసుకోవాలి! పచ్చ కర్పూరం అతిగా వాడకూడదు. జలుబు చేస్తుంది.

'అపార్ట్'మెంట్ల సంస్కృతి పెరిగాక గాలీ వెలుతురు గురించి ఆలోచించటం మానేసి, సీలింగు ఫ్యాన్లూ, పగటి దీపాలు, ఏసీల మీద ఆధార పడ్డ ప్రజలకు కరెంటు లేని సమయంలో నలదమయంతుల సలపరింత అనుభవంలోకి వస్తుంది. గాలీ వెల్తురూ రాకుండా, ఫ్యాన్లతోనూ ఏసీలతోనూ వదిలిన గాలినే పీలుస్తూ జీవించే విధంగా ఇళ్ళు కట్టుకుంటూ, సుఖాన్ని భూతద్దంతో వెదుక్కోవటం మనకు మనం చేసుకుంటున్న అన్యాయం.

# 4. అనుబంధం

## సెక్సు హక్కు : భార్యల మీద చట్ట దౌర్జన్యాలు

ఆఫ్ఘనిస్తాన్‌లో స్త్రీని ఒక మానవ మాత్రమైన అంశంగా చూడటం మానేసి చాలా ఏళ్లయ్యింది. ఒక భార్య తనభర్తతో ఎన్నిసార్లు సెక్సులో పాల్గొనాలో కూడా నిర్ధేశించే చట్టం ఆఫ్ఘనిస్తాన్‌లో రూపొందుతోందంటే, అందులో ఆశ్చర్యం ఏమీ లేదు. అక్కడ ఆడవారికి వర్తించే మానవ హక్కులేమీ మిగిలిలేవు కాబట్టె! 2009 ఆగస్ట్ మాసాంతంలో ఆఫ్ఘన్ అధ్యక్ష పదవికి ఎన్నికలు జరగనున్న నేపథ్యంలో ఆడవాని హక్కుల్ని పణంగా పెట్టి ఈ మేరకు అక్కడ ఒక వింత చట్టాన్ని తెచ్చారు.

ఈ వార్తలు సూచిస్తున్నాయి. అక్కడ ఎన్నికల్లో గెలపుకోసం ఎంతకైనా తెగించవచ్చు అడిగేవాడెవ్వడు?

ఇది చదివాక, ప్రపంచం ముందకేపోతోందా...? లేక వున్నపళంగా బాబిలోనియన్, అక్కాడియన్, సుమేరియన్ కాలాల్లోకి వెళ్లిపోతోందా అనే సందేహం కలుగుతుంది!

క్రీ.పూ. 17వ శతాబ్ది కాలంలో బాబిలోనియా మహా సామ్రాజ్యాన్ని నిర్మించిన "హమ్మురాబీ" ఆడవారి స్వేచ్ఛని అపహరిస్తూ సరిగ్గా ఇలాంటి చట్టాలే చేశాడు. వాటిని భారత్‌తో సహా ఆ నాటి సమాజాలన్నీ దత్తత తీసుకొని అమలు చేశాయి. ఆనాటి నుంచీ ఈ నాటి వరకూ స్త్రీ 'స్వేచ్ఛ' అనేది కలలోని మాటగా మారిపోవటానికి హమ్మురాబీ ప్రవర్తనా నియమామళి ప్రవచనాలే కారణం. అవే ఈనాడు ఆఫ్ఘన్‌లో పునరావృతమవుతున్నాయి హమ్మురాబీ ఆఫ్ఘన్‌లో మళ్ళీ పుట్టాడా అనిపిస్తోంది!

**స్త్రీ స్వేచ్ఛను దిగమింగిన హమ్మురాబీ :**

క్రీ.పూ 1728 -1686ల మధ్య కాలంలో కేవలం 42 ఏళ్ళకే మధ్యధరా సముద్ర తీర ప్రాంతాల్లోని అనేక దేశాలను, సుమేరియాను కూడా జయించి బాబిలోనియన్ మహా సామ్రాజ్యాన్ని నిర్మించినవాడు హమ్మురాబీ.

ఈనాటి ఆఫ్ఘనిస్తాన్‌తో పోల్చదగిన నిరంతర యుద్ధ వాతావరణం, భద్రతారాహిత్తం, అస్థిరమైన జీవన వ్యవస్థలు ఆనాడు హమ్మురాబీ నెలకొల్పిన బాబిలోనియాలోనూ వున్నాయి. యుద్ధకాలంలో ప్రాథమిక హక్కులన్నీ

ఉపసంచరించబడతాయి. యుద్ధం అనేది ఒక నిరంతర ప్రక్రియ అయినప్పుడు స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ సాధికారికత, స్త్రీ సమాన హక్కులు ఇలాంటి వన్నీ శాశ్వతంగా మూలానపడేసే అంశాలౌతాయి. యుద్ధం ముగిసినా ఇవి వాటికవే పునరుద్ధరణ అవుతాయనుకోవటం భ్రమే! హమ్మురాబీ ఆలోచనలు ఇలా సాగాయి;

1. వ్యక్తుల వ్యక్తిగత హక్కులకన్నా సామ్రాజ్యమూ, సామాజిక వ్యవస్థలూ బలంగా వుండటం ప్రభువులకు ముఖ్యం.
2. సంప్రదాయ పరిరక్షణ కోసం ధర్మం కోసం అవసరం అయితే ఆడది అనే లింగపరమైన అంశాన్ని త్యాగం చేసి, స్త్రీని ఇంట్లో ఒక గదిలో దాచేసి తక్కిన సమాజాన్ని అదుపు చేసుకుంటూ పాలించటం ప్రభువులకు తప్పనిసరి.
3. స్త్రీలకు స్వంత ఆస్తులుంటే వుండవచ్చు. కానీ, వాటిని తండ్రిగాని, భర్తగాని, పుత్రుడుగానీ నిర్వహించాలి. తనకి ఇంత ఆస్తివుందీ, అంత ఆస్తివుందీ అని ఆమె విర్రవీగరాదు. ఆమెను బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వార్ధక్యంలో కొడుకు అదుపులో పెట్టాలి . ఆడవాళ్ళకి అవసరమైన స్వాతంత్ర్యం వుండకూడదు.
4. స్త్రీలు పురుషుల రక్షణలో, వారి సానుభూతితో Receiving End లో పుచ్చుకొనే స్థితిలోనే వుండాలి. అంతకుమించి ముందుకు రాకూడదు

హమ్మురాబీ మనసులో మెదిలిన ఆలోచనలు ఇవి...! అతను నిర్దేశించిన "హమ్మురాబీ కోడ్"ని చదివితే ఈ విషయం ఎవరికైనా అర్థం అవుతుంది!

అతని ధర్మసూత్రాలన్నీ కంటికి కన్ను - పంటికి పన్ను విధాన సాగినవే! నేరం ఆరోపించిన వాడు దాన్ని నిరూపించాలి లేకపోతే చంపి పారేయమన్నాడు.

ఒక బిల్డరు ఇల్లు సరిగా కట్టించకపోయినందువలన ఆ ఇల్లు కూలిపోయి, దానిని కొనుక్కున్నవాడి కొడుకు చనిపోతే, ఆ బిల్డరు కొడుకుని చంపెయ్యటమే శిక్ష అన్నాడు.

ఇంత కఠిన శిక్షలు అమలు చేసినవాడు ఆడదానిని హీనంగా చూసినా, ఆమెకు ద్రోహంచేసినా, ఆమెకు తగిన గౌరవం ఇవ్వకపోయినా నరికి పారేయాలని శాసించి వుంటే, అతని పేరు చిరస్థాయిగా వుండి వుండేది... గొప్ప సంస్కర్తగా!

కానీ, అక్కడి సామాజిక పరిస్థితులు అందుకు అవకాశం ఇవ్వలేదు.

**స్త్రీ స్వేచ్ఛను అపహరించటానికి కారణాలు :**

నిరంతర యుద్ధాలలో ఓడినవారిని పట్టి తెచ్చి బానిసలుగా, చేసుకోవటం మామూలే! ఆ బానిస స్త్రీల ద్వారా సంతానాన్ని కనటం కూడా సహజం. యుద్ధాలలో జయాలు కలుగుతున్న కొద్దీ, అక్కడి ప్రజల ఇళ్ళలో బానిస స్త్రీల సంఖ్య పెరుగుతూ

రావడం... దాంతో పాటే, బానిసస్త్రీల సంతానం కూడా పెరుగుతూ రావటం ఒక మామూలు విషయం అయిపోయింది. ఈ పరిస్థితులలో ఆ అక్రమ సంతానానికి ఎలాంటి స్టేటస్ ఇవ్వాలనేది పెద్ద సమస్య అయ్యింది.

1. ఆ బిడ్డనీ, ఆ బానిస స్త్రీని తీసుకొని అతను వేరే కాపురం పెట్టాలా?

2. ఆ బిడ్డను తన బిడ్డలతో కలిపి పెంచాలా?

3. ఆ బానిస స్త్రీకి భార్య హోదా ఇవ్వాలా.

హమ్మురాబీ ఈ ప్రశ్నలకు సమాధానాలు వెదకలేకపోయాడు. రండాగర్భాలు రాకుండా బానిస స్త్రీలను అదుపు చెయ్యటం ఒక్కటే పరిష్కారం అనుకొన్నాడు. అసలు ఆడదానికి స్వేచ్ఛ స్వతంత్ర్యత, సొంత ఆలోచనలు, సొంత ఊహలు, సొంత కలలు ఇలాంటివేవి ఉండనీయకూడదని నిర్ణయించుకున్నాడు.

1. మొగుడు ఎప్పుడు కోరితే అప్పుడు స్త్రీ సెక్సుకు అంగీకరించాలి. అక్రమ సంతానం బానిస సంతతిగానే పెరుగుతుంది. ఒక వేళ తండ్రి అంగీకరిస్తే ఆస్తిలో వాటా వస్తుంది. లేకపోతే లేదు.
2. ఆడదాని 'మానం'పైన ఆమె భర్తకు లేదా యజమానికి మాత్రమే హక్కుంటుంది! దానిని పరపురుషుడు వినియోగించరాదు. పరపురుషుడి బారిన పడనీయకుండా తన స్త్రీల విషయంలో పురుషుడు ఎంత కఠినంగానైనా వ్యవహరించవచ్చు.
3. 'నాకీ మొగుడు వద్దు' అనగానే సరిపోదు – అందుకు సహేతుకమైన కారణం చూపించాలి. చూపించలేకపోతే, ఆ భర్త ఆమెకు ఎలాంటి భరణం లేకుండానే విడాకులు ఇచ్చి వదుల్చుకోవచ్చు.
4. ఆమెదే తప్పు అని తేలితే, ఆ భర్త ఆమెను దాసీ స్త్రీగా మార్చుకోవచ్చు.
5. ఒక భార్యకు సంతానం కలగకపోతే, ఆమె తన పరిచారికను భర్త దగ్గరకు పంపి ఆమె ద్వారా సంతతి పొందవచ్చు. అలా పుట్టిన బిడ్డ ఆమె బిడ్డే అవుతాడు.
6. భార్య మంచాన పడితే, భర్త మరొక స్త్రీని భార్యగా తెచ్చుకోవచ్చు.
7. పెళ్ళయిన ఆడది పరాయి మగాడితో కూడివుండగా పట్టుబడితే, ఆ ఇద్దరినీ ఎత్తి నదిలో పారేయాలి. యూఫరేట్స్ నదిలో పడేస్తే తప్పు చేసినవారు మునుగుతారు. మంచి వాళ్ళయితే తేలతారని ఆనాటి నమ్మకం.
8. పెళ్ళయిన ఆడది వీధిలో పోయే వారివంక చూస్తూ, మూర్ఖురాలిగా ప్రవర్తిస్తే, తనని నిర్లక్ష్యం చేస్తోందన్న కారణంగా ఎలాంటి కారణమూ లేకుండానే భర్త విడాకులిచ్చి పంపించేయొచ్చు.

9. సన్యాసం తీసుకున్న ఆడది పానశాలకొచ్చి సారా తాగితే, ఆ స్త్రీని తగలబెట్టి చంపాలి.

10. సారా కొట్లో కూర్చుని రాజద్రోహానికి కుట్ర చేసిన వ్యక్తులు దొరకకపోతే, ఆ సారా కొట్టు యజమానురాలిని తెచ్చి నదిలోకి విసిరేయాలి.

11. సారా కొట్లో ధాన్యానికి తగినంత సారా పోయకుండా తక్కువ కొలిస్తే, ఆ సారా కొట్టు యజమానురాలిని పట్టి నీళ్ళల్లోకి విసిరేయాలి.

12. ఒక ఆడదానిని ఎవడైనా ఎత్తుకుపోయి, రేప్ చెయ్యకుండా వదిలేస్తే, ఆ ఎత్తుకుపోయినవాడు ఆమెను పెళ్లి చేసుకుతీరాల్సిన అవసరం ఏమీ లేదు. రేప్ చెయ్యలేదు కదా... 'మానం' సురక్షితం!

విశ్లేషిస్తే హమ్మురాబీ ప్రవర్తనా నియమావళిలో ఇలాంటి అంశాలు చాలా వున్నాయి. హమ్మురాబీ నుంచి మనువు దాకా, మనువు నుంచి మన దాకా, ఇదే తరహా ఆలోచనా విధానం ఇంకా కొనసాగుతోందనటానికి గాంధార దేశంగా సిలువబడిన ఆఫ్ఘనిస్తాన్ ప్రత్యక్ష సాక్షి! 'మనువాదులు' అంటే హమ్మురాబీ సూత్రాలే కావాలని కోరుకుంటున్నవాళ్ళని అర్థం.

ఇష్టం వున్నా, లేకపోయినా, ఆరోగ్యం వున్నాలేకపోయినా, రోగం వచ్చినా రొప్పు వచ్చినా వారానికి నాలుగుసార్లు భర్తతో విధిగా సెసక్సులో పాల్గొనితీరాలనే నిబంధన తెచ్చినవారు హమ్మురాబీకి అసలు వారసుడు కాదనగలమా?

ఆఫ్ఘన్ పరిణామాలను పరిశీలిస్తే ఇది నిజమేననిపిస్తుంది.

ప్రపంచ మేధావులు ఇలాంటి సంఘటనలు జరిగినప్పుడు స్పందించక పోవటం ఆశ్చర్యమే మరి! ఇలాంటి ఆఫ్ఘన్ల చట్టాన్నే రేపు ఇంకొక దేశమూ ఓట్ల లాభం కోసం ప్రవేశ పెడ్తానంటుంది. నాలుగు దేశాలు ఇలా చేస్తే అదే అంతర్జాతీయ న్యాయ సూత్రంగా అనుసరణీయమూ, ఆదర్శమూ అయిపోతుంది.

రాజకీయ కారణాలతో అగ్రరాజ్యాలవారు, నిర్లిప్త ధోరణితో మన బోటి బడుగు దేశాలలోని మేధావులు ఖండించకుండా ఇలాంటి చట్టాన్ని సహించటం మొదలు పెడితే, నాడు కౌరవ సభలో భీష్మద్రోణాదులు గుడ్డిగా చేసిన తప్పే చేసినట్లవుతుంది. రేపటి ప్రపంచం దాని దుష్ట ఫలితాలు అనుభవించవలసి వస్తుంది.

అక్కడ ఏ మతం వున్నదన్నది కాదు – ఆ ప్రభుత్వం మహిళా వివక్షను ప్రదర్శించిందనేది వాస్తవం. అది మానవ హక్కుల ఉల్లంఘన కిందకు రాదా? చరిత్ర నేర్పుతున్న పాఠాలను నేర్చుకోకపోతే చరిత్ర పునరావృతమయి తీర్తుందని ఆఫ్ఘన్ మరోసారి నిరూపించింది!

**చివరిగా ఒక మాట :**

సమాజం సుస్థిరత కోల్పోయినప్పుడు స్త్రీలకు హక్కులూ, మానవ హక్కులూ అనేవి మూలబడతాయి. సుస్థిరత ఏర్పడిన తర్వాత కోల్పోయిన ఈ హక్కుల్ని పునరుద్దరించటానికి ప్రజా ఉద్యమాలు అవసరం అవుతాయి. అమెరికాలో అయినా, ఆఫ్ఘనిస్తాన్ అయినా, ఇండియాలో అయినా ఇదే వాస్తవం. స్త్రీల హక్కుల గురించి మనం పదే పదే మాట్లాడుతూ వుండాలి. అవసరం అయితే పోట్లాడుతూ ఉండాలి.

# లైంగిక వేధింపులు

ఒక మహిళ హత్య చేయబడితే, ఆ మహిళకి ఎవడితోనో ప్రేమ వ్యవహారం (లేదా) అక్రమ సంబంధం వుందనే కోణంలోంచి వార్తలు రాస్తున్నారు. సభ్యసమాజం ఇలాంటి వార్తా విధానాన్ని ఖండించేంత తెగువ చూపించలేకపోతుంది. ఇది మహిళల పట్ల అపచారం కాదా...?

భారతదేశంలో మహిళల లైంగిక వేధింపుల కేసుల్ని కేంద్రప్రభుత్వ శిశు మరియు మహిళాభ్యుదయ శాఖ పర్యవేక్షిస్తూ ఉంటుంది. నేషనల్ కమీషనర్ ఫర్ ఉమెన్ ఇందుకు బాధ్యత వహిస్తుంది. ఈ శాఖ అందించిన లెక్కల ప్రకారం, దేశంలో 10, 155 లైంగిక వేధింపు కేసులలో ఆంధ్రప్రదేశ్ నుంచి అత్యధికంగా 2,024 (19%) కేసులు, ఉత్తరప్రదేశ్ (1,887 (18.6%) , తమిళనాడు 1,718 (16.9%) కేసులు నమోదయినట్లు తెలుస్తోంది. దేశంలో ఇంచుమించు నాలుగోవంతు లైంగిక వేధింపుల కేసులు మన రాష్ట్రంలోనే జరుగుతున్నాయన్న మాట.

**ఏది లైంగిక వేధింపు ?**

లైంగిక వేధింపు (లేదా) లైంగిక హింస (Sexual Harasment) అనే పదం లైంగికంగా భయపెట్టినప్పుడు (intimidation), బెదిరించినప్పుడు (bullying), లేక బలవంతం చేసినపుడు (wercian) వర్తిస్తుంది. చేసిన ఉపకారానికి బదులుగా లైంగిక సుఖాన్ని కోరటాన్ని లైంగిక వేధింపుగా నిర్వచిస్తారు. ఆడది మగవాడికన్నా తక్కువ అనే భావనతో, లింగవివక్షత (gender discrimination) ప్రదర్శించటం, స్త్రీని తక్కువ చేసి మాట్లాడడం, తూలనాడడం కూడా లైంగిక వేధింపులే అవుతాయి. అంతేకాదు, ఉద్యోగినుల పట్ల, విద్యాలయాలలో విద్యార్థినుల పట్ల అతిగా ప్రవర్తించడం (transgression) చికాకు పెట్టి వేధించటం (annoyance) కాళ్ళు చేతులు తగిలించి ఆనందించటం.. చివరికి రేప్ దాకా తెగించటం ఇవన్నీ అంతో ఇంతో మహిళలు మగవాళ్ళవలన పొందుతున్న అవమానాలే !

ముఖ్యంగా విద్యా రంగంలో ప్రొఫెసర్లు యూనివర్సిటీ అధికారులు

చాలామంది తమ క్రింద పనిచేసే పరిశోధక విద్యార్థినులంతా అభ్యంతరకరంగా వ్యవహరించేతీరు అందరికీ తెలిసినా, చాలా సందర్భాలలో రహస్యంగా అణిగిపోతుంది. పైకి చెప్పుకోలేని ఈ దుస్థితి - అమెరికాలోనే ఆందోళనకరంగా ఉందంటే, చట్టాల అమలు అరకొరగా వుండే భారతదేశంలో అది ఎన్ని వెర్రితలలు వేస్తుందో ఊహించవచ్చు.

**లైంగికంగా వేధించేది పెద్దమనుషులే !:**

పంజాబ్ మాజీ పోలీస్ అధికారిగా ఉన్నప్పటి కన్వర్ పాల్‌సింగ్ గిల్ అనే కె.పి. యస్ గిల్ గారి పేరుని తలచుకోకపోతే భారతదేశంలో లైంగిక హింస గురించి తక్కువ పరిశీలన చేసినట్లవుతుంది. రూపన్ దేవల్ బజాజ్ అనే ఐ.ఎ.ఎస్ అధికారిణిని ఒక పార్టీలో, తన స్థాయిని మరచిపోయిన స్థితిలో గిల్ గారు లైంగికంగా వేధించాడని ఆమె కోర్టుకెక్కింది. ఇందిరాజైసింగ్ అనే ప్రసిద్ధ మహిళోద్యమ నాయకురాలు ఈమె తరఫున వాదించింది. పంజాబ్‌కోర్టు గిల్ గారికి 3 నెలలు జైలుశిక్ష 2 లక్షల జరిమానా విధించింది. ఆ తర్వాత ఆయన సుప్రీంకోర్టుకు వెళ్ళాడు. అది వేరే కథ.

మార్చి 2008లో ఒరిస్సా అసెంబ్లీ స్పీకర్ ఒక లేడీ మార్షల్ పట్ల అలానే అసభ్యంగా ప్రవర్తించి అభిశంసనకు గురి అయ్యాడు. అయితే, ఒక ఒరిస్సా మంత్రిని ఈ కేసులో బలిపశువును చేసి స్పీకర్ గారిని తప్పించగలిగారు.

సెప్టెంబర్ 2004 లో కేరళ మంత్రి నాడార్ ఒక డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్‌ని లైంగికంగా వేధించిన కారణంగా ఒక సంవత్సరం జైలుశిక్ష ఎదుర్కోవాల్సివచ్చింది. జష్పూర్ జిల్లా జైలు సూపరింటెండెంటు ఒక మహిళా కానిస్టేబుల్‌ని లైంగికంగా వేధించినట్లు 18 జూలై, 2009న ఒక వార్త వెలువడింది. (UNI)

ఎ.కె. చోప్రా అనే అధికారి తన క్రింది మహిళా ఉద్యోగినిని వేధించిన కారణంగా విచారణ జరిపిన ఎంక్వయిరీ ఆఫీసర్ ఆయనను తక్షణం ఉద్యోగంలోంచి డిస్మిస్ చేశాడు. దానిపైన హైకోర్టు అతని నేరాన్ని పట్టించుకోకుండా, అతన్ని తొలగించిన విధానాన్ని తప్పుబట్టి తిరిగి ఉద్యోగం ఇప్పించింది. సుప్రీంకోర్టు ఈ విషయమై ఆగ్రహం వ్యక్తంచేస్తూ, న్యాయస్థానాలు మహిళల ఆత్మగౌరవాన్ని పరిగణనలోకి తీసుకోకపోవటాన్ని తీవ్రంగా నిరసించింది. ఆమెకు క్షమాపణ చేప్తానని వేడుకొన్నాడు చోప్రా. ఇప్పటికే చాలా ఆలస్యం అయ్యింది-" అంటూ చోప్రాని తిరిగి తొలగించింది సుప్రీంకోర్టు (21 జనవరి 1999 ఇండియన్ ఎక్స్‌ప్రెస్)

కేరళ పబ్లిక్ వర్క్స్ మంత్రి పి.జె.జోసెఫ్ తనని కింగ్ ఫిషర్ విమానంలో లైంగికంగా వేధించాడని శ్రీ పెరంబదూరు మెజిస్ట్రేట్ కోర్టులో ఒక టెలివిజన్ యాంకర్ 'లక్ష్మి గోపకుమార్' కేసు వేసింది. 16 అక్టోబర్ 2006న కోర్టు జోసెఫ్‌ని సాక్ష్యాలు

లేని కారణంగా విముక్తున్ని చేసింది. అన్ని సాక్ష్యాలూ సమకూర్చుకున్నాకే వేధింపులు చేయించుకోవాలనే సూక్ష్మాన్ని మహిళలు అర్థం చేసుకోవాలన్నమాట.

**సుప్రీం కోర్టు 'విశాఖ' మార్గదర్శకాలు :**

అమెరికాలో లైంగిక హింస గురించి 1975లో మహిళలు ఉద్యమించడం ప్రారంభించాక, భారత్ సహా అన్ని దేశాలు ఐక్యరాజ్యసమితి కూడా అటువైపు దృష్టి సారించాయి. Sexual Harresent of women in work places (ఉద్యోగినుల లైంగిక వేధింపులు) పైన అమెరికా సివిల్ రైట్స్ 1964 (VII) ప్రకారం లింగ వివక్షతని ఒక చట్టపరిధిలోకి తెచ్చారు. 1980లో Equal Employment Oppotunity Commission (EEOC) స్త్రీ పురుషులిద్దరికీ సమాన ఉద్యోగావకాశాల కమీషన్ ఉద్యోగినులను సాటి ఉద్యోగుల వేధింపుల నుంచి రక్షించేందుకు ఉద్యమించింది.

ఐక్యరాజ్యసమితి – అంతర్జాతీయ మానవ హక్కుల సంఘం ద్వారా స్త్రీలను కించపరచటాన్ని నిరోధించే ఒక చర్యావేదిక (Convention on the Elimination of all forms of Discrimination Against Women CEDAW) ను నిర్వహించి, కొన్ని మార్గదర్శకాలను రూపొందించి ప్రపంచ దేశాలకు అందించింది. భారతదేశంలో లైంగిక హింస నివారణా చర్యలకు ఈ సూత్రాలే మూలాధారం.

1997లో సుప్రీంకోర్టు 'విశాఖ గైడ్ లైన్స్' పేరుతో ఈ సూత్రాలకు అనుగుణమైన సూచనలు కొన్ని చేసింది.

ఈ విశాఖ మార్గదర్శకాల రూపకల్పన వెనక ఒక కథ వుంది. రాజస్థాన్‌లో అగ్రవర్గానికి చెందిన ఒక కుటుంబం ఏడాది నిండని చంటి పిల్లకు బాల్య వివాహం చేస్తుంటే భన్వరీదేవి అనే సాంఘిక కార్యకర్త ఆ పెళ్ళిని ఆపుచేయాలని ప్రయత్నించింది. దాంతో ఆగ్రహించిన పెళ్ళివారు ఐదుగురు కలసి ఆమెను దారుణంగా మానభంగం చేశారు. కానీ, ట్రయల్ కోర్టు ఆ ఐదుగురినీ నిర్ధోషులుగా వదిలేసింది. దాంతో దేశవ్యాప్తంగా పెద్ద గగ్గోలు పుట్టింది మహిళోద్యమ ముఖ్యులు కొందరు విశాఖ అనే ఒక సంస్థగా ఏర్పడి, దాని పక్షాన సుప్రీంకోర్టుకు ఈ కేసుని తీసుకువెళ్ళారు. సుప్రీంకోర్టు భారతీయ మహిళల ఔన్నత్యాన్ని గుర్తించాలనీ, లైంగిక వేధింపుని చట్టపరమైన నేరంగా పరిగణించాలని ప్రభుత్వానికి సూచిస్తూ తీర్పుచెప్పింది. ఈ సూచనలనే "విశాఖ గైడ్ లైన్స్" అంటారు.

25 జూన్ 2001న డిపార్ట్‌మెంట్ ఆఫ్ కంపెనీ ఎఫయిర్స్ తరఫున 7 మంది సభ్యులతో కంప్లయింట్ కమిటీని నియమించారు. అప్పటికే సుప్రీంకోర్టు కంప్లయింట్ కమిటీ తీర్పు తిరుగులేనిదని ఒక భరోసా ఇచ్చి ఉంది.

భారత రాజ్యాంగం 14వ ఆర్టికల్ ప్రకారం లింగవరంగా స్త్రీ పురుషులిద్దరూ సమానమే! 21వ ఆర్టికల్ ప్రకారం మహిళల జీవితమూ, జీవనమూ గౌరవ ప్రదంగా వుండాలి.

ఆదర్శ ప్రాయంగా ఈ విషయాలు రాజ్యాంగంలో పొందుపరచుకున్నాంగానీ, మన రక్తంలో, మన సరఫరాల్లో జీర్ణించుకుపోయిన పురుషాధిపత్యభావం స్త్రీ సమానత్వాన్ని అంగీకరించనిస్తుందా? "వాడికేమిట్రా? మగాడు–" అని మగాళ్లు, ఆడవాళ్ళు కూడా అంటూనే వుంటారు. పిల్లల్ని అలానే పెంచుతున్నాం మనం. పెద్దయ్యాక వాడు కూడా అలానే తనని తాను భావించుకొంటున్నాడు.

ఈ నేపథ్యంలోంచే మన దేశంలో The Sexual Harasment of women at work places - prevention, prohibition and redrenal - బిల్లు 2006 ఏర్పడింది. ఉద్యోగినుల హక్కుల పరిరక్షణ ఈ బిల్లు ఉద్దేశం. ఏ మాత్రం లైంగిక వేధింపులకు అవకాశం ఇవ్వకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నదై ఉండాలని ఈ బిల్లు సూచిస్తుంది.

**వేధింపుల వెనుక అధికార మదం :**

పురుషహంకారాలకి అధికార మదం తోడయితే, అతనితో కలసి పనిచేసే ఉద్యోగినులకు అతను కీచకుడు, దుశ్శాసనుడు, రావణుడులా కన్పిస్తాడు.

'పవర్ ప్లే' అంటారు దీన్ని. చిన్న ఫైలు మీద సంతకం చేయాలన్న బదులుగా సెక్సును కోరటాన్ని చట్టపరమైన సాంకేతిక పరిభాషలో Quid Pro Quo అంటారు. This for that దాని భావం "దాని కోసమే ఇది–" అన్నట్లు వ్యవహరిస్తాడు.

ఒక్కో అధికారికి ఒక్కో స్టయిల్ ఉంటుంది.

1. కన్న తండ్రిగా, పెద్దన్నగా నటిస్తూ, మంచి తనంతో దగ్గరకు తీసి అవకాశం దొరికినప్పుడు వేధింపులు పెడతాడు. ఎవరికైనా చెప్పినా నమ్మనంత పెద్ద మనిషిలా నటిస్తాడు – ఒకడు.
2. అపర దుర్వాసుడిలా వ్యవహరిస్తూ, అసభ్య పదజాలం ఉపయోగిస్తూ, లొంగకపోతే కుదరదన్న భావనని ఉద్యోగినుల్లో కల్గిస్తాడింకొకడు. లేదు - కాదు అంటూ పదే పదే తిప్పితే చచ్చినట్టు దారికొస్తుందని వాడి నమ్మకం.
3. ఇంకొందరివి పరోక్ష వేధింపులు. నీకీ పని కావాలంటే నాకావిడ దక్కేలా చేయమని ఇంకొకణ్ణి ప్రలోభ పెడతాడు. Third Party Sexual Harasment అంటారు దీన్నే.
4. చీకట్లో తడుముకుంటూ దేవుళ్ళాడినట్లు క్రింది ఉద్యోగినుల శరీరాన్ని తాకుతూ (Groper) ఆనందించే వాడింకొకడు.

పై అధికారులుగా పురుషులు పనిచేస్తున్న ప్రతిచోట ప్రభుత్వ యంత్రాంగం,

మీడియా కూడా గట్టి నిఘా పెట్టకపోతే లైంగిక వేధింపులు పురుషుల జన్మహక్కుగా మారిపోతాయి. పై అధికారి స్థాయికి చేరుకోగలిగేది యాభైలు దాటిన వృద్ధులే కదా... అనుకోకండి. ఇప్పటి వరకూ వెలుగులోకి వచ్చిన లైంగిక వేధింపు రాయుళ్ళంతా 50 ఏళ్ళు పైబడ్డ పురుష పుంగవాలే!!

**లైంగిక వేధింపులు ఇలానే కొనసాగితే... :**

ఉద్యోగాలు చేసే మహిళల సంఖ్య నానాటికి పెరుగుతోంది. భర్త సంపాదనకంటే భార్య సంపాదనే ఎక్కువగా వున్న సంసారాల సంఖ్య కూడా పెరుగుతోంది. పురుషాధిక్య రంగంగా పేరుబడ్డ ఐ.టి రంగంలోకి మహిళలు చొచ్చుకొస్తున్నారు. టాటా, ఇన్ఫోసిస్, విప్రో లాంటి సంస్థల్లో మహిళా ఉద్యోగుల సంఖ్య గత ఏడాదికన్నా 1-2% పెరిగినట్లు తెలుస్తోంది. ఇన్ఫోసిస్‌లో క్రిందిస్థాయి ఉద్యోగుల్లో 40% మధ్యస్థాయి మేనేజ్‌మెంట్‌లో 13% ఉన్నతస్థాయి మేనేజ్‌మెంట్‌లో 8% మహిళా ఉద్యోగులు పనిచేస్తున్నారట. ఆకాశంలోనూ, అవకాశాల్లోనూ చెరిసగంగా దూసుకొస్తున్న మహిళలకు పనిచేసే చోట లైంగిక వేధింపులు లేని వాతావరణం వుండాలి. ఈ వేధింపుల్ని పట్టించుకోకుండా ఇలానే వదిలేస్తే...

1. ఉద్యోగాలలో ప్రతిభాపాటవాలు ప్రదర్శించే అవకాశాలు తగ్గిపోయి మహిళలు ఉన్నత కెరీర్‌ని నిర్మించుకోలేకపోతారు. వేధింపుల కారణంగా పనిదినాలలో గైర్హాజరు (Absenteeism) పెరుగుతుంది. అది కంపెనీలకు ఆర్థికంగా నష్టదాయకం అవుతుంది.
2. మధ్యలో పని మానుకొని వెళ్ళిపోయేవారి సంఖ్య (Resignations) పెరిగితే ఆయా కంపెనీల, సంస్థల సమర్థత కూడా పడిపోతుంది.
3. గాసిప్‌లు వ్యాప్తిచేయటంవలన తన బతుకును బజార్లో స్క్రూటినీకి పెట్టినట్టు అవమాన భారంతో మహిళ కృంగిపోతుంది. డిప్రెషన్, యాంగ్జయిటీ, నిద్రానాశనం, పీడకలలు, అవమానభారం, ఒంటరితనం, అపనమ్మకం, ఆత్మన్యూనతాభావం లాంటి మానసిక లక్షణాలు పెరిగి, పని సమర్థతని కోల్పోతారు. కేవలం తోటి ఉద్యోగుల లైంగిక వేధింపుల కారణంగా ఉద్యోగినులు-ఇలా అయితే, ఆ కంపెనీ దివాళాతీసే పరిస్థితి వస్తుంది. పురుషహంకారం ప్రదర్శించిన పురుష ఉద్యోగులు కూడా చివరికి వీధిన పడాల్సివస్తుంది.

ఇదంతా జాతి పురోభివృద్ధికి ఆటంకంగా తయారవకముందే దేశం మేల్కోవాలని హెచ్చరించటం ఈ వ్యాసం లక్ష్యం. ఎక్కడ స్త్రీలను ఆదరిస్తారో, గౌరవిస్తారో, వాళ్ళ ఆత్మాభిమానానికి విలువిస్తారో ఆ కంపెనీ అభివృద్ధి చెందుతుందని దీని భావం.

ఐ.ఎ.ఎస్ స్థాయి ఉన్నత మహిళలే ఫిర్యాదులు చేయగలుగుతున్నారు. కాబట్టి భారతదేశంలో వెలుగులోకి వచ్చిన లైంగిక వేధింపు కేసుల్లో పై స్థాయి మహిళలే కన్పిస్తున్నారు. క్రింది స్థాయి మహిళా ఉద్యోగినులు గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ మౌనంగా భరిస్తున్నారు.

ఎస్.సి. ఎస్.టి చట్టంలో దళితులను సామాజికంగా కించపరిస్తే కఠిన శిక్షలున్నాయి. ఇలాంటి చట్టమే మహిళలకు కూడా వుండాలి. ఆడది అనే చిన్న చూపును ఎవరు ఏ రకంగా ప్రదర్శించినా పదునైన చట్టం ద్వారా శిక్షించగలిగితే గాంధీగారు కన్నకల నిజమైన స్వరాజ్యం, నిజమైన స్త్రీ స్వేచ్ఛ లభించినట్లవుతుంది. వేధింపు రాయుళ్ళకు సాంఘిక బహిష్కరణ విధించాలి.

# 'గృహహింస' నివారణ సాధ్యమేనా?

సమాజాభివృద్ధి అనేది ఒక పరిణామ క్రమంలో జరుగుతూ వస్తోంది. ఆదిమ సమాజంలో ఆడదే ఆదిశక్తి. కానీ ఆదిమ సమాజం ఆర్థిక సమాజంగా మారుతున్న కొద్దీ 'తండ్రి' ప్రాబల్యం క్రమంగా పెరుగుతూ వచ్చింది. సమాజాభివృద్ధికి పురుషుడేకారకుడని సామాజికవేత్తలు కూడా గట్టిగానే నమ్ముతున్నారు. అందుకు స్త్రీ పాత్ర ఏమీ లేదనే ధోరణివలన స్త్రీ 'అబల' అయ్యింది. అప్రధానం అయ్యింది! అశక్తురాలయ్యింది!

స్త్రీలకన్నా పురుషులకు దేవుడు ఎక్కువ తెలివితేటలిచ్చాడు ఇస్లాం ప్రవచిస్తోంది. తనకు సంక్రమించిన ఎక్కువ తెలివి తేటల్ని ఉపయోగించి ఎక్కువ ఆదాయం చెయ్యగల శక్తి స్త్రీల కన్నా పురుషులకే ఎక్కువ వుంది. (ఖురాన్ 5-4-6)

క్రైస్తవ మతగ్రంథమైన బైబిలు (2-2-28) కూడా స్త్రీలను ఒక ఆస్తి హక్కుగా భావించింది. మీ స్త్రీలు మీ పొలాల్లాంటివారు; వారిని మీకు ఇష్టమైన రీతిలో పొందవచ్చు. పురుషుల కోసం స్త్రీలు సృష్టించబడ్డారే గాని, పురుషుడు స్త్రీ కోసం సృష్టించబడలేదు" (కొరంథీయులు 11-9).

"సమాజ పరిణామంలో స్త్రీ" అనే గ్రంథంలో డి.బి.ఎస్. ఆర్.సి.హెచ్ మూర్తి - "సోక్రటీస్", "అరిస్టాటిల్" లాంటి తత్త్వవేత్తలు సకల పాపాలకు స్త్రీయే మూలమని ఒకరు, మగజాతి ఆడజాతి కన్నా అధికులు అని ఒకరూ అన్నారని వివరిస్తూ ఇలా వ్యాఖ్యానిస్తాడు.

"దీని ప్రకారం స్త్రీలు పరిపాలింపబడేవారు - పురుషులు పరిపాలించే వారు! స్త్రీలు బానిసలు - పురుషులు యజమానులు! సమాజంలో పురుషాధిక్యత ఏర్పడిననాటి

నుండి, పురుషునికి ప్రథమ స్థానాన్ని ఒసంగి స్త్రీని ద్వితీయ స్థానానికి నెట్టటం జరిగింది. పురుషునికి సంతానాన్ని కనియిచ్చే ఒక యంత్రంగా స్త్రీ మారిపోయింది. పురుషునికి భార్యగా జీవించటమే స్త్రీకి గౌరవం అయ్యింది! మానవుడు జంతుదశ నుండి నాగరికుడుగా మారటానికి ప్రముఖ పాత్ర వహించిన స్త్రీలు పితృస్వామ్యంలో గృహబానిసలుగా మార్చబడ్డారు".

అలా మొదలయ్యింది "గృహబానిస"ల "గృహహింస"! దీనికి వేల ఏళ్ళ చరిత్రే వుంది!

**గృహ హింసకు ఆధారాలు :**

1985లో Dick stein అనే వర్జీనియా మెడికల్ కాలేజీ వైద్యుడి పరిశోధక బృందం అనేక మమ్మీలను ఎక్స్‌రేల ద్వారా పరీక్ష చేసి చూసింది. అత్యంత ఆశ్చర్యకరంగా 30 నుంచి 50 శాతం స్త్రీ మమ్మీల తలకాయల్లో పెద్ద ఫ్రాక్చర్లు ఉన్నట్టు కనుగొన్నారు. అంటే, భద్రపరచబడిన ఈ స్త్రీ శవాలు తలకుబలమైన గాయం తగలడంవలనే మరణించిన వారివై వుంటాయని ఆయనొక నిర్ధారణకు వచ్చారు.

కేవలం 9-20% పురుష మమ్మీల తలల్లోనే ఫ్రాక్చర్లు కన్పించాయి కాబట్టి, ఆ స్త్రీలు గృహ హింస కారణంగానే మరణించారని మనం గట్టిగా భావించవచ్చు. మమ్మీల పగిలిన కపాలాలను రెండువేల నుండి మూడువేల నాటి గృహహింస పురావస్తు ఆధారాలుగా గుర్తిస్తున్నారు శాస్త్రవేత్తలు.

ప్రాచీన హెవెనిస్టిక్ సామ్రాజ్యంలో - మాటవినని భార్యని కొట్టే హక్కుని చట్టప్రకారం భర్తలకు సంక్రమింపజేసినట్లు రోమ్ క్లాసికల్ సాహిత్యం బలమైన సాక్ష్యాలే ఇస్తోంది. భార్య కూడా బానిసేకాబట్టి కొట్టే హక్కు యజమానికి సంక్రమిస్తుంది.

క్రీ.శ 300 వరకూ ఈ పరిస్థితి కొనసాగగా, ఆ తర్వాత కొంతకాలం పాటు, భర్తహింస మరీ ఎక్కువైతే, విడాకులు తీసుకొనే హక్కు భార్యలకూ ఇచ్చారట. కానీ అది ఎక్కువకాలం సాగలేదు. క్రైస్తవ ఛాందసవాదులు, హిందూ ఛాందసవాదులకు తక్కువ తిన్నవారేమీకాకపోవటమే ఇందుకు కారణం!

**ప్రాచీన రోమన్ల గృహహింస :**

16 ఏళ్ళ ఆడపిల్లని 30 ఏళ్ళ మగాడికిచ్చి పెళ్ళి జరపటం గ్రీకులు, రోమన్లకు ఒక ఆచారం ఆనాడు ప్రతి ఆడదీ కనీసం ఆరు కాన్పులైనా కనాలిట! పుట్టి, పోయిన వావళ్ళు పోగా మిగిలిన వారే జనాభా!

అగస్టిన్ చక్రవర్తి తనచిన్ననాడు తనతల్లి, ఆమె స్నేహితురాళ్ళ ముఖాలమీద గాట్లు, వాతలు చూసినట్లు రోమన్ క్లాసికల్ సాహిత్యంలో గృహహింసకు సంబంధించిన చిన్న ఆధారం ఒకటి కన్పిస్తుంది. నీరో చక్రవర్తి కూడా గర్భవతి అయిన తన భార్యని కొట్టాడట!

ఇలాంటివి మన పురాణ కథల్లోనూ వున్నాయి. భార్యను హింసపెట్టిన రాజులూ వున్నారు - మహర్షులూ వున్నారు. ఎవరిదాకానో ఎందుకు అహల్యని అనుమానించి గౌతముడు పెట్టింది గృహహింస కాదా...? సీతచేత అగ్ని ప్రవేశం చేయించి, నేను మామూలు మనిషినే ననుకొంటున్నాను, నన్ను నేను దేముణ్ణి అనుకోవటం లేరు - మనుష ధర్మాన్ని పాటిస్తున్నాను' అని రాముడి చేత అన్పించిన వాల్మీకి ఈ సంఘటనకు దైవపరమైన కారణాల్ని ఆపాదించినప్పటికీ, భార్యను అనుమానించి అగ్నిగుండంలో దూటానికి కారకుడైనభర్త కచ్చితంగా గృహహింస చట్టపరిధిలోకే వస్తాడు.

రోమన్లు మొదట తమలో తామే పెళ్ళిళ్ళు చేసుకునే వాళ్ళు. క్రమేణా వాళ్లు ఆ అలవాటుని మాని, బైట సంబంధాలు చేసుకోవటం మొదలుపెట్టారు ఇందుకు ముఖ్యమైన 3 కారణాలను ఒక పరిశోధకుడు ఇలా విశ్లేషించాడు.

1. అయిన సంబంధం అమ్మాయి అయితే, మాటిమాటికీ పుట్టింటికెళ్ళి "కొట్టాడు తిట్టాడు" అని చెప్తుంటుంది.

2. బైట నుంచివచ్చిన పిల్లయితే, కొట్టినా, తిట్టినా, తన్నినా చచ్చినట్లు ఇంట్లోనే పడి వుంటుంది. తప్పించుకొని పుట్టింటికి పారిపోలేదు.

3. బైట పిల్ల అయితే ఇష్టారాజ్యంగా కొట్టవచ్చు. తిట్టవచ్చు మొహమాట పడనవసరం లేదు.

ఆధునిక ఆంగ్ల సాహిత్యంలో The murder of regella (A case of domestic violence in antiquity) అనే నవల చాలా ప్రసిద్ధి పొందింది. హార్వర్ట్ విశ్వవిద్యాలయం ప్రచురణ ఇది. SARAH B POMEROY దీని రచయిత. ఈ నవలలో రెగిల్లా రాజవంశ స్త్రీ హెరోడెస్ ఎట్టికస్ ఆమె భర్త ఆమె ఆరవసారి గర్భవతిగా వున్నప్పుడు పొట్టమీద తన్ని ఆమె చావుకు కారణం అయ్యాడు. ఈ ఇతి వృత్తాన్ని గృహహింసకోణంలో పెద్ద నవలగా వెలువరించాడు రచయిత.

క్లియోపాత్ర, ట్రాజన్ యువరాణి హెలెన్ లాంటి చారిత్రక వ్యక్తులు గృహహింసకు గురి అయినవారే!

**మహిళా ఉద్యమం వెలుగులోకి తెచ్చిన గృహహింస :**

1970 దశకంలో మహిళాఉద్యమం గృహహింసకు వ్యతిరేకంగా ప్రపంచ ప్రజల అభిప్రాయాన్ని సమీకరించటంలో గొప్పవిజయం సాధించిందనే చెప్పాలి! అమెరికా ఈ విషయంలో ముందుగా ముందడుగు వేసింది!

అమెరికన్ కుటుంబ వ్యవస్థ గురించి జరిపిన ఒక సర్వేలో ప్రతి ముగ్గురు స్త్రీలలో ఒకరు భర్త చేతిలో దెబ్బలు తిన్నవారేనని తేలింది 4 నుంచి 6 మిలియన్ల స్త్రీలు ఏటా గృహహింసకు అక్కడ గురి అవుతున్నారట. ప్రపంచ వ్యాప్తంగా

చూసుకున్నప్పుడు ఈ సంఖ్య మరింత పెరిగే అవకాశం వుంది. భర్త, అత్తమామలు, ఆడపడుచులు, కుటుంబంలో సమీపబంధువులు, సవతి తల్లులు హింసించటానికి కారెవ్వరూ అనర్హులు!

మొగుడు కొడితే, గుడ్లనీళ్ళు కుక్కుకునే స్త్రీలున్న భారతదేశంలోనే కాదు, అమెరికాలో కూడా గృహహింస కేసులేవీ ధైర్యంగా బైటకురావటం లేదు. "hard to stop because hard to report అనేది గృహహింస విషయంలో అమెరికాలో కూడా మేధావుల్ని పట్టి పీడిస్తున్న అంశం. గృహహింస బాధితులు బైటపడి చెప్పుకోకపోతే, గది నాలుగు గోడలమధ్య జరిగే ఈ వ్యవహారం బైటకెలా వస్తుంది? గృహహింసను ఆపటం ఎలా సాధ్యపడ్తుంది.

తన భవిష్యత్తు, తన పిల్లల భవిష్యత్తు, తన కుటుంబ గౌరవం, తన పుట్టింటి ప్రతిష్ట- ఇన్నింటినీ హింసించబడ్తోన్న ఆ స్త్రీ ఆలోచిస్తోంది. హింసపెడ్తున్న వారికి ఇదే లోకువ! నాలుగు తన్ని 'దిక్కున్న చోట చెప్పుకో' అంటాడు మొగుడు - ఆమె అలా చెప్పుకోలేదనే ధైర్యంతో!

మరి దీనికి పరిష్కారం ఏమిటి? పరిష్కారాన్ని వెదికేముందు సమస్య మూలాల సమగ్ర అధ్యయనం జరగాలి! మన రాష్ట్రానికే పరిమితం అయి ఆలోచిద్దాం. మన సమాజంలో కుటుంబ వ్యవస్థ ఎలా వున్నది-? అందులో స్త్రీల పాత్ర ఎంత? గృహహింసకు బలి అవుతున్న స్త్రీలు ఎంతమంది-? ఎందుకు హింసించబడ్తున్నారు? ఇలాంటి అంశాలమీద గట్టి సర్వే చేపట్టిన సంఘటన వున్నదా?

మనందరికీ తెలుసు - ప్రతి ఇంట్లోనూ గృహహింస వుంది - కానీ, మనకు తెలిసినవి ఊహాగానాలే గాని, వాస్తవ పరిస్థితిని అధ్యయనం చేసినవి కావు.

**గృహహింసపై సాధికారికమైన సర్వే జరగాలి :**

పై పైనచేసే సర్వేల వలన వాస్తవాలు పూర్తిగా వెలుగులోకి రావు సర్వే నిపుణులకు జుడిషియల్ అధికారాలిచ్చి దేశంలో న్యాయ వ్యవస్థగాని, పోలీస్ వ్యవస్థగాని, పూనుకుని గృహహింసపై సాధికారికమైన సర్వే జరిపిస్తే గాని అసలు వాస్తవాలు బైటపడవు.

అమెరికాలో న్యాయవ్యవస్థ ఇందుకుముందుకొచ్చింది. "నేషనల్ క్రైమ్ విక్టిమైజేషన్ సర్వే" పేరుతో ఒక సర్వేను చేయించింది. ఈసర్వే ప్రకారం అమెరికాలో ప్రస్తుత భర్తలు, మాజీభర్తలు, పురుష స్నేహితులు - వీరంతా గృహహింసకు కారకులేనని తేలింది. హత్యలు, రేప్‌లు, లైంగిక వేధింపులు, దోపిడీలు, హింసాత్మక చర్యల్లాంటివి ఎన్నోనేరాలు ఈ గృహహింసలో భాగంగానే జరిగినట్లు ఈ సర్వే నిగ్గుతేల్చింది.

హత్యలకు గురి అవుతున్న స్త్రీలలో 70-80% హత్యలు గృహహింస కారణంగానే జరుగుతున్నాయి. ఒక స్త్రీ హత్యకు గురయితే దాన్ని 'గృహహింస'

అనే కోణంలోంచి చూసే అలవాటు మనదేశంలో లేదు. ఇటీవల వెఱ్ఱి పోకడలుపోతున్న మీడియా – ఆ స్త్రీకి అక్రమసంబంధం ఎవరితోనో వున్నదనే ఊహాగానాలను వ్యాప్తిచేసి, ఆ ఫలానా వాడిని వెంటనే అరెస్ట్ చెయ్యలేదని కథనాలు ప్రచురించటం, ప్రసారం చెయ్యటం ఒక సాధారణ అంశంగా మారింది! తద్వారా గృహహింసకు పాల్పడిన భర్తలేదా సమీప బంధువులు చాకచక్యంగా తప్పించుకొంటున్నారు – కేసు పక్కదారి పడ్తోంది!

తగలబడుతున్న నవ వధువుల గురించి ప్రేమించలేదని యాసిడ్ పోసేవాళ్ళ గురించి, పీకలకోసే వాళ్ళ గురించి ఎన్నో కథలు కథనాలు మనం చూస్తున్నాం. వింటున్నాం. సంఘటన జరిగినప్పుడు అందరూ గుండెలు బాదుకొంటారు. ఊరేగింపులు ధర్నాలు చేస్తారు. మర్నాడు కథమామూలే! ఎక్కడివారక్కడే "గప్‌చిప్‌సాంబారుబుడ్డి" ఇదే నేరస్తులకులోకువౌతున్న అంశం!

2008లో వరంగల్‌లో యాసిడ్ పోసిన ప్రేమికుడినీ, వాడి సహచరుడినీ ఎన్‌కౌంటర్ చేస్తే, బూటకపు ఎన్‌కౌంటర్‌లను ఖండించేవారు కూడా ఈ ఇద్దరి ఎన్‌కౌంటర్‌నీ హర్షించారు.

దృఢమైన వైఖరికావాలని, కఠినమైన శిక్షలు అమలుజరగాలని ప్రజలు కోరుకొంటున్నారని దీని అర్థం! గృహహింసకు దారితీసే కుటుంబపరమైన అంశాల గురించి సాధికారికమైన అధ్యయనం చేయటానికి ముఖ్యంగా పోలీస్ వ్యవస్థ పూనుకోవాలని మరీ మరీ కోరుకుంటున్నాను.

**గృహహింస రక్షణ చట్టం :**

గృహహింస అనేది మానవ హక్కుల అంశం. మహిళా గృహహింస రక్షణ చట్టం, 2005 (43వ చట్టం) సెక్షన్ –1 లోని ఉపసెక్షన్ –3లో వున్న అధికారాలకు లోబడి కేంద్రప్రభుత్వం 26 అక్టోబర్ 2006 నుంచి అమలు అయ్యేవిధంగా గృహహింస చట్టాన్ని తీసుకువచ్చింది. దీన్ని 'మహిళా గృహహింస రక్షణ చట్టం 2005' అంటారు.

బాధితురాలి రిపోర్ట్‌చాలు – సాక్ష్యాలు అవసరం లేకుండానే శిక్ష వేయించే అవకాశం ఉన్నబలమైన చట్టం ఇది. కానీ, స్త్రీలు బైటపడి ముందుకు వస్తేనే ఈ చట్టం అమలు సాధ్యం అవుతుంది. హింసపెట్టిన వారికి తగిన శిక్షతో పాటు, హింసకు గురి అయినందుకు తగిన పరిహారం చటుక్కున అప్పటికప్పుడు అందుతాయి కూడా!

1994 వియన్నా ఒప్పందం బీజింగ్ ప్రకటన 1995 అంతర్జాతీయ నిర్ణయాలు, ఐక్యరాజ్యసమితిలోని స్త్రీ వివక్ష నిర్మూలన సంఘం సిఫారసులు – వీటన్నిటి నేపథ్యంలో స్త్రీలను అన్నిరకాల హింసనుంచి, ప్రత్యేకించి కుటుంబపరమైన హింసనుంచి రక్షించేందుకుఈ చట్టం ఏర్పడింది!

అయితే, స్త్రీ ధైర్యం చేసి, బైటకువచ్చి, తాను గృహహింసను ఎదుర్కొంటున్నట్లు రిపోర్ట్ ఇవ్వాలి! ఇది అమెరికాలోనే సక్రమంగా అమలుకావటం లేదు - ఇంక ఇక్కడి సంగతి వేరే చెప్పాలా? దీన్ని సద్వినియోగపరచటానికి తగిన మార్గాలు మనం వెదకాలి!

**మానసిక శాస్త్రం ప్రకారం గృహహింస వర్గీకరణ :**

గృహహింస అనేక రకాలుగా వుంటుంది. ఒక్కో స్త్రీకి ఒక్కో తరహా హింస! లత రాసిన 'ఇది తులసి వనం' నవల గుర్తున్న వారికి గృహహింస ఎలా వుంటుందో బాగా తెలుస్తుంది. మనో విశ్లేషణ శాస్త్రం గృహహింసని ఇలా వర్గీకరిస్తోంది.

**1. మానసిక హింస ( Emotional Abuse) :-**

అదేపనిగా విమర్శించటం; ఆమె తరపు స్నేహితుల్ని బంధువుల్ని దూరం చెయ్యటం, నలుగురిలోను అవమానించటం, పనికి సరిగా పోనీయకుండా అడ్డుకోవటం; భార్య సంపాదన పైన ఆధిపత్యం కావాలనటం, ఇంట్లో కూర్చుని భార్య సంపాదనని తినడం చీటికీ మాటికీ "వదిలేస్తాను - పుట్టింటికి పంపించేస్తాను-" అని బెదిరించటం, చస్తే చావండి - ఈడ్చిపారేస్తాను-" అనటం, కట్టు కథలు చెప్పి మోసగించటం, ఇతర స్త్రీలతో అక్రమ సంబంధాలు పెట్టుకుంటాననటం... ఇలా ఎన్నో.. మాటలతో తూట్లు పొడిచే వ్యవహార శైలిని "ఇమోషనల్ అబ్యూజ్" అంటారు.

**2. శారీరక హింస (Physical Abuse) :**

కిందపడేయటం, తోసెయ్యటం బైటకుగెంటేయటం, చేదికందిన దాన్ని విసిరి కొట్టటం, అగ్ని ప్రమాదాల్లాంటివి సృష్టించి అందులోకి నెట్టెయ్యడం, మర్మావయవాలను, సున్నితమైన అవయవాలను గాయపరచి ఆనందించటం, శాడిజాన్ని ప్రదర్శించే ఈ ధోరణుల్ని చాలామంది స్త్రీలు భరిస్తున్నారు - గట్టి సర్వే జరిగితే, గృహహింస అసలు స్వరూపం బైటకువస్తుంది!

**3. లైంగిక హింస (Sexual Abuse) :**

ఆమె అందుకు సుముఖంగా వున్నదా లేదా అనేది పట్టించుకోకుండా భర్త లైంగిక కార్యానికి తలపడటం, (లేదా) భార్యని అందుకోసం బలవంతపెట్టటం, ఆమెకు ఏమీ చేతకాదు, ఆమె సంసారానికి పనికిరాదని నిందించడం, తన మర్మావయవాలను చేతితోనూ నోటితోనూ తాకాలని బలవంతం చెయ్యటం, ఆమెను లైంగిక సుఖానికి దూరంగా ఉంచి తగినశిక్ష వేస్తున్నాననటం, అయినదానికీ కానిదానికీ అనుమానించటం, తనకన్నా అందంగా వుందని అసూయపడటం, ఇదంతా ఎక్కువమంది స్త్రీలు అనుభవించే వేదనే!

వీటిని స్త్రీలు బైటకొచ్చి ఎలా చెప్పుకొంటారు? వాళ్ళతో చెప్పించగలిగే ఉపాయం ఏదైనా ఉందా?

**గృహ హింస నివారణకు కొన్ని సూచనలు :**

1. మహిళా పోలీసుస్టేషన్లు, పోలీసురక్షణలు ఇవన్నీ ఇల్లు వదలి పోలీసు స్టేషనుదాకా రాగలిగినప్పుడే స్త్రీలకు సహకరించే అంశాలు. గృహహింసను ప్రతిఘటించగలగాలంటే తప్పని సరిగా పోలీసుఊతం ఉండాలి!
2. చంపటం, చచ్చేంత పరిస్థితి తెచ్చిపెట్టటం దాకా గృహహింస పేట్రేగిపోతోంది!
3. పోలీసుయంత్రాంగం సరాసరి ఇంటింటి తలుపుతట్టి ఆ యింట్లో గృహహింస పరిస్థితులు ఎలావున్నాయో అధ్యయనం చేయిస్తేనే ఈ గృహహింస ఆగుతుంది!
4. మలేరియా ఇన్‌స్పెక్టర్ ప్రతి 10-15 రోజులకొకసారి ఇంటింటికీ వచ్చి ఆరోగ్య కుశలం కనుక్కొని వెళ్తుంటాడు. అలాగే, న్యాయ పరమైన వ్యవస్థతో సంబంధం వున్న మహిళా సంక్షేమ తనిఖీ అధికారిణి ఇంటింటికీ వెళ్ళి తనిఖీ చేయగలిగితే గృహహింస వాస్తవాలు వెలుగులోకి వస్తాయి. ప్రతిఇంట్లో స్త్రీ పరిస్థితి ఎలా వుందో ఒక రికార్డు మెయింటైన్ చేయించాలి. ఇది నెలకు కనీసం రెండు సార్లు నిరంతరం జరుగుతూ వుండవలసిన ప్రక్రియ.
5. మహిళా సంక్షేమ తనిఖీ అధికారిణి ప్రతి ఇంట్లో కుటుంబసభ్యుల్ని పరిచయం చేసుకుని వాళ్ళతో ముచ్చటిస్తూవుంటే, వాళ్ళ మాటలతీరుని బట్టి ఆ యింట్లో గృహహింస వుందని చాలా తేలికగా పసిగట్ట గలుగుతారు.
6. నవ వధువులు, పని పిల్లలు, కోడళ్ళకి బలి అవుతున్న అత్తలు, మూలనపడ్డ ముసలమ్మలు, ముసలయ్యలు, ఆధారపడి బతుకుతున్న విధవలు, వికలాంగులు, పెళ్ళి కాకుండా ఉండిపోయిన ఆడపడుచులు... వీళ్ళందరికీ ప్రభుత్వం తప్పనిసరిగా రక్షణ కల్పించాలి. వారి వివరాలు వెలికి తీయాలంటే మహిళా తనిఖీ అవసరం!
7. మహిళా సంక్షేమ ఇన్‌స్పెక్టర్స్ లేదా మహిళా సంక్షేమ విజిలెన్స్ ఆఫీసర్లుగా తప్పని సరిగా స్త్రీలే వుండాలి. ఈ విజిలెన్స్ అధికారిణులు ఇలా తరచూ ఇంటికి వచ్చి తనిఖీ చేస్తుంటే, నిఘా నడుస్తోందనే భయం గృహహింస చాలావరకూ దానికదే అదుపు అవుతుంది. అలాగే, అధికారిణి అండవుందనే ధైర్యంతో హింసించబడుతున్న స్త్రీలు బైటపడి వాస్తవాలు వెల్లడించేందుకూ వీలు కలుగుతుంది.
8. పోలీస్ వ్యవస్థ లేదా న్యాయ వ్యవస్థ పరిధిలోని గృహహింస విజిలెన్స్ సెల్ ఆధ్వర్యంలో ఈ మహిళా సంక్షేమ తనిఖీ అధికారులు చిత్తశుద్ధితో పనిచేయడం

వలన, ఉత్తత్తి మలేరియా ఇన్స్పెక్టర్ తనిఖీలా కాకుండా అర్థవంతంగా అమలు జరిగేందుకు వీలౌతుంది.

9. పోలీస్ స్టేషన్‌కు వచ్చి రిపోర్ట్ చెయ్యటానికి ఏ స్త్రీ కూడా ఎందుకు ముందుకు రాదంటే, ఆవెనకే 'మగవాడు' ఎత్తులూ జిత్తులూ ప్రయోగించి కేసులేకుండా చూసుకోగలుగుతాడు కాబట్టి! ఆ తర్వాత గృహహింస పెరుగుతుందే గాని తగ్గదు.

ఇది కేవలం ప్రభుత్వం మాత్రమే ఆపగలిగే అంశం కాదు. గృహ హింస మహిళా సంరక్షణ చట్టాన్ని ప్రజలలో బాగా వ్యాప్తిలోకి వచ్చేలా అందరమూ చూడాలి. ముఖ్యంగా స్వచ్ఛంద సేవా సంస్థలు ముందుకొచ్చి ఈ చట్టంలోని ముఖ్యాంశాలను తేలిక భాషలో కరపత్రాలుగా అచ్చొత్తించి ఇంటింటికీ పంపిణీ చెయ్యటం మొదలు పెట్టాలి! గృహహింస సామాజిక నేరం అనీ, దానికి తగిన శిక్ష అనుభవించవలసి వుంటుందనే వాస్తవాన్ని చాటిచెప్పాలి. రచయితలు,కళాకారులు ముందుకొచ్చి ఈ చట్టంలోని వివరాలను బాగా ప్రచారం చెయ్యాలి.

రాజకీయనాయకులు ఈ చట్టం అమలుకు చిత్తశుద్ధితో సహకరిస్తే చాలు - ప్రజలు, మేధావులు, సామాజిక వేత్తలు దీన్ని ప్రజాపరం చెయ్యగలుగుతారు.

అందరూ కలిస్తేనే మహిళా రక్షణ సాధ్యం అవుతుంది. భార్యాభర్తల్ని కలిపి, ఆ అనుబంధాన్ని పటిష్టపరిచి, సుఖ సంసారం సమకూరేలా చూడటమే ఈ కార్యక్రమం మొత్తానికి అంతిమలక్ష్యం కావాలి!!

# ఆకాశంలో సగానికి రాకాసి గాయాలు!

15 సంవత్సరాల క్రితం గుంటూరు జె.కె.సి కాలేజీలో ఇంటర్ చదువుతున్న నూకవరపు ప్రసన్నలక్ష్మిని మెకానిక్ సుబానీ గొడ్డలితో నరికి చంపాడు. పదేళ్ల క్రితం విజయవాడ శారదా కళాశాలలో డిగ్రీ చదువుతున్న రావూరి శ్రీలక్ష్మిని తోటి విద్యార్థి మనోహర్ కత్తితో పీకకోసం చంపాడు ఆరేళ్ళ క్రితం వరంగల్ ఇంజనీరింగ్ విద్యార్థినులు ప్రణీత, స్వప్నికల మీద సమీప వ్యక్తులే యాసిడ్ పోయగా ఒకరు మరణిస్తే, ఇంకొకరు శాశ్వత అంగవికలులయ్యారు. 'మమత' చేత పురుగుమందు తాగించి చంపిన మధులాంటి రాక్షస కామాంధులకు బలయిన రజితలు, లక్ష్మీ సుజాతలు, అయేషాలు, సమీరాలు, భార్గవీలు రుక్మిణీలు రాజమండ్రిలో తల్లిదండ్రుల్ని కూడా కోల్పోయిన అనూష... ఎందరో ఇలా కామోన్మాదుల చేతుల్లో విగత జీవులో వికృత రూపులో అవుతున్న అబలల పేర్లు కన్పిస్తాయి. వీళ్ళందరినీ నిర్భయలంటున్నాం ఇప్పుడు.

మహిళల మీద లైంగిక అత్యాచారాలు, ప్రాణహాని కల్గించే దాడుల్ని నిరోధించటానికి కఠోర శిక్షలు విధించాలని, యాసిడ్ దాడికి పదేళ్ల జైలు వెయ్యాలనీ కొంతమంది న్యాయనిపుణులు సూచిస్తున్నారు. వరంగల్ ఎన్‌కౌంటర్ తర్వాత కూడా రాజమండ్రి అనూష వరకూ ఎందరో పీకలు తెగి, యాసిడ్‌కు కాలినేల కూల్తూనే వున్నారు.

నిజానికి శిక్షలు వేయాల్సిన కోర్టు, కామోన్మాద దాడులు చేసిన వాళ్లు మరణశిక్షను సైతం తప్పించుకుంటోన్నారు. స్త్రీలపై ఎటువంటి నేరాలకు ఒడిగట్టినా కఠోర శిక్ష విధించాల్సిందేనని దేశ సర్వోన్నత న్యాయస్థానం ఏనాడో చెప్పింది. అయినా శ్రీలక్ష్మిని పీకకోసి చంపిన వాడికి నామమాత్రపు శిక్షే పడింది!

ఇలాంటి సంఘటన ఏదైనా జరగంగానే, మన మేధావులు అప్పటికప్పుడు తమ బుర్రకుతోచింది వ్యాఖ్యానించేస్తుంటారు. హైదరాబాద్‌లో ఏ విషయం గురించైనా అనర్గళంగా అభిప్రాయాలు చెప్పగల రెడీమేడ్ ఆస్థాన విద్వాంసుల మూతి దగ్గర గొట్టాలు పెట్టి న్యూస్ ఛానల్స్ ఆ రోజంతా అదే సంఘటనని పదే పదే చూపించి ఊదర గొట్టేస్తుంటారు. మర్నాడో, ఆ మర్నాడో ఆ విషయాన్నే అందరూ మరిచిపోయి ఇదంతా ప్రభుత్వ చేతకానితనమేనని నేరాన్ని అటుమళ్లించేస్తే అందరి బాధ్యతలూ తీరిపోతాయి.

**కొత్త యవ్వనంలో కొత్త మనోవికారం "కామహింస"**

నిజంగా ఇది శాంతిభద్రతల అంశమేనా? ఇలాంటి సంఘటనలు జరగకుండా చూడవలసింది పోలీస్ యంత్రాంగం మాత్రమేనా? ఒక్కసారి నిదానించి మరోకోణంలోంచి మరిన్ని అంశాలు పరిశీలిస్తే కొత్త యవ్వనంలో ప్రవేశించే కొత్త మనోవికారంగా ఈ 'ప్రేమోన్మాదం' కన్పిస్తుంది.

1. యవ్వనం తొలిదశలో ఇంకా ఊహలు విప్పారని వయసులో later adolescents. early adults అని పిలవదగిన కొత్త యువకుల్లో ప్రేమోన్మాదం అనేది ఒక మానసిక వికారం. అది శాంతి భద్రతల పరిస్థితిని ఒక దశలో తెచ్చిపెట్టవచ్చునే గాని, అదే శాంతి భద్రతల సమస్యకాదు. అది మానసిక శాస్త్రపరమైన అంశం!
2. కార్లోన్ టక్కార్, హాల్వెర్న్ బృందం ఉత్తర కొరొలీనా విశ్వవిద్యాలయంలో మాతా శిశు సంరక్షణ విభాగం కోసం "partner violence among adolescents in opposite sex romantic relationships - "నవ యవ్వన కాలంలో స్త్రీ పురుషుల మధ్య కామ సంబంధాలు - హింస" అనే అంశం మీద చేసిన అధ్యయనంలో 7500 మంది ఆడ మగపిల్లల్ని పరిశీలిస్తే, అందులో 65

శాతం మంది తాము ఏదో ఒక సందర్భంలో లైంగిక వేధింపులకు గురయ్యామని పేర్కొంటే, 12 శాతం మంది తాము తీవ్రమైన హింసని ఎదుర్కొన్నట్టు పేర్కొన్నారు! మన విశ్వ విద్యాలయాలుగాని, మాతా శిశు సంక్షేమ శాఖగాని, మానవ వనరుల శాఖగాని ఇలాంటి అధ్యయనం చేసినట్టు తెలియదు. సమస్యని ఖండిస్తాంగాని, అది ఏర్పడటానికి కారణాల్ని వెదికే అలవాటు, ఓపిక మనకు లేకపోవటమే కదా అనర్థాలకు మూలమౌతోంది!

3. ఎల్లెన్ ఫ్రైడ్‌రిక్స్ అనే పరిశోధకుడు, కళాశాలల్లోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ జరిగే కామోన్మాద చర్యలు దాంపత్య జీవితంలో గృహహింస లాంటివేనని, వృత్తి వ్యాపారాలలోనూ, ఉద్యోగాలలోనూ మహిళలు ఎదుర్కొనే లైంగిక హింసలాంటిదేనని పేర్కొన్నాడు. ప్రాణహాని, అంగవైకల్యం కల్గించే హింస జరిగినప్పుడు మాత్రమే మనం 'ఉన్మాదం' అనే పేరుపెట్టి పతాకశీర్షికలు పెడ్తున్నాం. అంతకుమించిన శారీరక, మానసిక హింసలెన్ని జరుగుతున్నా పట్టించుకోము.

చిన్నక్లాసుల్లో పిల్లలు - చదువు, ఇల్లు, అమ్మానాన్నలు, టీచర్లు కొద్దిమంది స్నేహితులకు మాత్రమే పరిమితమై ఉంటారు. పై చదువులు, వృత్తి విద్యల్లోకి వచ్చాక స్నేహితులతో గడపడం ఎక్కువ అవుతుంది. మానసిక సమస్యలు ఇక్కడే ఎక్కువ ప్రారంభం అవుతాయి.

ఆడపిల్లల మీద మగపిల్లల మీద వారివారి స్నేహితుల వత్తిడి అనేక రకాలుగా వుంటుంది. సిగరెట్లు తాగటం, ఆల్కహాలు రుచి చూడటం, ఇంట్లో చెప్పకుండా సినిమాలకు స్నేహితులతో కలిసి వెళ్ళటం, ఆడపిల్లలు మగపిల్లలు కలిసి తిరగటం- ఇలాంటివెన్నో అంశాలు చోటుచేసుకునే వయసది! ఆ వయసులో ఉన్నప్పుడు మనం ఎలా వున్నామో ఎవరికి వారు వెనక్కి వెళ్ళి జ్ఞాపకం చేసుకొంటే చాలా విషయాలు అర్థం అవుతాయి. స్నేహితుల వత్తిడిని peer pressure అంటారు. 'పీర్' అంటే సమవయస్కులు, స్నేహితులే కావాలని లేదు. ఒక్కోసారి పరిచయస్థులు కూడా కావాల్సిన అవసరం లేదు. తమకు తెలియకుండానే 'పీర్ ప్రెషర్' కు లొంగిపోతుంటారు సహజంగా ఆ వయసులో!

**కామహింసకు కాలేజీలే వేదికలు :**

మన రాష్ట్రంలో కామోన్మోద చర్యలు జరిగినవి ప్రధానంగా డిగ్రీస్థాయి విద్యార్థినుల మీదే! సమవయస్కులు చేసిన దాడులే ఎక్కువ. "పీర్ ప్రెషర్"ని సమగ్రంగా అధ్యయనం చేస్తే "మృగాడు" గా మారుతున్న సమ వయస్కుల్ని ముందుగానే గుర్తించే అవకాశం వుంది.

ఇది మానసిక సమస్య. దీన్ని శాంతి భద్రతల విషయంగా మాట్లాడితే సమస్య పక్కదారిన పడ్తుంది! కామ హింసని కూడా ర్యాగింగ్ లాగేన, విద్యాలయాల సహకారంతో ఎదుర్కోవటం గురించి మనం ఆలోచించాలి. తల్లిదండ్రుల్ని కూడా దీనిలో భాగస్వాముల్ని చేయాలి? ప్రభుత్వం చట్టపరంగా విద్యాలయాలకు ఈ బాధ్యతని అప్పగించటం అవసరం. ఇక్కడే ఒక విషయాన్ని ప్రస్తావించటం అప్రస్తుతం కాదనుకొంటాను. తోటివయసు పోకిరీలతో పాటు కొన్ని విద్యాలయాల్లో ఉపాధ్యాయులు, ఆఖరికి కళాశాల యాజమాన్యంలో ముఖ్యులు కూడా మృగాళ్లుగా ప్రవర్తిస్తున్నారు! సాక్షాత్తూ ఒక ప్రజాప్రతినిదే స్వయంగా తన కళాశాలలో విద్యార్థినులను లైంగికంగా వేధించిన ఆరోపణలను ఎదుర్కొన్నప్పుడు రాజకీయాలకు అతీతంగా స్పందించలేకపోయిన మన మేధావులు ఇలాంటి మానసిక సమస్యల గురించి ఎంత నిర్మాణాత్మకంగా ఆలోచించగలరో అనుమానమే! అయినా వ్యవస్థ ఇంకా కుళ్లిపోలేదు. బాగు చేసుకోగలిగే స్థితిలోనే వుంది!

**ఎవరి బాధ్యత ఎంత ?**

నవ యువతరం మీద తోటి వ్యక్తుల వత్తిడి, లైంగిక వేధింపుల గురించి కొన్ని ముఖ్యాంశాలు పరిశీలిద్దాం.

1. చిన్నపిల్లల్లో వుండే నిజాయితీ, సత్య సంధతలు నవ యువతీ యువకుల్లో కూడా ఇంకా మిగిలే వుంటాయి. యువతరం అంతా ఆల్కహాలికులు, తిరుగుబోతులు, పొగరుబోతులు, నిరర్థకులు అనవద్దు. అలా వుండాలని వాళ్ళంతగా వాళ్ళు కోరుకోరు.
2. తోటి వాళ్ల వత్తిడి కొంతమేర పనిచేస్తున్న దాన్ని అధిగమించే మనోబలాన్ని వాళ్లకి కల్గించే వ్యవస్థ మనకున్నదా!

   (అ) క్లాసు పుస్తకాల్లోంచి నైతిక విలువలు నేర్పే పాఠ్యాంశాల్ని, భాషా సంస్కృతుల విషయాల్ని ఎత్తేసి ఏం సాధించారో ఈ సమాజానికి విద్యావేత్తలు జవాబు చెప్పి తీరాలి.

   (ఆ) నైతిక విలువలు, ప్రేమ, కారుణ్యం లాంటి మనోప్రవృత్తుల్ని మనసులో కలిగించే సాహిత్యం స్వాతంత్ర్యానంతరం మనకు ఎంత వచ్చింది? మన రచయితలకు అది అంటరాని అంశంగా ఎందుకు మారిపోయింది?

   (ఇ) యువతీ యువకులకు తెల్సిన ఒకే ఒక కళ సినిమా! ఈనాటి సినిమాల్లో హీరోలు ప్రేమోన్మాదుల్లా ప్రవర్తిస్తూ, ఆడపిల్లల్ని వేధించటం హీరోయిజంగా చూపిస్తున్నారు. తమని ఎంత వేధిస్తే ఆడపిల్లలు అంత ఇష్టపడతారనే భావాన్ని మగపిల్లల్లో కల్పిస్తున్నారు. ఇది జాతికి ద్రోహం చేయటం కాదా? ఇలాంటి

ద్రోహాలకు పాల్పడి వ్యవస్థని కుళ్లపెడుతున్న హీరోలు, హీరోయిన్లే ఎన్నికల నాటికి రాజకీయ తీర్థాలు పుచ్చుకొని తామొక్కరమే ఈ జాతి ఉద్ధారకులం అంటుంటే, వారి నైతిక బాధ్యతని ప్రశ్నించవలసిన అవసరం లేదా?
కొందరు హీరోల వెర్రి వేషాలను నిజ జీవితంలో అంతకు పదిరెట్లు చేసి ఆచరించాలని ఏ కుర్రాడైనా అనుకొంటే, వాడిని ప్రేమోన్మాది, మృగాదు అంటున్నాం? వాడిలో ఆ ఉన్మాదాన్ని ఎక్కించిన హీరోని ధీరోదాత్తుడని కీర్తిస్తున్నాం?
(ఈ) ప్రేమంటే కావులించుకొని గంతులేయడం మాత్రమే... ఆ వయసులో ఆడపిల్లలకు, మగపిల్లలకు, అంతకన్నా తెల్సింది పెద్దగా వుండదు. వుంటే పబ్లిక్ పార్కుల్లోనూ, బస్టాండ్ బెంచీలమీదా అసహ్యంగా "డేటింగ్"లు ఎందుకు జరుపుతారు? వాళ్లల్లో ఆ అభిప్రాయాన్ని బలంగా నాటింది సినిమాలే! ప్రేమోన్మాది డేటింగ్ పేరుతో అలా తిరుగుదాం రమ్మని ఆదేశిస్తాడు. ఆమె సహజంగానే కాదంటుంది. వాడు యాసిడ్ పోసేస్తాడు. ఇంత సంఘటన జరగటానికి పెద్ద పథక రచనలేమీ అవసరం వుండదు. యాసిడ్‌నో, కత్తినో, బ్లేడునో సిద్ధం చేసుకోవటానికి కొద్ది సమయం తప్ప.
(ఉ) ప్రేమ అంటే ఆరాధన, అనురాగం, అభిమానం, పరస్పర గౌరవం అనీ, ప్రేమంటే త్యాగం అనీ తెలియ చెప్పే కథలుగానీ, నవలలుగానీ, సినిమాలు గానీ మనకు కల్పిస్తున్నాయా? ఏ హీరో అయినా సినిమాలో తను నిజంగా ప్రేమించిన వ్యక్తి కోసం ఏ త్యాగం అయినా చేస్తున్నాడా?
(ఊ) అందాకా వద్దు ఈ పది సంవత్సరాల కాలంలో హెడ్‌లైన్ల కెక్కినవిగాని ఎక్కనివిగాని కనీసం వందయినా ప్రేమ అఘాయిత్యాలు జరిగి వుంటాయి. "నాకీ లైఫ్ నచ్చలేదు" అని రాసి పెట్టి చచ్చిపోయిన ఆడపిల్లలకి నచ్చకపోయిన సంఘటన ఏమిటో మనకు తెలియదు. ఇన్ని సంఘటనలు జరిగినా, ఇంత అలజడి కలుగుతున్నా పీకలు కోసిన సంఘటన మీదగానీ యాసిడ్ పోసిన సంఘటన మీదగాని కనీసం ఒక నవల అయినా వచ్చిందా తెలుగులో... నిజంగా మేధావులమైన మనందరం బాధ్యతాయుతంగానే ఆలోచిస్తున్నామా...

**పురుషాధిపత్య భావానికిది పరాకాష్ట**

తోటి వ్యక్తుల లైంగిక హింస peer sexual Haressment కి వయోభేదం లేదు. మోనార్కె (రజస్వల) నాటి నుంచి మెనోపాజ్ నాటి వరకూ ఏదో ఒక సందర్భంలో మహిళలు లైంగిక హింసను ఎదుర్కొన్నవారే!

sexual Hareassment is about power, not sex పురుషులు పెట్టే లైంగిక హింస అనేది తన ఆహాన్ని చాటుకోవటానికే గాని, సెక్కుకుతి తీర్చుకోవటానికి

కాదని విశ్లేషకులు చెప్తారు. ప్రతి ఆడదాని మీద ప్రతి మగాడూ తన ఆధిపత్యాన్ని ప్రదర్శించటానికి ప్రయత్నిస్తాడు. చెప్పుకింద తేలులా ఆడది పడి వుండాలని కోరుకుంటాడు. ఈ రకమైన పురుష ప్రవృత్తిని self concept of superiority అంటారు. తన హీరోయిజాన్ని, తన పురుషాధిక్యతనీ ప్రదర్శించే సినిమాలు, ఎడ్వర్టయిజ్‌మెంట్లు ఇండియాలోనేకాదు అమెరికాలోనూ ఇలాంటి లైంగిక వేధింపులకు కారణం అవుతున్నాయి. ప్రేమకోసం ఆడదాన్ని దేహీ అని అడుక్కోవడమేమిటనుకునేవాడు ఖచ్చితంగా శాంతి భద్రతల పరిస్థితిని సృష్టిస్తాడు. ఆ మగాడిలో మృగం నిద్రలేస్తుంది. దాన్ని కనిపెట్టటం ఎట్లా? ఎవరు చేస్తారు? లైంగికంగా స్వాగతించని, ఇష్టపడని వ్యతిరేక ప్రవర్తన, ప్రాణాపాయ స్థితివరకూ తీసుకువెళ్లటాన్ని (any unwelcome behaviour of a nature that interferes with the life of targets) తోటి వ్యక్తుల లైంగిక వేధింపుగా (peer sexual Harassment) (shoop & edwards, 1994) నిర్వచిస్తోంది మానసశాస్త్రం.

ఈ లేత వయసులో మొలకెత్తే మృగభావాల్ని ఇంట్లో తల్లిదండ్రులు, బైట అచార్యులు, ప్రాచార్యులు, ఉపన్యాసకులు కూడా గుర్తిస్తూ దృష్టి పెట్టడం చాలా అవసరం. మృగాడిని ఎన్‌కౌంటర్ చేస్తేనో మరణశిక్ష విధిస్తేనో మృగాళ్లు పుట్టకుండా అగుతారనుకోవటం పొరబాటు.

1. రాజకీయనాయకులుగా మారిన సినీహీరోలు నవ యువకుల్లో మృగలక్షణాలు పెంచేందుకు, ఆ విధంగా ప్రోత్సహించేందుకు దోహదపడే పాత్రలు చెయ్యకుండా వుంటామని ఒట్టుపెట్టి రాజకీయాలు మాట్లాడాలి.
2. సామాజికాంశాలను పక్కకు పెట్టటంమాని, ఆడపిల్లలు పురుష దురహంకారానికి బలైపోతున్న సంఘటనలను పట్టించుకొంటూ రచయితలు మౌనం వీడాలి.
3. హెల్త్ ఎడ్యుకేషన్, సెక్సు ఎడ్యుకేషన్‌తో పాటు సెక్సువల్ బిహేవియర్‌ని కూడా పాఠ్యాంశాలుగా పెట్టగలిగే చొరవకలిగిన విద్యావేత్తలు సిలబస్ రూపకర్తలుగానో, పాఠ్యపుస్తకాల సెక్సువల్ బిహేవియర్ రయితలుగానో వచ్చేలా చర్యలు తీసుకోవాలి - ఆడపిల్లలకు తల్లులు నేర్పుతారు. కానీ మగపిల్లలకు ఇంట్లోగాని, బయట గానీ, అలా ప్రవర్తనని నేర్పుతున్న వ్యవస్థ మనకు లేదు. విద్యాలయాల్లో కౌన్సిలింగ్ వేదికలు ఏర్పడాలి.
4. "యాంటీసెక్సువల్ హరాస్‌మెంట్ పోలసీ"ని ప్రభుత్వం వెంటనే ప్రకటించాలి. విద్యాలయాలు అన్ని స్థాయిల్లోనూ ఈ పోలసీని విధిగా అమలు జరిపేలా విధాన ప్రకటన చెయ్యాలి.
5. కెరీర్‌ని నిర్మించుకొనే దశలో అన్ని సుఖాలను, అన్ని ఊహలను, అన్ని సరదా

సంతోషాలనూ పక్కనపెట్టి యువతీ యువకులు 'భవిష్యత్తు' బంగారం కావాలని ముందుకు దూసుకుపోతున్నారు. అందులో సగంమంది ఆడవాళ్ళే! కెరీర్ ధ్యాసలేని తోటి వ్యక్తులు రావణ కీచకులైతే ఈ ఆడపిల్లల 'కెరీర్' సర్వనాశనం అయిపోతుంది. ఆకాశంలో సగం కుప్పకూలిపోతుంది.

6. కొత్త యవ్వనంలో కామహింస అనేది మానసిక వికారం. అది శాంతి భద్రతల పరిస్థితిని తెచ్చేలా పెరగక మునుపే జాగ్రత్త పడవలసిన బాధ్యత అందరిమీదా వుంది!

# స్త్రీ పురుష సమానత్వం కోరే మహిళావాదం

మనది సెక్సిస్ట్ సమాజం! సెక్సిస్ట్ సమాజంలో స్త్రీ ఒక శారీరక వికలాంగి. Female is passive, అనీ, తనకు తానుగా ఏదీ చేయగలిగేది కాదని లోకం భావిస్తుంది. మానవ సంబంధాల పరిధిలో కాకుండా సెక్సు దృష్టితో స్త్రీ పురుష సంబంధాలను పితృస్వామ్య భావజాలం లెక్క కడుతుంది. తరతరాల సంస్కృతిలో భాగంగా సంక్రమిస్తూ వచ్చిన వారసత్వం ఇది మనకి!

స్త్రీకి 'శరీర స్పృహ' కలిగిన క్షణానే, తన శరీరాన్ని మగాడు స్వార్థానికి దుర్వినియోగం చేస్తున్నాడనే ఎరుక కలిగింది. పురుష వ్యతిరేకత, పితృస్వామిక సంస్కృతీ ధిక్కారాలతో కూడిన సాహిత్యానికి అలా బీజాలు పడ్డాయి. స్త్రీవాద సాహిత్యం సమాజ జాగృతిని సాధించగలిగింది. అది చాప కింద నీరులా కాదు, ఒక వెల్లువెత్తిన సముద్రంలా పురుషాధిక్యత పైన విరుచుకుపడింది. ఉద్యమ స్థాయిలో వ్యాప్తికావటాన 'స్త్రీవాద ఉద్యమం' బలంగా వ్రేళ్ళునుకుని, మహావృక్షమై ఎదిగింది. ఫలాలు మహిళలందరికీ దక్కాయి. అన్ని రంగాల్లోనూ స్త్రీలు ఆధిక్యత నిలుపుకోగలుగుతున్నారు. స్త్రీ పురుష వివాదాల్లో మగాడి పక్షాన, చట్టమూ, న్యాయమూ, ధర్మం కూడా నిలబడటం లేదు. ఇది గణనీయమైన మార్పు. తెలుగులో ఎన్నో సాహితీ విప్లవాలొచ్చాయి. కానీ, మహిళావాద సాహిత్యం తెచ్చిన మార్పు తక్కిన సాహితీ విప్లవ రూపాల కన్నాఎక్కువే!

లైంగిక సమర్థతని పెంచే ఔసధాలను వాజీకరాలని (aphrodisiacs) పిలుస్తారు. 'గుర్రంతో సమానమైన లైంగిక సమర్థతని ఇచ్చేవి' అని దీని అర్థం. అన్నింటికన్నా ఎక్కువ ఉత్తమ 'వాజీకరం' ఏది? అనే ప్రశ్న. మన శాస్త్రాలు 'స్త్రీ' అని ఠక్కున చెప్తున్నాయి. 'ఆడది అంటే లైంగిక కార్యానికి ఉపకరణం...' అనేది దీని భావం. మగవాణ్ణి రెచ్చగొట్టేందుకూ, సంతృప్తి పరచేందుకు 'ఆమె' ఉపయోగపడుతుంది. పుట్టిన నాటి నుండీ మగాడికి ఇదే చెప్తుంటారు... ఆడదంటే 'అందుకే'నని!

స్త్రీ వాదం పాశ్చాత్య ప్రభావం లోంచి తెచ్చిన అరువు భావజాలం అని కొందరంటారు. అది నిజం కాదు అది. ఆడవాళ్ల కడుపు మంటల్లోంచి పుట్టింది. గదిలో బంధించి హింసిస్తే తిరగబడేందుకు పిల్లికి పాశ్చాత్య అవగాహన అక్కరలేదు. స్త్రీవాదం అనేది మగదాష్టీకం పైన స్త్రీత్వం విసిరిన ఒక నిరసనాస్త్రం. అది సూటిగా 'గురి'ని తగిలింది. కానీ, ఎంత సూటిగా తగిలినా, బలిసిన పురుషాహంకారం పైన అది చిన్న గోటిగిల్లే! పురుష ప్రపంచంలో ఆధిపత్య భావజాలాన్ని స్త్రీవాదం పూర్తిగా తగ్గించలేకపోయినప్పటికీ, మగాడు వదిలేస్తే నుయ్యో గొయ్యో చూసుకునే రోజులకు కాలం చెల్లింది కదా...! అది స్త్రీ వాద విజయమే! స్త్రీవాద రచయిత్రులకే ఈ విజయం అంకితం కావాలి! ఇందులో పురుష రచయితలు తలదూర్చి ఆ ఘనతలో వాటాదారులు కాకూడదు.

'శరీర స్పృహ' పెంచుకో గలిగిన స్త్రీ 'తన దేహం పై తన హక్కు'ల గురించి ప్రారంభించిన పోరాటం ఇది. ఒక పునరుత్పత్తి కేంద్రంగా కాకుండా, అభివృద్ధికి నిలయంగా తనను తాను నిలుపుకోవాలనే చైతన్యాన్ని నేటి స్త్రీ గుండె నిండా నింపుకుంది. పురుషుణ్ణి ఆర్థిక వస్తువుగానూ, మాన ప్రాణ రక్షణకు కాచుకునే బాడీగార్డు గానూ, తాను అతని ఆధీనంలో జీవించే బానిసగానూ ఆధారపడి బతకాల్సిన అవసరం లేదని స్త్రీ గ్రహించింది. కలిసి నడవాలో లేక అహంకరించి వేరై పోవాలో తేల్చుకోవలసిన స్థితిలో ఇప్పుడు మగాడు పడ్డాడు. ఈ సామాజిక వాస్తవాన్ని గ్రహించగలిగిన వాడే నిజమైన మగాడు. లేనివాడు కాకుండా పోతున్నాడు. మగపిల్లలకు పెళ్ళిళ్ళు చేయటమే గగనంగా ఉందని ఇప్పటికే తల్లిదండ్రులు గోలపెడుతున్నారు. భవిష్యత్తులో భార్య వదిలేసిన వాళ్లకూ, భార్యని వదిలేసిన వాళ్లకూ పెళ్ళిళ్ళు కావటం అంత తేలికైన విషయం ఏమీ కాదు. దాష్టీకం ఎల్లకాలం చెల్లదని ఋజువయ్యింది. సీతను వదిలేశాక రాముడు శ్రీరాముడని అనిపించుకునే నైతిక హక్కు కోల్పోయాడు. గృహస్థు బిరుదాలు వదులుకున్నాడు. రాముడి పరిస్థితే అలా అయితే, ఇంక మామూలు మనిషులు బికారులూ బేవార్సుల సంఘంలో చేరటం తప్ప వేరే చోటు ఉండదు కదా!

రామాయణాన్ని సీత కోణంలోంచి 'సీతాయణం'గా వ్రాస్తే, అందులో రాముణ్ణి చెరవిడిపించి కాపాడుకోవటానికి సీత చేసే సాహసాలు ప్రధానంగా ఉంటాయి. అంటే, స్త్రీ స్వామ్య వ్యవస్థని తిరిగి తేవటం కాదు, స్త్రీ పురుష సమాన వ్యవస్థకు శ్రీకారం చుట్టటం!

మన సంస్కృతిని కాపాడుకోవటం అంటే స్త్రీ అణచివేతని కొనసాగించటంగా మతతత్వ వాదులు భావిస్తే అది తాలిబానిజం అవుతుంది. స్త్రీ వాదం ఒక మతానికి పరిమితమైన అంశం కాదు. స్త్రీకి స్వాతంత్ర్యం, పూజనీయ స్థానం ఇవ్వాలన్న

ధర్మశాస్త్రాలే ఎక్కువ! అయితే, 'పతికి మారాడక - పలుమరు లేద్వక...' లాంటి నీతి పద్యాలతో సమాజ అభ్యున్నతి సాధ్యం కాదు.

ఆశ్చర్య రామాయణంలో జనకుడు సన్యాసం తీసుకుంటా నన్నప్పుడు "అతిథి దేవోభవ అనే అదృష్టం కోల్పోతావు. పితృదేవోభవ అని పితృదేవతలకు తర్పణాలు విడిచి పుణ్యలోకాలు కల్పించే అవకాశాన్నీ, దేవతల్ని, మహర్షుల్ని అర్చించే భాగ్యాలన్నింటినీ కోల్పోతావు. చివరికి నీ బతుకు కుక్కబతుకు అవుతుంది. సోమరి ఏనుగుని చీమలూ, ఈగలూ పురుగులే తినేస్తాయి. పురుషార్థాలేవీ లేని నిన్ను కూడా అంతే! అవే తినేస్తాయి" అని అతడి భార్య తిట్టదండకం ఎత్తుకుంటుంది. స్త్రీ వాద సాహిత్యంలో ఈ మాత్రం పురుష నింద అవసరం, తిట్టి చెప్తేగానీ బుర్రకెక్కించుకో లేని స్థితిలో మగాళ్ళు ఉన్నారు కాబట్టి.

"ఆడవాళ్ళు మంచిగా బట్టలు కట్టుకుంటే మగాళ్ళు రేప్‌లెందుకు చేస్తారు?" అని ఒక స్వామీజీ కొలెస్ట్రాలెక్కువై ప్రకటిస్తే, ఒక కేంద్రమంత్రి దానికి వంతపాడితే తిట్టటం చాలదనీ, కొట్టి చెప్తేగానీ బుర్రలోకి వెళ్ళదనిపిస్తుంది. స్త్రీ వస్త్రధారణ పురుషుల్ని ఆకర్షించటానికేనా? గుండు గీయించుకుని తెల్ల ముసుగు వేసుకుని కూర్చున్న స్త్రీ ఆకర్షణీయురాలు కాదా? ఆమెను 'మగాడిదలు' రేప్ చేయరా? స్త్రీని సెక్సు దృష్టితో తప్ప మరో దృష్టితో చూడలేని తనం మగవాళ్ళదే! మగదాష్టీకాలలో (male-centric notions) ఇదికూడా ఒకటి!

హంసవింశతిలో "వాని ఇల్లాలు దొమ్మరివాని డోలు" అంటాడు. డోలుని రెండువైపులా ఎడాపెడా వాయిస్తారు ఒక వైపు ఎలపట, ఇంకొకవైపు దాపట. ఒక వైపు ఇంట్లో పతి, ఇంకోవైపు బయట ఉపపతి... తన భార్య శీలవతిగా ఇంట్లో పడి ఉండగా, పరాయి వాడి భార్య వచ్చి తనను రకరకాల చేష్టలతో ఉర్రూతలూగించి వెళ్ళాలనే మగాడి కోరికలకు ఇది ఒక మచ్చుతునక.

'లేచిపోయింది, 'వాడితో వెళ్ళింది', 'కొంగు పరిచింది' ఇలా అసభ్యంగా మాట్లాడుతూ జార, వేశ్య, సాని, తిరుగుబోతు అంటూ స్త్రీ నింద చేసే మగాళ్ళని కొరత వేసే చట్టం రావాల్సిందే, అనేకమంది స్త్రీలతో సంబంధాలున్న వాణ్ణి రసిక రాజు, రతిరాజ శేఖరుడు అని కీర్తించటాన్ని కూడా ఈ కొరత వేసే నేరంలో చేర్చాలి. విజయరాఘవ నాయకుడు తన రాణులందరినీ ఒకేసారి అనుభవిస్తుంటే ఆయన కూతుళ్ళూ, మనవళ్ళు, మనవరాళ్ళు కూడా వచ్చి గ్యాలరీలో కూర్చుని సినిమా చూసినట్టు ఆ ఛండాలం అంతా చూశారని వెర్రిమొర్రిగా రాసిన రంగాజమ్మని మహాకవయిత్రి అనేవాళ్ళ సంస్కారాన్ని ప్రశ్నించటం అవసరం కూడా! ఏ కావ్యం చూసినా ఏమున్నది గర్వకారణం...? ఉన్నదంతా ఇదే! స్త్రీల గురించి మాట్లాడటం అంటే స్త్రీ సంభోగం గురించి మాట్లాడటం తప్ప ఇంకొకటి లేదా?

సెక్సు పరమైన ఆరోగ్యము, శరీరపరమైన ఆరోగ్యమూ రెండూ ఒకదాని వలన ఒకటి బలసంపన్నమౌతుంటాయి. ఒకటి బాగుండి రెండోది బాగోక పోవటం అనేది ఉండదు. కేవలం బాగుండటానికే (pleasure only) అయితే, సెక్సుకి ఇంత ప్రాధాన్యత అక్కరలేదు. కోరుకున్న ఒక వస్తువుని పొందటానికీ, కోరుకున్న ఒక వ్యక్తిని పొందటానికీ మధ్య తేడా ఉన్నట్టే నిగ్రహానికీ, దాంపత్యానికీ మధ్య తేడా ఉంది. స్త్రీల విషయంలో బలవంతపు నిగ్రహం కొనసాగుతూనే ఉంది. ఆమె వచ్చి తన ఒళ్ళో వాలాలని కోరుకునే యాసిడ్ ప్రేమికుడు కూడా, ఆమె తనతో మాత్రమే అలా వ్యవహరించాలనీ, ఇతరుల విషయంలో పరమ పతివ్రతగా ఉండాలనీ వాదిస్తాడు. ఇది మగ గుణం, పాశ్చాత్య సంస్కృతిలో ఇది మనకన్నా ఎక్కువ. ఇది నూరుశాతం సెక్సు వివక్షతే! ఇలా అనగానే స్త్రీలకు వ్యభిచార హక్కు ఇవ్వాలంటారా...? అని కొందరు వ్యంగ్యంగా ఆడవచ్చు. పురుషుడికి ఇచ్చారు కదా మరి? ఇస్తే ఇద్దరికీ సమానంగానే ఇవ్వాలి. లేదా సమానంగానే నిరాకరించాలి. అయినా, స్త్రీ వ్యభిచరిస్తోంది పురుషుడితోనే కదా!

దాంపత్యంలో అన్యోన్యత స్త్రీ పాతివ్రత్యం మీద మాత్రమే ఆధారపడి లేదు. అది పురుషుడి జోరు ఎంత తగ్గితే అంత ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి అన్యోన్య దాంపత్యాన్ని 'పాజిటివ్ సెక్సు' అంటారు. వివక్షత లేని లైంగిక వ్యవస్థ వలన సంసారం బలపడుతుంది. స్త్రీలు తమ లైంగికతని తమ అంగీకారంతోనూ, తమ సంతృప్తి కొద్దీ, తమ ఆరోగ్య భద్రత కొద్దీ పొందే హక్కు ఇది. స్త్రీ పురుషులిద్దరూ పరస్పర అంగీకారంతో సుఖప్రదంగానూ, ఆరోగ్యదాయకంగానూ ఉండే లైంగిక కార్యానికి తలపడటాన్ని 'పాజిటివ్ సెక్సు' అని నిర్వచించుకోవచ్చు. మహిళావాదంలో కొన్ని కొత్త అడుగులు ఈ దిశలో నడుస్తున్నాయి.

పాజిటివ్ సెక్సు సిద్ధాంతంలో పురుష వ్యతిరేకత కన్నా, పురుషాధిక్య వ్యతిరేకతకు ప్రాధాన్యత కనిపిస్తుంది. ఉద్యమ కారణంగా పురుష వ్యతిరేక పదజాలం కొంత కనిపించినప్పటికీ 'పాజిటివ్ సెక్సు' అనేది 'మేల్ నెగెటివ్' కాదు. అది జెండర్ సోషలైజేషన్'ను కోరుకుంటుంది. 'లైంగిక సానుకూలతా స్త్రీవాదం (పాజిటివ్ సెక్సు ఫెమినిజం)' ఈ దిశలో మరో ముందడుగు.

పాజిటివ్ సెక్సు అనేమాట సెక్సుని పొందటానికి మాత్రమే కాదు, సెక్సుని అతిగా నిగ్రహించుకోవాల్సిన పరిస్థితుల గురించి కూడా ఆలోచిస్తుంది. సెక్సుని పొందటంలో ఆనందంతో పాటు, ప్రమాదాలు, ప్రాణాపాయాలు అనేకం పొంచి ఉన్నట్టే, నిగ్రహం పాటించే విషయంలోనూ ఉన్నాయి. సాధారణ స్థితిలో నిగ్రహించిన ఒక కోరిక మానసిక శక్తిగా "సబ్లిమేట్" అవుతుందంటాడు ఫ్రాయిడ్. కానీ, వివక్ష కారణంగా బలవంతపు నిగ్రహానికి గురికావటం వలన నిగ్రహించుకున్న ఆ కోరిక

సబ్లిమేట్ కాకుండా మనోవ్యాధిగా మారుతుంది. హిస్టీరియా లాంటి మానసిక వ్యాధులకు కారణం అతి నిగ్రహమే! యోగశ్చిత్తవృత్తి నిరోధకః అన్నారు. బ్రహ్మచర్యం అనేది మనోబల సంపన్నతతో జరిగితే 'యోగ' దాయకం! లేకపోతే 'అయోగ్యం' అయి మానసిక బలహీనతకు కారణమౌతుంది.

ముఖ్యంగా సెక్సు విషయంలో బలవంతపు నిగ్రహాలే నరాల బలహీనతకు కారణాలౌతున్నాయి.

సెక్సుని తుచ్ఛమైన లౌకిక వ్యవస్థగా భావించి మనుషులందరూ సెక్సు హీనులుగా మారాలని టీవీల్లో హోరెత్తించే ప్రవచనకారులే మానసిక బలహీనతకు మొదటి కారకులు. యుద్ధ సైనికుడికి ఆయుధా ఆయుధ ప్రయోగ విద్యలు ఇస్తే చాలదు, తగినంత మనోబలం కూడా కావాలి. స్త్రీలలో మనోబలాన్ని పెంపొందించాలని పాజిటివ్ సెక్సు సిద్ధాంతం కోరుతోంది. అది పురుషుడికే కావాలి. ఇద్దరికి సమానంగానే వుండాలి కూడా.

దాంపత్య అసమానతను ప్రశ్నించటం ఈ యుగం లక్షణం, ద్వంద్వ విలువల్ని నిరసించాల్సిందే! ఆడది అణగిమణగి ఉండటం కాదు, ఆడా, మగా ఇద్దరూ సంసారానికి సమానంగా బద్ధులుగా ఉండే సామాజిక వ్యవస్థ కావాలి! సెక్సు అనేది ప్రకృతి ధర్మం కాబట్టి, దాన్ని స్త్రీ పురుషుల మధ్య సమానంగా పంపకం చేయాల్సిన ధర్మ శాస్త్రకారుడు పురుష పక్షపాతి కావటాన ఈ అసమానతలు వచ్చాయి. సుప్రీం కోర్టు తీర్పు క్కూడా అప్పీలు ఉంటుంది. కానీ, ఇక్కడ పోరాటం తప్ప ఇంకో మార్గం లేదు.

ఆకలి వేయటం, దాహం వేయటం లాంటి నేచర్ కాల్స్ లాగానే లైంగికోత్తేజం (orgasm) కూడా! దానికి అంత ప్రాధాన్యత ఎందుకనేది సెక్సు రాడికల్ ఫెమినిష్టుల ప్రశ్న. అసహజ సెక్సు (oral, anal sex) బారిన పడకుండా స్త్రీని కాపాడాలనేది సెక్సు "పాజిటివ్ ఫెమినిష్టు"ల వాదన. 'లెస్బియాన్లు' 'గే'లు ఇంకా ఇలాంటి మనో వికారులు ఇదంతా మానవ సహజ ప్రవృత్తి అంటూ తప్పు అలవాట్లని అడ్డగించరాదని, తమ లైంగిక స్వేచ్ఛను హరించకూడదనీ పాశ్చాత్య లోకాలలో గట్టిగానే అడుగుతున్నారు. ఈ ధోరణిని భారతదేశంలో కూడా అక్కడక్కడా చూస్తూనే ఉన్నాం.

లైంగిక స్వేచ్ఛని ఇలాంటి అసహజ విధానాలకు వర్తింపచేయటం సబబేనా? ఇద్దరు ఆడవాళ్ళో లేక ఇద్దరు మగాళ్ళో సెక్సుని అసహజ పద్ధతిలో అనుభవించటం సహజ ప్రవృత్తి అనీ, చికిత్స అవసరం లేని ఒక మనస్తత్వం అనీ భావించి వదిలేయాలని ఒక మానసిక వైద్యుడు వ్యాఖ్యానిస్తే చాలా ఆశ్చర్యం వేసింది. మనోవికారాలన్నీ ఒక పరిధి వరకూ మనుషులందరికీ సహజ ప్రవృత్తులే! కానీ, ఆ వికారాల్లో జీవించటమే వ్యాధి. 'గే' అయినా, లెస్బియాన్ అయినా ఇందుకు మినహాయింపు కాదు. ఇలా

మినహాయించి మన్నించేట్లయితే, హింసించి ఆనందించే 'మగ'త్వం, యాసిడ్ పోసి లొంగదీసుకోవాలనుకునే మృగత్వం, అసహజ రీతిలో సెక్సుని పొందాలనుకునే అమానుషత్వం ఇవన్నీ కూడా సహజ ప్రవృత్తుల ముసుగులో చెలామణిలోకొచ్చే ప్రమాదం ఉంటుంది. లోకం పోకడను గమనిస్తూ, ఇలాంటి అంశాలపైన స్త్రీ వాదం ఇప్పుడు దృష్టిని సారించాల్సి ఉంది.

పిల్లల్లో యాసిడ్ సంస్కృతి, అసహజ లైంగిక ధోరణులు, సెక్సు వెర్రి మితిమీరటానికి సినిమాలనూ టీవీలను తిట్టి ఊరుకుంటే ఉపయోగం లేదు. పిల్లలు బలమైన కుటుంబ వ్యవస్థలో పెరిగితేనే వారి మనో ప్రవృత్తుల్లోని వికారాల్ని అధిగమించవచ్చని 'నియో ఫ్రాయిడియన్లు' చెప్పే విషయాల పైన కూడా అధ్యయనం జరగాలి. Sex - positive feminism, pro-sex feminism, sex - radical feminism, sexually liberal feminism ఇలా స్త్రీ వాదం చిలవలు పలవలుగా సాగుతోంది. అన్నీ మన సామాజిక పరిస్థితులకు వర్తించకపోవచ్చు. దేశీయ పరిస్థితులకు అవసరమైన, అనుగుణమైన రీతిలో స్త్రీవాదం తన రెండో దశని ప్రారంభించాల్సి ఉంది. ఇప్పటికే కొందరు రచయిత్రుల రచనల్లో ఆ ధోరణి కనిపిస్తోంది కూడా! స్త్రీ పురుషుల సమానత్వం పిల్లల బాగోగులను కాపాడేదిగా ఉండాలి. ఫెమినిజం అంటే దాంపత్య వ్యతిరేకం కాదు. సంసారాల ధ్వంసరచన దాని లక్ష్యం అంతకన్నా కాదు.

స్త్రీ పురుష సమానత ద్వారా బలమైన కుటుంబ వ్యవస్థ ఏర్పడాలని కోరుతో, ఫెమెన్ (FEMEN) ఉద్యమం ఒకటి పనిచేస్తోంది. స్త్రీ (Female) పురుష (men) సమన్వయంగా బలమైన కుటుంబ వ్యవస్థను ఫెమెనిజం కోరుతోంది.

మగాడు ఇంక తన రంగు తుడుచుకుని నిజమైన అర్ధాంగి భావనని పెంచుకోవాలి. పెళ్ళాన్ని హింసిస్తూ పార్వతిని కొలిస్తే భక్తి ఫలించకపోగా రక్తి కూడా కోల్పోతాడు. మదగజంలా 'మగిజం'తో అహంకరిస్తే, నష్టపోయేది తనే! అంకుశాలు, ముకుతాళ్ళూ ఈ మగిజాన్ని కట్టేయటానికి చాలవు. స్త్రీవాద ఉద్యమం గడ్డిపరకల్ని పేని గట్టి మోకులు తయారు చేయాలి! ఇంటి ఆరోగ్యం చక్కనకానప్పుడు ఇంట్లో పెరిగే సంతతి ఆరోగ్యవంతులు కాలేరని, బుద్ధిగా ఒదిగా ఉండి సంసారం చేసుకోవాలని మగాళ్ల బుర్రలో నాటగలిగే సాహిత్యం నేటి అవసరం. ఇది కూడా స్త్రీ వాద రచయిత్రుల వలనే సాధ్యపడుతుంది. పురుషులు ఎంత రాసినా పొడిపొడిగానే ఉంటుంది. ఆనదు!

రేపటి భారతదేశం పూర్తిగా యువతరంతో నిండిపోతుందని అంటున్నారు. ఆ యువత మనోబల సంపన్నులుగా మనోవికార రహితులుగా, సమాజ హితులుగా ఉన్నప్పుడు దేశం బాగుపడుతుంది. ఇందుకు తల్లిదండ్రులిద్దరూ సమాన బాధ్యత వహించేలా చూడాలని ఫెమినిజం కోరుతోంది. 'ఫెమినిజం' లోంచి 'ఫెమెనిజం'లోకి ప్రయాణం సాగాలి.



# శ్రీ మధులత పబ్లికేషన్స్ / శ్రీ షణ్ముఖేశ్వరి ప్రచురణలు — కేటలాగు

**డా॥ జి.వి.పూర్ణచందు, B.A.M.S., రచనలు :**

| | | |
|---|---|---|
| 1. | ఆరోగ్యం కొసం ఆహారం | 125/- |
| 2. | ఆరోగ్యం - ఆహారం సందేహాలు - సమాధానాలు | 120/- |
| 3. | ఆహారవేదం | 400/- |
| 4. | దీర్ఘాయుష్మాన్‌భవ | 60/- |
| 5. | క్విక్‌రెమిడీస్ | 50/- |
| 6. | వంటిల్లే వైద్యశాల | 100/- |
| 7. | మీ వ్యాధులకు మీరే వైద్యులు | 190/- |
| 8. | ఆరోగ్య రహస్యాలు | 75/- |
| 9. | కీళ్ళ వ్యాధులు - సులభ నివారణ | 50/- |
| 10. | జీర్ణకోశ వ్యాధులు - సులభ నివారణ | 50/- |
| 11. | షుగర్ వ్యాధి-సులభ చికిత్స | 100/- |
| 12. | బి.పి. వ్యాధి- సులభ నివారణ | 50/- |
| 13. | చిటికలో చికిత్స | 150/- |
| 14. | భోజన భోగం | 90/- |
| 15. | ఆరు రుచులతో ఆరోగ్యం | 90/- |
| 16. | ఆయుర్వేదంలో పథ్యాలు-అ పథ్యాలు | 60/- |
| 17. | ఆడవారి కోసం ఆయుర్వేదం | 50/- |
| 18. | ఆయుర్వేదంలో సులభ చికిత్సలు | 60/- |
| 19. | కొస మెరుపులు | 30/- |
| 20. | సభాపర్వం | 30/- |
| 21. | భారతీయ సభామర్యాదలు | 40/- |
| 22. | పద్యంలో మనం | 116/- |
| 23. | తెలుగుధీర (చారిత్రిక నవల) | 150/- |
| 24. | చిగురులు వేసిన కలలు (నవల) | 80/- |
| 25. | నిండు యవ్వనం | 60/- |

**డా॥ వి. చంద్రమోహన్** కిడ్నీ వ్యాధులు - అవగాహన చికిత్స 50/-

**లల్లాదేవి** వాత్స్యాయన కామ శాస్త్రం 200/-

**డా॥ కె. వేణుగోపాల రెడ్డి**

1. మధుమేహం సమగ్ర అవగాహన - చికిత్స 125/-

**డా॥ జి. సమరం**

1. వృద్ధాప్యంలో యవ్వనం 35/-
2. దాంపత్యసుఖం 30/-
3. థైరాయిడ్ ప్రాబ్లమ్స్ 40/-

**డా॥ పేకేటి గీతాశివరాం** 1. చిన్నమ్మ చిట్కాలు 100/-

2. ఆరోగ్య సంరక్షణకు అద్భుత చిట్కాలు 50/-
3. ఆరోగ్యం - అవగాహన 50/-
4. ఆహారంతో ఆరోగ్యం 50/-
5. శ్రీ శిరిడీసాయి ఆరాధన 100/-
6. స్తోత్రకదంబము 100/-
7. సర్వదేవతా అష్టకాలు 50/-
8. శ్రీ ధన్వంతరి 60/-
9. గోమాలక్ష్మి 50/-
10. శుభదినం 60/-
11. సకలదేవతాశ్రీ గాయత్రీ మంత్రాలు 60/-
12. శ్రీ తులసీ పూజా విధానము 60/-

డా॥ యక్కటి సుధాకర్‌బాబు రచనలు :

1. మీరు...అమ్మానాన్న కాగలరు...! 75/-
2. మీ.. అందం...ఆరోగ్యం పెంచుకోవడం ఎలా? 45/-

**డా॥ జె. శ్రీమన్నారాయణ** :గుండెజబ్బులు నివారణ - చికిత్స 100/-

**డా॥ రవికూమార్ ఆలూరి** : ఇది గుండె గుట్టు 60/-

**డా॥ పావుశెట్టి శ్రీధర్** : హోమియోతో సంపూర్ణ ఆరోగ్యం 60/-

**డా॥ రావుల ఫణికృష్ణ, డా॥ గోవింద్ ఆర్. వర్మ** : జీర్ణకోశ ఆరోగ్యం 80/-

యద్రా సత్యనారాయణ :స్పోకెన్ ఇంగ్లీష్ కోర్స్ లెవల్ I to V (5x70) 350/-

**M.D. నఫీజుద్దీన్, M.A.(Litt.) రచనలు :**

1. ఫాస్ట్ లెర్న్ యువర్ వకాబలరీ & గ్రామర్ 20/-
2. ఈజీ స్టెప్స్ టు లెర్న్ వర్డ్ ఫార్మేషన్ 20/-

వి.జి. భవాని

1. స్టూడెంట్ స్పోకెన్ ఇంగ్లీష్ 50/-
2. అత్యంత సులభ పద్ధతుల్లో ఇంగ్లీషు గ్రామర్ నేర్చుకోండి ! 65/-



# డా॥ జి.వి. పూర్ణచందు B.A.M.S., రచనలు




Rs.400/-




Rs.100/-




Rs.60/-




Rs.75/-




Rs.50/-




Rs.50/-




Rs.90/-




Rs.50/-




Rs.50/-




Rs.60/-




Rs.60/-




Rs.150/-




Rs.60/-




Rs.100/-




Rs.125/-




Rs.120/-




Rs.90/-




Rs.190/-



Rs.150/-




Rs.100/-




Rs.80/-




Rs.116/-




Rs.40/-






శ్రీ మధులత పబ్లికేషన్స్ 28-3-49, అరండల్‌పేట, విజయవాడ - 2 (ఆం.ప్ర) Cell : 9440172936 9032088555


154

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | G.V.P01D82 | Date | 8/1/21 |
| | yes | Back Cover | yes |
| Blank Pages | C.P, 153. | | |
| Missing Pages | no | | |
| Prepared | Lakshmi | Scanned | Ramya |
| BOOK SIZE | H 8.4 W 5.5 | Pages | 157 |